


ఇటీవల సమాజంలో పలు పరిణామాలు సంభవిస్తున్నాయి. ఆధునిక అభివృద్ధి పేరిట సైన్సు, టెక్నాలజీ విపరీతంగా విస్తరిస్తుంది. గ్లోబలైజేషన్, ఆటోమైజేషన్‌తో పాటు ఇంత సైన్సు, టెక్నాలజీ సమాజానికి అవసరమా అనే చర్చ ఉండనే ఉంది. సైన్సు, టెక్నాలజీ అభివృద్ధి ద్వారా జీవితంలో కోల్పోతున్నదేమిటో, పొందగలిగేది ఏమిటో ఒక స్పష్టత అవసరం.

సాహిత్యం సమాజాన్ని చిత్రించడంతో పాటు ఒక సందేశాన్నివ్వాలి. అది వాచ్యంగా కాకుండా చదువరులు స్వయంగా గ్రహించగలిగేదిగా ఉండాలి. సాహిత్యం ఉత్తమ ఆదర్శాలను సమాజానికందించాలి. బతుకు పయనంలో, ప్రజలు కష్ట సుఖాల్లో ఆశావిశ్వాసాల్ని, పీడితులకు నైతిక మద్దతును అందించాలి. సాహిత్యం, కళలు ప్రజల వ్యక్తిత్వాల్ని, సంస్కృతిని మానవీయ మానవ సంబంధాల్ని తీర్చిదిద్దగలిగినప్పుడు అవి ప్రజల జీవనయానంలో భాగమవుతాయి.

సామాజిక తత్వవేత్తగా సుప్రసిద్ధులైన బి.ఎస్. రాములుగారు ఈ విషయంలో ముందుచూపుతో మార్గదర్శనం చేయగల సమర్థులు. తాత్విక విశ్లేషణకు కథను ఒక ప్రక్రియగా ఎన్నుకున్న బి.ఎస్. రాములు గారు తన కథల్లో సమకాలీన చరిత్రను, సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక సంబంధాలను, జీవితంలో సైన్సు తెస్తున్న మార్పులను ప్రత్యేక దృష్టితో చిత్రిస్తున్నారు. ఈ ఒరవడిలో ఇది మరో కథల సంపుటి.

– కొక్కుల భాస్కర్, గూడూరి సీతారాం – సంపాదకులు

బతుకు పయనం • బి.ఎస్.రాములు కథలు





# బతుకు పయనం

బి.ఎస్.రాములు

కథలు

కథలసూచిక


| | |
|---|---|
| 1. నానమ్మ | 9 |
| 2. రాత్రి పూలు | 16 |
| 3. బతుకు పయనం | 20 |
| 4. ప్రశాంతం | 38 |
| 5. జైలు జీవితం | 46 |
| 6. ఇంటల్లుడు | 55 |
| 7. జీవన యానం | 63-116 |


# నానమ్మ

అన్నయ్య ఉత్తరం... నానమ్మ సంవత్సరీకం – తప్పక రావాలని...

నానమ్మ పోయి అపుడే ఎనిమిది నెలలవుతోందా... ఇంకా కళ్ళముందు ఉన్నట్టే ఉంది... నానమ్మ నిజంగా పోయిందా.. నాలో లేదూ... నాలో సగం నానమ్మే. మిగతా సగం అమ్మ. అమ్మ నానమ్మ కలిపితే నేను... వాళ్ళిద్దరు కాకుండా నాలో నాదంటూ వ్యక్తిత్వం వేరే ఉందా... ఏమో... ఆ విషయం తెలిసిన వాళ్ళు చెప్పాలి.

నాపై నాన్న ముద్రా తాత ముద్రా తక్కువ. నా పై అమ్మకన్నా నానమ్మ ముద్ర ఎక్కువ. నా పెంపకం అలా జరిగింది. నన్ను నా స్నేహితురాళ్ళు అచ్చం నానమ్మల్లా మాట్లాడతవేమే అని వెక్కిరించేవాళ్ళు. నాకామాట కోపం తెప్పించే బదులు ఎంత సంతోషాన్నిచ్చేదో. నానమ్మలా ఎంతో పెద్దయిపోయినట్టు... ఎంతో తెల్సిపోయినట్టు...

నేను పుట్టకముందే నానమ్మ పుట్టిందట. నాన్న పుట్టక ముందే నానమ్మ పుట్టిందట. చిన్న నానమ్మకన్నా పదేళ్ళముందే పుట్టిందట. నీ వయసెంత నానమ్మా అంటే యిలాంటి కథలు చెప్తుంది నానమ్మ.

నిజంగా నానమ్మలకు అమ్మమ్మలకు వయస్సుంటుందా! దేవతలకు వయస్సుంటుందా. వాళ్ళు ఎపుడూ ఒకేలా కనపడతారు. మనం ఎలా చూస్తే అలా కనబడతారు. ఎన్నేళ్ళయినా ఎన్ని తరాలు మారినా... చనిపోయినా... నానమ్మలూ దేవతలూ ఒకేలా కనబడతారేమో.

అమ్మలకూ నానమ్మలకూ వయసుండదు. వాళ్ళ దగ్గర ఏ వయస్సులో నైనా పసిపిల్లల్లా గారాబం చేయవచ్చు. నవ్వుతూ ఏడుస్తూ సతాయించుకుంటూ వాళ్ళ కొంగు పట్టుకు తిరగడానికి వయస్సు అడ్డంరాదు. నన్నెపుడూ చిన్నపిల్లని చేసిపడేసే శక్తి నానమ్మకెలా అబ్బిందో...

నేను పదో తరగతిలో ఉన్నపుడు మాత్రం నానమ్మ నన్ను "చిన్నపిల్ల... అమాయకురాలు ఎలా బతుకుతుందో"! అన్నట్టు చూస్తుంటే ఉక్రోశం వచ్చేది. పది చదువుతున్న నేనింకా చిన్నపిల్లనేనా అని రోషంగా చూసేదాన్ని. అదెంతో కాలం లేదు. నాలుగైదేళ్ళు పోయాక నానమ్మ ముందు నేను మళ్ళీ చిన్నపిల్లనై పోయాను. అప్పట్నించిక ఎపుడూ నానమ్మకు నేను చిన్నపిల్లనే. ఎవరో ఒకర్తో నేను చిన్నపిల్లనే అని అన్పించుకోవాలని ప్రతి ప్రాణీ కోరుకుంటుందేమో. అది జీవితానికి తిరిగి స్వచ్ఛంగా పసితనాన్నిస్తుంది.

నానమ్మకు నేనంటే ఎంత యిష్టమో... చిన్నప్పుడు నానమ్మ అచ్చం నాలాగే ఉండేదట. "మా అవ్వవే నువ్వు... నన్ను లాలించిన అవ్వవే... మా అవ్వనే మల్లా నువ్వై పుట్టినవే..." అంటూ నన్ను ఎత్తుకొని ఆడించేది నానమ్మ.

మరోసారి అన్నయ్య ఉత్తరం చదివాను. అన్నయ్య నాకిచ్చిన సంజాయిషీ.. మళ్ళీ చదవాలనిపించింది.

ప్రియమైన ద్యావనపెల్లి గంగాధర్ బావగారికి,

పదివేల నమస్కారములతో మీ బావమరిది లక్ష్మిరాజం రాయునది, చెల్లె యిక్కడ పదిరోజులుండేటట్లు తప్పక పంపగలరని కోరుతున్నాను. నానమ్మ సంవత్సరీకం రోజున మీరందరు రావాలని మరిమరి ప్రార్థిస్తున్నాను. అందరికీ నమస్కారాలు తెలుపగలరు. సుగుణా- తప్పక వెంటనే బయలుదేరగలవు.



సుగుణా! ఇలా ఇంత తొందరగా సంవత్సరీకం చేస్తున్నందుకు నువ్వు తప్పు తీయవద్దని కోరుతున్నాను. నానమ్మకు అయిదు రోజులల్ల పదకొండు రోజుల పెద్దకర్మ చేసినపుడు నానమ్మ మీద గింత ప్రేమలేదా... అయిదు రోజులకే చేస్తరా పెద్దకర్మ. గట్ల చేస్తే నానమ్మ ఎపుడు చస్తదని మీరు ఎదురు చూసిర్రేమో అని అనుమానం వస్తున్నదని ఏడ్చి లొల్లిచేస్తివి. నీ మేనకోడలు పెళ్ళి ముహూర్తం కోసం ఇలా సర్దుబాటు చేయాల్సి వచ్చింది. ఇపుడు వచ్చే ముహూర్తాలు తప్పితే మల్ల ఉగాది తర్వాత నేనట.

పెండ్లి పిల్లగానికి వండుకునుడు తిప్పలైతున్నట్టుంది. పెండ్లికి ఎగిర్త పడుతున్నడు. వేరే సంబంధాలు యింతకన్న ఎక్వ కట్నం యిస్తమని వస్తున్నరు. సుగుణా! ఆడపిల్ల తండ్రిగా నా ఆవేదనను అర్థం చేసికోగలవని కోరుతున్నాను. నువ్వు పదిరోజులు ఇక్కడ ఉండేటట్లు వెంటనే బయలుదేరి రాగలవు. నానమ్మకు తాత సమాధి పక్కనే సమాధి కడ్దామనుకుంటిమి. ఎక్కడోల్లం అక్కడనే ఉంటిమి. మల్ల కలువకపోయిరి. నువ్వు వచ్చినంకనే అన్నీ మాట్లాడుదాము. నువ్వు కోరినట్టు తాత సమాధి పక్కన నానమ్మ సమాధి కట్టాలంటే నువ్వు పదిరోజులు యిక్కడే ఉండి నువ్వే కట్టించాలి.

ఇట్లు
మీ అన్న-లక్ష్మిరాజం

ఉత్తరం చూసిన్నించి నాకు కాలునిలువడం లేదు. ఎప్పుడు తల్లిగారింటికి పోదామా అని ధ్యాస మళ్ళింది. ఉత్తరాన్ని మేనకోడలు సుజాతే రాసినట్టుంది. ఇది దాని రాతే... పిల్లగానికన్న మంచి పెండ్లి సంబంధం ఎత్తిపోతదని దీనికే తొందరున్నట్టున్నది. ఎంతో కుదురుగ రాసింది... నానమ్మ పోయి అపుడే ఎనిమిది నెలలవుతోందా!

బస్సు ఎంత వేగంగా పోతున్నా కదులుతున్నట్టే అన్పించడం లేదు. నా ఆలోచనల వేగాన్ని బస్సు ఎలా అందుకోగలదు!

నాన్నపోంగనే అమ్మ బతుకు ఎట్లయిపోయింది. ఒక నెల ఆ అన్నయింట్ల, ఒక నెల ఈ అన్నయింట్ల. ఓ నెల తమ్ముని యింట్ల. ఇదేం తిరుగుడు నెలకోసారి. వాళ్ల ఉద్యోగాలు యిట్లా నెలకో చోటికి బదిలీ చేస్తే వాళ్లకు ఎట్లా ఉంటుంది.

అన్నయ్యను నెలకోస్కూలులో పనిచేయమంటే ఎలా ఉంటుంది? నెలకో ఊరు తిరుగుడు అమ్మకు అట్లా ఉండదా... నానమ్మ పోయినాకైనా "యిక

ఎప్పటికి నా దగ్గర్నే ఉండే" అంటే అది వినది.

"బిడ్డ యింటికాడ ఉంటే లోకం ఏమనుకుంటదే... వద్దు" అని అంటది.

ఈసారి అమ్మను తప్పక ఇంటికి తీసుకురావాలె. నానమ్మకు సొంత కూతురిలా ఏళ్ళ తరబడి సేవలు చేసిన అమ్మకు యిప్పుడు విశ్రాంతి కావాలె.

అమ్మమ్మ నానమ్మ, తాత వంటి పెద్ద మనుషులు ఉంటే ఆ యిల్లు ఆ తీరే వేరు. పెద్ద మనుషులు యింట్లో ఉంటే యింటికి ముత్తయిదువ తనం వచ్చినట్టుంటది. ఇల్లు నిండుగ వుంటది. ఇల్లంతా పండుగ తీరుంటది. పెద్ద వాళ్లనుండి మనుమలు, మనుమరాళ్ళు ఎన్ని విషయాలు నేర్చుకుంటారో... పిల్లలు టి.వి. ధ్యాస్యలోపడి పాడయిపోతున్నారు. అమ్మను తప్పక తీసుకరావాలె. కమ్మని కథలెన్నో చెప్పించాలె.

నానమ్మ ఎన్ని కథలు చెప్పేది. ఎంత కష్టపడి పనిచేసేది. ఎన్ని పిడుకలు ఏరుకొచ్చేది. ఏ పనిమీద పోయినా పెండ కనపడితే అరిచేతుల్లోనైనా తెచ్చేది గాని వదిలేది కాదు.

నానమ్మ రాట్నం వడుకుతుంటే చూడాలె. రాట్నం ఆముదం కందెనతో మెత్తగా జుమ్మంటుండేది. దారం కండెగా కదురుకు చుట్టుకుంటూ వడుకుతున్న పోగు వెంటదారం ఏకు దాకా జుమ్మంటూ నాదం చేస్తుంటే ఎంత మధురంగా ఉండేదో.

రాట్నం వడుకుతుంటే వీపు మీంచి నానమ్మ మీద వేలాడి చూస్తూ ఉంటే... దారం వనుకుతున్నదే పోగు దొడ్డు వస్తున్నది. లెవ్వె పోరి అని ప్రేమగా విసుక్కుంటుంటే... నానమ్మ చెమట ఎంత కమ్మని వాసన.

నానమ్మ పద్దెంది మూళ్ళ చీరే గోసి పోసి పిరిసిట్టి కట్టుకట్టిందంటే దేవత లెక్క కనపడేది. నానమ్మ జాకెట్టు వేసుకొనేదికాదు. బటన్సులేని రవిక ముడి వేసుకునేది. నానమ్మ తెల్లవెంట్రుకలు వెండితీగల తీరు ఎంత ముద్దుగ ఉండేవో...

నానమ్మ రాట్నం వడుకుతుంటే ఓ ఫోటో తీసి గాంధీ తాత రాట్నం వడికే బొమ్మ పక్కన పెట్టాలనిపిస్తుండే. రాట్నం వడుకుతున్నపుడు గాంధీ తాత కన్నా నానమ్మరూపే ఎంతో బాగుంటుంది.

నానమ్మ వడికిన నూలుతోనే యాభయి ఏండ్లు మా యింట్లో దుప్పట్లన్నీ నేయించారట.



ఊరివాళ్ళకోసం నానమ్మ దుప్పట్లకని దొడ్డు నూలు వడుకుతుండేది. తూకంతో కండెలు యిచ్చి నేసినంక తూకం తోనే గంజి బరువుకలిసి లెక్కేసి దుప్పట్లు తీసుకొని కూలియిచ్చేవాళ్లట. ఖాదీ దుప్పటి రెండు పొరలు కుట్టించి కప్పుకుంటే ఉతుకుటానికి చాకలి ముసలమ్మ గులిగేది. అంత బరువుండేది.

తన కాల్లగోల్ల (శోభనం)కు నానమ్మ ఎంతో కష్టపడి మంచి పత్తి తెప్పించి ఏకులు చేయించి నూలు వడికి దుప్పటి నేయించి యిచ్చింది. చలికాలం ఆ దుప్పటి వెచ్చగ కప్పుకుంటే ఈయన "ఛీ గంజి వాసన." అని తీసిపారేస్తుంటే నా మనస్సు ఎంత కలుక్కుమన్నదో. పుల్లని గంజివాసనలో పుట్టి గంజి వాసనలో పనిచేసే శాలోల్లకు గంజి గంజి వాసనవస్తుందా! ఆ వాసనచూస్తే ప్రాణం లేచి వచ్చినట్టు ఉంటుంది.

శాలోల్ల యిండ్లల్ల పుల్లని గంజి వాసన, తడిపిన నూలు వాసన ఎంతో కమ్మగా ఉండేవి. ఆ నూలు, ఆ రంగులు, గంజి, అన్నీ కలిపి అదోరకం కమ్మని వాసన వచ్చేది. ఆ వాసనరాని యిల్లు శాలోల్ల యిల్లంటే నమ్మబుద్ధి అయ్యేదికాదు.

"బొంబాయిల సాంచాలు (మిల్లులు) అంటూ తేలినంక శాలోల్లందరి బతుకు ఆగం అయిపోయిందే". అని నానమ్మ అంటుండేది. " వద్దనంగ పెద్దనాన్న బొంబాయి పోయి ఏంబావుకున్నడే" అని ఎప్పుడూ బాధపడుతుండేది. పెద్దనాన్న పిల్లల్ని చూడాలని నానమ్మకు ఎంతో ఆరాటం. పెద్దనాన్న బొంబాయికి తీసుకు వెళ్ళేవాడుకాదు. వాళ్లు ఇక్కడికి వచ్చేవాళ్ళుకాదు ఎప్పుడో చుక్కతెగిపడ్డట్టు తప్ప. ఈసారయినా వస్తారోలేదో.

నాన్న సాదామొగ్గాలతో పోటీ పడలేక సట్టర్ మొగ్గాలు చేయించిండు. బట్టమీద డిజైన్లు రావడానికి ఎన్నో ఉపాయాలు చేసి పింజర కనుక్కున్నారు. నాన్న నేస్తున్నపుడు పైన పింజర తిరుగుతుంటే కింద బట్టమీద నూలు పోగులు జరుగుతూ డిజైనుగా మారుతుంటే చూసిన కొద్దీ చూడబుద్ధయ్యేది.

తాత ఓసారి నానమ్మను ఏమాయెనే కండెలు అందియ్యవూ అని పంటెతోని కొట్టిండట. నానమ్మ పిల్లల్ని సగవెట్టుకుంట అలికి వంట చేసుకుంట కండెలు వడుకాలె. వీపుల దెబ్బదాకి "నీ యింట్ల పీనుగెల్ల ఆడ్సిపడ్డల(అకస్మాత్తుగా) ఎంత దెబ్బగొడ్తివి" అని అదే పంటె(నూలుచుట్టేది) దీస్కొని తాతను రెండు ఈడ్చి కొట్టిందట. ఇక అప్పట్నించి తాతది మాట బెదురే తప్ప చెయ్యి లేపలేదట.

"ఈ మొగోల్లు ఉత్తపనిదొంగలే. పని మనది పేరు వాళ్ళది. పడుగు

పోసుడు, గంజి తెచ్చుడు, కండెలు చుట్టుడు, వంట చేసుడు, పోరగాన్లను సవరిచ్చుడు అన్ని చేసుకుంట మల్ల మొగ్గంనేయాలె. అంచునెయ్యాలె ఆడోల్లు. మొగోల్లు ఏమున్నదే పడుగు సరిచేసి నేసి అమ్ముకచ్చుడు. గంతే అమ్ముకరాను వోయి రాంగరాంగ తాల్లల్ల కల్లు దాగి అంత మందం ధర తక్కువకు అమ్మిందని అబద్దాలాడుతరు."

"ఈ సంసారం ఒక్క తీరు చేస్తే పురి కట్టిందానే! మనకు పొలాలు లేకపాయె, పెరండ్లు లేకపోయె. ఇత్తులు ఏది కొన్నా ధరలు అగ్గిమండె. కూలికి పోయి ఇత్తులు తెస్తుంటి. మక్క గట్క అందరు తింటె నాకు అది గూడ దొరకక పోవు. గంజిల ఉప్పురవ్వ ఏసుకుని తాగి పంటే ఆకలికి రాత్రికి పేగులు కడుపు నొప్పితోటి వడి తిరుగుతుండె."

"బట్టనేత అంటే ఆడిసేత లేనిది అసలే కాదే. ఇంట్ల ఆడిది పోతే కుల కశిపి పోయినట్టేనే. ఆ యిల్లు యిల్లు గాదు. గాడిదలు పొర్లినట్టుంటది. పోరగాన్లు దుబ్బల పొర్లినట్టుంటరు."

నానమ్మ ఇలా ఎన్ని చెప్పేదో... నానమ్మ నడుస్తున్న జీవిత చరిత్ర తీరుండేది.

---

బస్సు దిగి అన్నయ్య ఇంటికి చేరే తోవలో ఓ గుంపు నిశ్శబ్దంగా వుంది. మళ్ళీ ఎవరో ఉరి వేసుకొని చనిపోలేదు గదా అని మనస్సు బాధతో నిండి పోయింది.

దగ్గరిచుట్టాలే వాళ్ళు. దగ్గరగా వెళ్ళిచూసేసరికి సన్నగా మాటలు వినపడుతున్నాయి.

ఎదిగిన కూతురు ఎవరితోనో లేచిపోయింది "పెళ్ళి చేయలేదని నాన్నా బాధపడకు– మా బాధలేవో మేం పడుతాము." అని ఉత్తరం రాసిపెట్టిపోయిందట.

నానమ్మ, గాంధీ తాత ఇద్దరూ కళ్ళల్లో మెదిలారు. ఇలాంటి చేనేత బతుకులు చూడకుండా ముందేవెళ్ళిపోయిన మీరెంత అదృష్టవంతులు.

"గాంధీ తాతా! రాట్నాన్ని జాతి చిహ్నంగా జెండానెక్కించావు. మా బతుకులకేమిచ్చావు ఆధారం" అంటూ మనస్సు మూగగా ప్రశ్నించింది.



"సుగుణక్కా" అంటూ మేనకోడలు సుజాత పరుగున ఎదురొచ్చింది చూడలేదు. దాని మొహంలో పెళ్ళికళ. దాని మొహంలో నానమ్మే కనపడింది. మళ్ళీ పుట్టిన నానమ్మ నాదేవత. ఎనిమిదినెల్లలోనే ఎంత ఎదిగింది. దేవకన్య వోలెఎదురొచ్చింది. దీని పెండ్లికోసం పెండ్లి నగలేమి చేయించుకొని రాకపోతినని మనస్సు విలవిలలాడింది.

అన్నయ్య ఉత్తరం వచ్చిన్నుంచి ఎప్పుడూ నాగురించే తప్ప దాని గురించి ఎందుకు ఆలోచన రాలేదో ఆశ్చర్యం... మళ్ళీ పుట్టిన నానమ్మకి ఏదైనా పెళ్ళికి చేయించాలి.

నా చేతిలోని సూటుకేసు తీసుకొని సుజాత ఇంటికేసి దారి తీసింది.

**ఆదివారం ఆంధ్రజ్యోతి**

# రాత్రి పూలు

"అన్నయ్యా! నీ భావాలవల్ల నువ్వు నీ జీవితాన్ని చాలా నష్టపోయావు. నీ బతుకుపొద్దు పడమటికి వంగింది. నీతోటి వాళ్ళు ఎపుడో ఆగిపోయారు. వాళ్ళు చేసిందానికన్నా ఎన్నో రెట్లు ఫలాలు అనుభవిస్తున్నారు. నువ్వు చేసినకాడికి చాలు. నువ్వు చెయాల్సింది యిక యువతరం చేయాలి. చేస్తుంది. నేనింకా ఎన్నాళ్ళో బతకనని నీకు తెల్సు. నా చివరి కోరిక మన్నిస్తావు గదూ!"

ప్రమీల ఏడుస్తోంది...

రమేశ్ మనస్సు భారమైంది... గొంతు పెకలలేదు.

ఆసుపత్రి గదిలో నిశ్శబ్దం... బెడ్‌పై ప్రమీల. మంచం ప్రక్కనే స్టూలు మీద రమేశ్.

చెల్లెలు ప్రమీల కళ్ళను తుడిచాడు రమేశ్.

"ప్రమీలా! అలా అనకు. నువ్వు తప్పక బతుకుతావు. నిరాశ పనికి రాదు. ఆత్మ విశ్వాసం రోగాల్ని కూడా జయిస్తుంది".

"అన్నయా! మాట మార్చకు. డాక్టరు ఏం చెప్పాడో అంతా నాకు తెల్సు. నా గురించి కాదు. నీగురించి బాధపడుతున్నాను. మా కోసం... ఇతరుల కోసం నువ్వు చేసిన త్యాగాలు చాలు..."

"ప్రమీ! కొన్ని నక్షత్రాలు చూడు. వెన్నెల లేనపుడు దారి చూపుతాయి. వెన్నెల ఉంటే అవి కనపడవు. అలాగే కొన్ని పూలు రాత్రి పూసి పొద్దు పొడవడంతో రాలిపోతాయి. కొన్ని ఉదయం పూసి మధ్యాహ్నానికే వాడిపోతాయి. ముగ్గురి జీవితాల్లో ఆశల చిరుదీపంవెలిగించిన నీ జీవితం కొడిగట్టడం నన్నెంత బాధిస్తున్నదో... నా గురించి నేను ఆలోచించుకునే టైం లేదు. ఆ టైం రాకుండానే గడిచిపోవాలని నా కోరిక'".

"అన్నయా! రెండు నెలలుగా మంచంలోపడి చావు అంటే ఏమిటో తెల్సుకున్నాను. నాకిపుడు నా గురించి బాధలేదు. నా మనస్సు చాలా ప్రశాంతంగా ఉంది. నీ కన్నా చాలా చిన్నదాన్ని. కాని ఒక్కటి అడుగుతాను. ఈ క్షణంలో నీవు చనిపోతావని తెల్సింది. ఏం చేస్తావు? ఇపుడు అదే చేయి. నీ త్యాగం, నీ భావాలు నిన్ను నీవు శిక్షించుకోవడంగా పరిణమించకూడదు కదా!"

"ప్రమీ! జీవితం అంటే ఏమిటి! బతుకంతా గడిచాక ఈ ప్రశ్న వేసుకొని ఏం లాభం? బతికినంత కాలం ఈ ప్రశ్నే ఎదురుకాదు. ఇదో విచిత్రం"

"ప్రమీ! నేను చాలా కోల్పోయానని, జీవితాన్ని నష్టపోయానని ఎందుకు బాధపడ్తావు. అది నీ దృష్టి... నేను కోల్పోయిందానికన్నా పొందిందే ఎక్కువ. మీ ప్రేమ నేను చేసిందానికన్నా ఎన్నో రెట్లు ఎక్కువ." నేను జీవితాన్ని ఓడిపోలేదని, ఉన్నతమైన జీవితాన్నే గెలుచుకున్నాననే తృప్తినైనా నాకు మిగల నివ్వు".

"అన్నయా! అంత మాటంటే నిన్ను ఏమీ అడగను". అన్నయ్య కళ్ళల్లోకి సుదీర్ఘంగా చూసి కన్నీళ్ళు పెట్టుకొంది ప్రమీల. కనురెప్పలు మూత పడ్డాయి. చెంపమీదుగా సన్నని ధార మగతగా ఒరిగింది. ఏవేవో జ్ఞాపకాలు...

తనకు నచ్చని త్యాగాలను చూసి మనిషి అసూయ పడ్తాడా? ఆ అసూయ జాలి, సానుభూతి రూపంలో వ్యక్తమవుతుందా!

మొదటిసారిగా ప్రమీలకు సందేహం కలిగింది. రమేశ్ అన్నయ్య కుటుంబం కోసం చాలా చేశాడు. సమాజం కోసంకూడా చాలా చేశాడు. రక రకాల ఉద్యమాల్లో తిరిగాడు. ఎన్నో ఉద్యమాలు తానే ముందుండి నడిపాడు.

ఉద్యమం ఒక నిర్మాణ రూపం తీసుకోగానే క్రమంగా నాయకత్వ పోటీ నుండి తప్పుకునేవాడు.

పోటీ పడ్డం అతని స్వభావం కాదు. పోటీ నుండి తప్పుకోవడం అతని సహజ లక్షణమైపోయింది. పోటీ నుండి తప్పుకొని తనదైన దారిలో కొత్త దారి వేసేవాడు.

'రాజ్యం'ను ఈ పోటీలో గెలుచుకోవడం యిష్టం లేదు. పోటీపడి గెలుచుకోవడం నామోషి అన్పించింది. తన ప్రేమను, యిష్టాన్ని ఉదాసీనతగా మార్చుకున్నాడు. రాజ్యం తన ప్రేమను వ్యక్తం చేయలేకపోయింది. పైగా 'అన్నయ్య' ప్రేమించడం మానేశాడని గొణిగింది. తప్పు పట్టింది. పోటీపడి ప్రేమిస్తున్న లక్ష్మణ్‌ను ప్రేమించానంది. పెళ్ళి చేసుకుంది.

అప్పట్నుంచి పోటీపట్ల, పోటీపరీక్షల పట్ల ఆసక్తి పోయింది. అనుకోకుండా వచ్చిన ఉద్యోగాన్ని సరిపెట్టుకుని అందర్నీ యింతవారిని చేశాడు.

---

అన్నయ్య మాటలు గుండెలోతులో మళ్ళీ మళ్ళీ ప్రతిధ్వనిస్తున్నాయి. ఎంతసేపు నిద్ర పోయిందో.

రాత్రయ్యింది. మగతగా మెల్లగా కళ్ళు తెరిచింది.

అన్నయ్య అలాగే చూస్తున్నాడు. చెల్లి కళ్ళుతెరవడంచూసి నవ్వాడు. చెల్లెలు మళ్ళీ ధైర్యం తెచ్చుకుంది.

"అన్నయ్య... చెల్లెలు పెళ్ళయ్యేదాక పెళ్ళి చేసుకోనన్నావు. నా పెళ్ళయి పోయింది. మళ్ళీ చిన్నచెల్లెలు పెళ్ళి అన్నావు. దాని పెళ్ళీ అయిపోయింది. దానికీ యిద్దరు పిల్లలయ్యారు. నిన్ను అడగడానికి అందరికీ భయమే. అసలు నువ్వెందుకు పెళ్ళి చేసికోవడం లేదు అన్నయ్యా!"

"ప్రమీ! పెళ్ళే జీవితానికి పరమార్ధం అనుకోను".

" ఈ చెల్లెళ్ల పెళ్ళిళ్ళు, పురుళ్ళు, కట్నాలు, ఖర్చుల కోసం అని నీవు పెళ్ళి చేసికోవడం మానేశావు".

"అదేం కాదు."

"నువ్వు ప్రేమించిన రాజ్యం నిన్ను ప్రేమించలేదని వైరాగ్యమా!"

"మొదట అదే ఉండేది. ఇపుడు రాజ్యం మీద కోపం ఏమీ లేదు".



"నువ్వు అసలే పెళ్ళి చేసికోక పోవడం చూసి రాజ్యం బాధపడ్తోంది".

"ఆమెను బాధపెట్టడం నా ఉద్దేశం కాదు. అలా అని ఆమె సంతోషం కోసం నేను పెళ్ళి చేసికోలేను."

"ఏం సాధిద్దామని, ఎవర్ని సాధిద్దామని"!

"పెళ్ళి చేసికొని మీరంతా ఏం సాధిద్దామనుకున్నారు? ఏం సాధించారని? ప్రకృతిలో పశు పక్ష్యాదులూ, ప్రతి ప్రాణీ పిల్లల్ని కంటున్నాయి. అదేనా మీరు సాధించింది?"

" అన్నయా!... అదే లేక పోతే ఈ ప్రపంచమే లేదు. నువ్వు లేవు నేను లేను."

"అదే ప్రపంచమా!"

"కాదు."

"అయినపుడు నా యిష్టప్రకారం నన్ను బతకనీ"

ప్రమీల మూగబోయింది.

"ప్రమీ! నా భావాలే నన్ను బతికిస్తున్నాయి. నీవు సమాజం కోసం చేస్తున్నాని అంటున్నదంతా నిజానికి నాకోసమే. అదే నా ఆనందం. నా భావాలు వదులుకోమనడం నన్ను చనిపోవాలని కోరడం తప్ప వేరు కాదు."

అన్నయ్యతో అంతగా వాదించడం యిదే మొదటిసారి. బహుశ చివరిసారి కూడా! అనుకుంది ప్రమీల. చూపుతిప్పుకుంది.

కిటీకిలోంచి ఆకాశంలో చుక్కలు రాత్రిపూలలా మిలమిల మెరుస్తున్నాయి.

"అన్నయా! నేను జీవితంలో అమ్మతనం సాధించాను. ఈ జీవితానికి యిది చాలు".

తృప్తిగా కళ్ళు మూసుకుంది ప్రమీల. రమేష్ ఆత్మీయంగా తలపై చెయ్యితో నిమిరాడు.

**ఆదివారం వార్త**

# బతుకు పయనం

"....పిల్లవాడు బెంగుళూర్లో సాఫ్టువేర్ యింజనీర్‌గా పని చేస్తున్నాడు. మ్యారేజీ బ్యూరోలోంచి బయోడాటా రాసు కొచ్చిన. పిల్లవానితోటి ఫోన్లో మాట్లాడిన. ఈ సంబంధం సెటిల్ అయ్యేట్టు కనపడు తున్నది. వాళ్ళకు కట్నం మీద కూడా పెద్ద పట్టింపులు లేవన్నరు. అమ్మాయికి స్టేట్స్ లో సాఫ్టువేర్ యింజనీర్‌గా పనిచేసే అర్హత లుంటే చాలు అని అన్నరు.

అతడు వితిన్ వన్నియర్‌ల స్టేట్స్‌కు పోయే అవకాశం ఉందట. మీ నేటివ్ అక్కడే గద. మీరొకసారి పోయి పిల్లవాని ఫ్యామిలీ బ్యాగ్రౌండ్ తెల్సుకుంటే మన దివ్య గురించి ప్రొసీడవుదాం".

బీడియల్‌ల్లో సైంటిస్ట్‌గా పని చేస్తున్న శివరాజం ఫోన్లో అరగంట నుంచి చంద్రమౌళిని మళ్ళీ మళ్ళీ బతిమాలు తున్నాడు.

"అలాగే-అలాగే. నాక్కూడా కొంత రీసెర్చ్ వర్కుంది. రెండు మూడు రోజులు అటే వుంట. వాళ్ళ ఊరికి కూడా పోయొస్త. ఓ.కె. తప్పకుండా..." అంటూ ఫోన్ పెట్టేశాడు చంద్రమౌళి.

ఆరోజు సాయంత్రమే జగిత్యాల బయల్దేరాడు చంద్రమౌళి.

జగిత్యాల మిషన్ కాంపౌండ్‌లో రామేశం అనే ఫ్రెండింట్లో దిగిన చంద్రమౌళి పెళ్ళి సంబంధం గురించి రొటీన్‌గా అడిగాడు. రామేశం అయిదారుగురికి ఫోన్ చేసి వివరాలు రాబట్టాడు.

"ఆ పిల్లవాని తండ్రి లస్మయ్య కటకం లింగయ్య దగ్గర కూలికి బట్టలు నేస్తడట. ఒక తమ్ముడు, యిద్దరు చెల్లెండ్లున్నరట. మొత్తం ఫ్యామిలీల చదువుకొని ఎదిగింది ఆ పిల్లవాడొక్కడే. చెల్లెండ్లు బీడీలు చేస్తున్నరు. తమ్ముడు డిగ్రీ ఫెలయిండు" అంటూ వివరాలు చెప్పుకొచ్చాడు రామేశం.

"నాకక్కడ కోళ్ళఫారంలో కొంత పనుంది. అన్నంతిని పోదాం" అన్నాడు రామేశం."

ఫోంచేసి సైకిల్ మోటార్ మీద రామేశం, చంద్రమౌళి ఆ వూరికి బయల్దేరారు. కొత్తగా మెరుస్తున్న తార్రోడ్డు. ఎటు చూసినా పచ్చని పొలాలు, పెరండ్లు. చల్లని హాయిగొలిపే గాలి, ఎంతో హాయిగావుంది చంద్రమౌళికి. రామేశం కోళ్ళఫారం కాడ బండి ఆపాడు.

"అయ్యో! అప్పుడే ఊరు వచ్చేసిందా? అరగంటైనా కాలేదు" అన్నాడు చంద్రమౌళి.

"రోడ్డు చాలా బాగుంది. అందుకని జెల్ది వచ్చినం." అన్నాడు రామేశం. ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడిని మెచ్చుకున్నాడు రామేశం.

"మునుపు సైకిల్ మోటార్ మీద యిక్కడికి రావాలంటే రెండు గంటలు పట్టుండె. రోడ్డంత బురద, కయ్యలు, వాగులల్ల ఉసికెల కెల్లి బండి నూక్కుంట రావాల్సి వస్తుండె." అన్నాడు రామేశం మళ్ళీ.

"నమస్తేసార్" అంటూ కోళ్ళఫారం యజమాని గంగాధర్ వారిని సాదరంగా ఆహ్వానించాడు.

"కోళ్ళు, కోడిగుడ్ల ప్రొడక్షన్ ఎంతుంది? వాటిదాణా, రోగాలు, చిక్స్ గురించిన జాగ్రత్తలు అన్నీ చర్చించుకున్నారు వాళ్ళు. మధ్య మధ్య తనకొచ్చిన సందేహాలు అడిగాడు చంద్రమౌళి.

కోళ్ళఫారం చుట్టూ భలే చెట్లు పెంచారు అనుకున్నాడు చంద్రమౌళి. చంద్రమౌళికి కోళ్ళ ఫారాన్నంతా తిప్పి చూపించాడు గంగాధర్. అంతా కోళ్ళ పెంట వాసన.

"ఈతకల్లు తెప్పియ్యనా బావా? సార్ పట్నం నుంచి వచ్చిండు. ఈ పల్లె స్పెషాలిటీ రుచి చూడాలె గద" అన్నాడు గంగాధర్.

"ఈసారు ఏదీ తాగడు. నేనియ్యాల్ల ముట్ట. ఒక్కపొద్దు" అన్నాడు రామేశం.

కాసేపటికి కొబ్బరి చెట్లకు గులాబీ పొదలకు మధ్య కుర్చీలు వేసుకొని కూర్చున్నారు. రామేశం విషయం కదిలించాడు.

"రవికి సంబంధాలు మస్తుగనే వచ్చినై గని చూసుకుంట మర్రిపోతున్రు ఒక్క సంబంధం గూడ పెళ్ళిచూపుల దాక రాలే!" అన్నాడు గంగాధర్.

"అదే! గట్లా!" రామేశం అడిగాడు.

"ఏం చెప్పాలె సార్ వానికత? తల్లిదండ్రులు, తమ్ముడు, చెల్లెండ్లు అందరికి వాడొక్కడే పెద్ద దిక్కాయె. వాని సదువు కోసం పైసలు గావాల్నని బిడ్డలను ఏడో తరగతికే సదువు బంద పెట్టిచ్చి బీడీలు చెయ్యపెట్టిన్రు. వాడు అమెరికాపోయె లెవల్‌కు ఎదిగితే చెల్లెండ్లను కనీసం టీచర్లకన్న యియ్యాలెగద. ఏడోతరగతి పిలగాండ్లను ఈకాలం టీచర్లు ఎవలు మెచ్చుతరు! తనంత చదివిన పిల్ల గావాలంటరు. అందుకని కట్నం ఎక్కువ యిచ్చయినా టీచర్లను చూడాలె అనివాని తపన. వాని బుద్ధి మంచిదేగని పెండ్లయినంక యిద్దరి సంపాదన ఏడెనిమిదేండ్ల దాక ఇంటికే ఖర్చు పెట్టాలె అని అంటే ఈకాలం ఆడిపిల్లలు ఎవలు వింటరు? పిల్లకన్నా ముందు ఆపిల్ల తల్లిదండ్రులే మెచ్చుతలేరు. నేతశాలోనింటికి పిల్లనిచ్చుడే మహా ఎక్కువ అని ఏదో పిల్లగాడు బెంగుళూర్లోనో, అమెరికాలోనో ఉంటడు. అల్లుడు బిడ్డ మంచిగ సుఖంగ ఉంటరు అనుకుంటే ఈ గంపెడు సంసారం ఎల్లదీసుడా?" అంటూ ఏ సంబంధం ఎట్లా ఎత్తి పోయిందో వివరించాడు గంగాధర్.

చంద్రమౌళికి ఆశ్చర్యం వేసింది. అంత పట్టుదలతో ఉన్న పిల్లవాడి ఆదర్శాల పట్ల ముచ్చటేసింది.

"బెంగుళూర్లో కొడుకు ఉద్యోగం చేస్తుంటే ఇంకా కూలికి నేసుడేంది? సొంతం మగ్గం పెట్టుకోరాదా" అని అడిగాడు చంద్రమౌళి.



"వాడు మా అంటండు. అసలు మగ్గం నేసుడు బందు పెట్టుమనిగూడ అంటండు. కని మా అన్న యింటలేడు. ఇన్నిరోజులు కూడు పెట్టిన ఈమగ్గం నేను బందుపెట్ట అన్నడు. పోనీ సొంతంమగ్గం పెట్టుకో అంటే నూలు కొనుక్కచ్చుడు, బట్టలు మల్ల సేట్లకు అమ్ముడు – ఇదంత దంద ఎవలు పెట్టుకుంటరు. నేను కూలికే నేస్త– స్వంతమగ్గం వద్దు అని అన్నడు మా అన్న".

"మీలాగా కోళ్ళఫారం పెట్టుకుంటే బాగుండేది గద". అన్నాడు చంద్రమౌళి.

"ఇది రిస్కుదంద. ఇంత రిస్కు మా అన్నతోటి ఏమైతదిసార్? సొంత మగ్గమే వద్దన్నోని తోటి కోళ్ళఫారం నడుపుడు అయితదా? ఏందో వైరాగ్యంలో పడ్డడు. ఎనుకట మా అన్నకు సొంత మగ్గమే ఉండె. చీరలు మంచిగ నేస్తడని పదివూర్లపెట్టు మంచి పేరుండె. ఎక్కడెక్కణ్ణుంచో వచ్చి సంచకరి (అడ్వాన్స్) ఇచ్చి నేయించుకుందురు. ఇప్పుడాకాలాన్ని కుక్కెత్తుకుపోయె...నేతగాళ్ళ బతుకులన్నీ గిట్లయిపోయె". పాత జ్ఞాపకాలు గుర్తొచ్చి గంగాధర్ అదోలా అయ్యాడు. తానుకూడా వైరాగ్యంలో పడ్డాడు.

"ఎంసెట్ కౌన్సిలింగ్‌కు నేనే వెంటపోయిన. ఫీజు గూడ నేనే సదిరిన. ఉద్యోగానికెక్కినంక అన్ని ముట్టజెప్పిండనుకోన్రి" అన్నాడు గంగాధర్.

"ఈ సారు గూడ పెళ్ళి సంబంధం పనిమీదనే వచ్చిండు. వీళ్ళ దగ్గరి దోస్తు బిడ్డ ఉందట. తండ్రి పెద్ద ఆఫీసరట. అయితే పిల్లకు కొద్దిగ మెల్లకన్ను. అద్దాలు పెట్టుకుంటే మామూలుగనే కనపడ్తది. కలర్ మనతీరు మామూలు గుంటది. తెల్లగుండది" అంటూ అసలు విషయం వివరించాడు రామేశం.

"వానికి అవన్ని పట్టింపులేం లేవు. మీరు మెచ్చితే సాలు. నేను వాన్ని ఒప్పిస్తబావా! వాడు నామాట కాదనడు. నేను నీమాట ఎన్నడన్న కాదన్ననా! నువ్వు అన్ని చూసి పిల్ల మన పిల్లగానికి మంచి మ్యాచ్ అని నీకన్పిస్తే ఒప్పిద్దాం బావా"... అంటూ చంద్రమౌళి కేసి తిరిగి మరైతే వాల్ల యిల్లు చూద్దురు – రండి సార్" అంటూ బయలు దేరదీశాడు గంగాధర్.

సైకిల్ మోటార్ అక్కడే వుంచి కాలినడకన బయల్దేరారు. దడి పొంట బీరకాయలు, కట్ల పువ్వులు, బోడ కాకర, సొరకాయలు, అంత తాజాగా చూస్తుంటే చంద్రమౌళికి ఆహ్లాదంగా వుంది.

తోవెంట చిటుకం పటుకం అని వినపడుతుంటే చంద్రమౌళి ఆసక్తిగా అడిగాడు.

"ఈ వూర్లె చేనేత మగ్గాలు బాగానే ఉన్నట్టున్నాయి".

"ఎక్కువేం లేవు. ఉండుటానికి 60 మగ్గాల దాక ఉన్నయి. కని 20-25 మందే నేస్తున్నరు. అది కూడా ధనికి అంటే మాస్టర్ వీవర్‌కు కూలికి నేస్తున్నరు. ఎక్కువ కెక్కువ లుంగీలు, తువ్వాలలు నేస్తుంటరు. అప్పుడప్పుడు చీరెలు గూడ నేస్తుంటరు. ఎనిమిది తొమ్మిది గజాల చీరలు మార్కెట్ల ఎక్కువ దొరుకై. అందుకని ఆర్డరిస్తే అవి నేస్తుంటరు." అన్నాడు గంగాధర్.

"ఈ వూర్లెశాలోల్లు ఎన్ని కుటుంబాలుంటై" ఆసక్తిగా అడిగాడు చంద్రమౌళి.

"ఇరవై ఏండ్ల కింద నూరు కుటుంబాలుండె. అల్లందరు యిక్కన్నే వుంటే తక్కువకు తక్కువ మూడువందల కుటుంబాలైతుండె. కని యిప్పుడు 50 గడప వుండచ్చు. మిగిలినోల్లందరు పొట్ట చేతపట్టుకొని ఏదో ఒక పని వెతుక్కుంట ఎటెటో పోయిన్రు. ఒక ఊరుగాదు-ఒక రేవు గాదు. ఒక పని గాదు". శిథిలమైన కుటుంబాలు, సంబంధాలు... ఏవేవో గుర్తొచ్చి మళ్ళీ విషాదంగా వైరాగ్యంలో పడ్డాడు గంగాధర్.

భూమికి మూరెడు ఎత్తులోనే ఉన్న ఊచలకిటికీ నుండి ఎలుకను కరుచు కొని పిల్లి బయటకు దూకి సర్రున ఎటో ఉరికింది.

"ఆ యింట్ల యిపుడు ఎవలుంటలేరు. వీళ్ళు జగిత్యాల్లో యిల్లు కట్టు కున్నరు. ఆ యిల్లు అమ్ముతనంటె ఎవలు కొంటలేరు. దీనికి కట్టెనే యాభయివేల రూపాయలది ఎల్తది. అయినా మూడుగుంటల జాగ, యిల్లు అంత కల్సి 25 వేలకు ఇస్తనన్నా ఎవరు కొంటలేరు".

"ఎందుకట్లా!" అడిగాడు చంద్రమౌ

"పల్లెటూర్లల్ల ఎవలుంటున్రు సార్. అదిగాక వాల్లు ఏమని శరతు పెట్టిన్రంటే - ఆ యిల్లు విప్పద్దు. అట్లనే వుండాలె. ఆ యింట్ల దీపం పెట్టాలె. ఇంటి ముంగట అలుకు చల్లి యింట్ల దీపం పెట్టుటానికే అది అమ్ముతనంటున్నరు - పైసలల్లేక కాదు. యిల్లు యిప్పి కట్టె కోయించి అమ్మితే 50 వేల కట్టె ఎల్తది. పైసల కోసం కాదు అమ్ముతున్నది. మేం ఈ యింట్ల పుట్టి పెరిగినం. అచ్చి వచ్చిన లక్ష్మిగల యిల్లది. రెండులక్షలు పెట్టినా ఈకాలంలో యింత యిల్లు కాదు అని అంటరు. అందుకే ఒకలు ఎడ్లకొట్టంకోసమని 35 వేలకు అడిగినా యియ్యలేదు" అన్నాడు గంగాధర్.

"ఈ ఇంటాయన ఏం చేస్తడు!"



"అల్లకేంది సార్. నలుగురన్నదమ్ములు నాలుగు రకాల పనులు చేసుకుంటున్రు. పెద్దాయన లింబాద్రిది జగిత్యాల్లో హోల్ సేల్ బట్టల వ్యాపారం. నడిపోడు జగిత్యాల నుంచి హైద్రాబాద్ దాకా ప్లాట్లు, రియల్ ఎస్టేట్ బిజినెస్ చేస్తుండు. ఒకాయన బార్ షాప్ పెట్టుకున్నడు! అందరికన్న చిన్నోడు ఎం.ఎ., బీయిడి చేసి జగిత్యాల్లోనే స్కూలు పెట్టుకున్నడు. ఎనిమిది వందల మంది స్టూడెంట్స్, స్కూలుకోసమని ఊరిబయట కొన్న రెండెకరాల జాగ యిపుడు గజానికి రెండువేల చొప్పున ఊ అంటే ప్లాట్ల కింద అమ్ముడువోతది. వాల్లు చిన్నప్పట్నుంచి ఎంతకష్టపడ్డరో... యిపుడు కార్లు మేన్‌టేన్ చేస్తున్నరు. వీల్లందరు చిన్నప్పుడు వాల్లనాన్నతోటి నేత నేసినోల్లే. ఆ యింట్ల నాలుగు మగ్గాలు నడిచేటివి... అన్నాడు గంగాధర్.

కొన్ని యిండ్లలో మనుషుల అలికిడే లేదు.

"ఈ యిండ్లల్ల ఏసప్పుడు లేదేంది? ఆశ్చర్యంగా అడిగాడు చంద్రమౌళి.

" ఇవి కాపోల్ల యిండ్లు అందరు పొలాలకు, చేన్లకు పనులకు పోయిన్రు. ఇక కొద్దిగైతే వస్తరు." అన్నాడు గంగాధర్.

కాపోల్ల యిండ్లు దాటితే మళ్ళీ" చిటుకం - పటుకం అని మగ్గం చప్పుడు వినపడింది.

"రవిప్రకాశ్ వాళ్ళ యిల్లు యిదే. రండి లోపలికి" అంటూ లోపలికి నడిచాడు గంగాధర్.

"గంగాధర్ వచ్చిండు" అని లచ్చుంబాయి భర్త లస్మయ్యను ఉద్దేశించి అంది. అరుగు మీద రాట్నంతో నూలు కండెలు చుడుతున్న సవ్వడి ఆపింది. రాట్నం, పంటెలు, గిరుక పక్కకు జరిపి అరుగుమీద మంచం వాల్చింది. దానిపై చద్దరుపరిచి కూర్చోమంది. ఓపాత కట్టె కుర్చీ తెచ్చివేసింది. పిల్లలు కత్తిరించిన బీడీ ఆకుల తుక్కును ఒకవైపు నెట్టింది.

లస్మయ్య మగ్గం గుంటలోంచి లేసి ధోతి సింగులు సవరించుకున్నాడు. తువ్వాలుతో మొహం తుడుచుకున్నాడు. మగ్గం కొయ్యకు వేలాడేసిన అంగీతీసి తొడుక్కున్నాడు.

అరుగుదాటి యింట్లోకి వచ్చిన రామేశంను "నమస్తే" అంటూ పలకరించాడు లస్మయ్య.

ఇల్లంతా ఫ్యాక్టరీలా వుంది. కుండలో గంజివాసన. గోడకు ఆన్చిన ల్యాకబద్దలు, సరిచేసే ఎరుకలి కుంచె, ఎత్తిన మంచం మీద ఆరేసిన చీరె, మగ్గం గుంట. అటు యిటు పాతిన గుంజలు, నేసిన బట్ట చుట్టిన దోనుగు. ముందుకు చాపి బిగకట్టిన సరిచేసే పడుగు. మగ్గం గుంట పక్కన నాడెలు. భూమికి మూరెడెత్తున ఊచల కిటికీ. అందులోంచి రివ్వున వస్తున్న గాలి. ఆ కిటికిలోంచి నేస్తున్న బట్టపై మెరుస్తున్న వెలుగు...

"మీబిడ్డలు ఎటువోయిన్రు" అని అడిగాడు రామేశం.

"దోస్తుల యింటికాడ కూసుంటమని బీడీల చాట తీసుకొని పోయిన్రు." అంది లచ్చుంబాయి.

లచ్చుంబాయి మట్టిపొయ్యిలో పిడుకలు, కట్టెలు గ్యాస్‌తో ముట్టించి చాయె పెట్టే పనిలో పడింది.

"ఎటో అచ్చిన్రు." అని అడిగాడు లస్మయ్య.

వచ్చిన పని గంగాధర్, రామేశం చెరికొంత వివరించారు.

అంత పెద్ద ఆఫీసరు సంబంధం హైద్రాబాద్ నుంచి యిక్కడి పల్లెటూరి దాకా రావడం లస్మయ్యకు సంతోషం కలిగింది. అతని మొహం పందిరికున్న బీరపువ్వులా వికసించింది.

"మరి కొడుకు అమెరికా వోతే మీరు గూడా పోవాల్సే వస్తది. కొడుకు, కోడలు ఉద్యోగాలకు పోతే మనుమలు, మనమరాండ్లను చూసుకుంట మీరు అమెరికాల్నే ఉండాల్సి వస్తది". నవ్వుతూ అడిగాడు రామేశం.

"ఆ! ఇక్కడ బిడ్డలు లేరా! యింకో చిన్న కొడుకు లేడా? మేం అమెరికా కాదు గదా ఈ వూరినుండి ఎక్కడికి పోయేదిలేదు. అయినా వాడు అయిదా రేండ్లుండి మల్ల మనదేశమే వస్తనన్నడు. చెల్లెండ్ల పెండ్లిల్లయి, మనకొకటి పట్నంల యిల్లు కొనుక్కునేదాక అక్కడుంట అన్నడు". అని అన్నాడు లస్మయ్య.

"పోయేటప్పుడు అందరు గట్లనే అంటరే! అక్కడి సుఖం అలవాటైనంక ఎవలు వాపసు రారు". నవ్వుతూ అన్నాడు రామేశం.

లచ్చుంబాయి అందరికి చాయె ఇచ్చింది. తమ యింటికి ఎవరో వచ్చిన్రని తెల్సి యిద్దరు కూతుళ్ళు పరుగు వంటి నడకతో వచ్చారు.



"ఇది పెద్దది. ఇది చిన్నది" అంటూ పరిచయం చేశాడు లస్మయ్య.

ఆ కళ్ళల్లో అమాయకత్వంతో పాటు మా అన్న బెంగుళూర్లో యింజనీర్ అనే ఆత్మవిశ్వాసం వాళ్ళ మొహాల్లో తేజస్సయి ప్రవహిస్తోంది. తండ్రి చేతిలో ఉన్న అమ్మాయి ఫోటోను తీసుకొని ఒకటికి రెండు సార్లు చూశారు.

సంబంధం స్థాయికి వాళ్ళు మెచ్చేట్టు మాట్లడ్డం ఒక కళ అని చంద్రమౌళికి తెల్సు. "వాళ్ళు కూడా బాగ ఉన్నోల్లు ఏంకాదు. వాల్ల తండ్రి కూడా బట్టలు నేసినోడే. వాల్లు పెద్దోల్లు కాదు. మీరు చిన్నోల్లు కాదు. వాల్లేమో యిర్వై అయిదేండ్ల కింద సదువుకొని పైకి వచ్చిన్రు. మీవోడు యిప్పుడు పైకి వచ్చిండు. వాల్లు గూడా ఎనుకట మీతీర్గనే బతికిన్రు. వాల్లే అని ఏంది? మనందరం గంతే". అన్నాడు చంద్రమౌళి.

చంద్రమౌళికి తనగతమంతా గుర్తుకొచ్చింది. తాను ఓ పూట బట్టలు నేసుకుంట, ఓపూట కాలేజీకి పోవుకుంట చదువుకున్నాడు. తల్లీదండ్రీ ఎంతో కష్టపడ్డారు. అవన్నీ కలుపుగోలుగా చెప్పుకొచ్చాడు చంద్రమౌళి.

లస్మయ్య బిడ్డలకేసి, వాల్ల తల్లికేసి చూశాడు. వాళ్ళు మెచ్చినట్టే అన్పిస్తోంది.

"కొడుకు ఏమైన ఫోన్ చేసిండా?" రామేశం అడిగాడు.

"నిన్ననే ఫోన్ చేసిండు. పిల్లకు ఉండీలేనట్టు కొద్దిగా మెల్ల కన్నుంటదట. ఏర్పడదట. వాల్ల తరపున ఎవరైన వస్తరు గావచ్చు. పిల్లోల్లకు మనయిల్లు, మన కుటుంబం నచ్చితే, మీక్కూడా మంచిగ అన్పిస్తే వాల్లు రమ్మంటే ఓసారి పోయి చూసిరాన్రి. అని చెప్పిండు" అని అన్నాడు లస్మయ్య.

"మరి పెట్టువోతలు ఏమనుకుంటున్రె" అని ఆరాతీశాడు రామేశం.

ఈ విషయం లస్మయ్యకు మాట్లాడరాదని లచ్చుంబాయి చెప్పుకొచ్చింది.

"పెద్ద బిడ్డకు సంబంధాలు చూస్తున్నం. ఒకటి దొరింపు అయ్యేటట్టున్నది. సర్కార్ ఉద్యోగం రాలేదు. అయిదారు నెల్లల్ల వస్తదంటున్రు. నాలుగు కావాలంటున్రు. చిల్లర కర్సులు, పైకర్సులు ఒకటి దాటుతై. పెద్దోని పెండ్లితోని పెద్ద బిడ్డ పెండ్లి కర్సు ఎల్లిపోవాలనే కొడుక్కు ముందుగాల సంబంధాలు చూస్తున్నం" అన్నది లచ్చుంబాయి. పిలగానోల్లు అడిగిందానికన్నా ఒకటి ఎక్కువనే చెప్పిన అని లచ్చుంబాయి లోలోన సంతోషపడింది.

అంటే సుమారు అయిదు అనుకున్నాడు చంద్రమౌళి మనస్సులో. చంద్రమౌళికి సంతోషం వేసింది. శివరాజం దివ్యకు ఎనిమిది పది నగదు యిచ్చుటానికి యాడాది నుంచి రడీగ ఉన్నడు. ఇంత తక్కువైతే యింతమంచి పిల్లగానికి తన బిడ్డనే యివ్వచ్చు. ప్రవీణ బి.టెక్ ఫైనల్ చదువుతనే వుండె. దివ్య కన్నా ఎంత ముద్దుగుంటది – అని మనస్సులో కొట్టుకుంది. తన కూతురు ఫోటో కూడా వెంట తీసుకొస్తే ఎంత బాగుండేది అనుకున్నాడు చంద్రమౌళి.

రామేశం, చంద్రమౌళి అట్లా వాకిట్లోకి నడిచి ఏదో ముచ్చటించుకున్నారు. చంద్రమౌళి సెల్‌ఫోన్లో పిల్ల తండ్రి శివరాజంతో కాసేపు మాట్లాడాడు. అన్ని విషయాలు మా ఫ్రెండు రామేశం చెప్తాడు అని సెల్‌ఫోన్ రామేశంకిచ్చాడు. రామేశం, గంగాధర్ కల్సి అన్ని విషయాలు వివరించారు. రవి ప్రకాశ్‌కు ఫోన్ కలిపి గంగాధర్ కాసేపు మాట్లాడాడు. ఒక నిర్ణయానికొచ్చి మళ్ళీ అందరు అరుగుమీద మంచంలో తాపీగా కూర్చున్నారు.

"మరి ఎప్పుడు పోతరే పిల్లను చూసుటానికి. ఇగో ఈ విజిటింగ్ కార్డుల అడ్రసున్నది. గంగాధర్‌ను తీసుకొని ఓసారి చూసిర్రాని." అన్నాడు రామేశం.

"అంటే నువు రావా? అసలు పెద్ద మనిషివి నువ్వు రాకపోతే ఎట్ల?" అన్నాడు రామేశం వ్యవహార సరళి తెల్సిన లస్మయ్య.

"మీరు రమ్మంటే తప్పుద్దా?" అంటూ నవ్వాడు రామేశం.

సంబంధం యిక ఖాయమైనట్టేనని యిరుపక్షాలకు మనస్సులో ఒక భావన మెదిలింది.



రెండు నెలల తర్వాత రవిప్రకాశ్‌కూ బీడీయల్ శివరాజంగారి కూతురు దివ్యకు హైద్రాబాద్‌లో పెళ్ళి దివ్యంగా జరిగింది. అయితే లచ్చుంబాయి, లస్మయ్యలకు ఆగం ఆగంగా ఆ పెళ్లి జరిగిన తీరు ఎందుకో నచ్చలేదు. కొడుకు లీవ్ దొరకలేదని పెళ్లికి ఐదు రోజుల ముందు వచ్చాడు. పెండ్లి పద్దతులేవి చేయడానికి వీలేకాలేదు. ఇంటికాడ పెండ్లయినట్టే అనిపించలేదు. పెళ్లయిన మూడు రోజులకే హానిమూన్ పేరిట బీడియల్ శివరాజం అల్లుడిని, కూతురిని టికెట్లుకొని పంపించాడు. బిడ్డ పెళ్లి పెట్టుకొని ఇట్ల ఊర్లు తిరుగుడేందో లస్మయ్యకు అర్థంకాలేదు. రామేశం సముదాయించాడు.



"మనచిన్నప్పుడు పది పదిహేనేండ్లకే లగ్గాలైనై. పండుగు పండుగుకు అల్లుడు బిడ్డ అటు ఇటు తోల్కపోవుడు, తోల్కచ్చుడు ఉంటుండే. అట్లా సుట్టరికం, మనుషులు పరిచయం అవుదురు. పాతపడుదురు. ఇప్పుడు పెద్దపెరిగినంక పెండ్లిండ్లు గావట్టె. గందుకని పిల్లా, పిల్లగానికి పరిచయాలు పెరగాలని గిట్ల కొద్దిరోజులు హానిమూన్‌కు అని పంపిస్తున్నరు. అంటే పెండ్లయినంక ప్రేమించుకొనుడు అన్నమాట. మీ బిడ్డ పెండ్లికి మేమందరం లేమా!" అని సముదాయించాడు రామేశం.

పదిహేను రోజుల తర్వాత లస్మయ్య పెద్దకూతురు విజయ పెళ్ళి లస్మయ్య కోరుకున్నట్టుగానే ఆపల్లెలో ఘనంగా జరిగింది. రవిప్రకాష్, గంగాధర్ చిన్నాన, రామేశం ఎలా చెపితే అలా ఖర్చులు, కట్నాలన్నీ పెట్టాడు. దివ్యకు ఇవన్నీ కొత్తగా అనిపించాయి. చాలా ఆసక్తిగా అన్ని గమనించింది.

పెండ్లికి ఐదు రోజుల ముందు పోచమ్మకు చేసి చుట్టాలందరికి మేక పోతును కోసి బోజనాలు పెట్టాడు. లస్మయ్య, గంగాధర్ మామయ్యలే సొంతంగా వంటలు చేయడం దివ్యకు వింతగా అనిపించింది.

పెళ్లి కూతురు విజయకు ప్రత్యేకంగా పెండ్లి చీరను లస్మయ్య తానే నేశాడు. గంగాధర్ రెండు రోజుల ముందు విజయకు పెళ్లికూతురును చేయడం అనే ఫంక్షన్ చేశాడు. తోడు పెళ్లికూతురుగా తొమ్మిదవ తరగతి చదువుతున్న తన కూతుర్ని పంపాడు గంగాధర్.

కుండలను సున్నంతో, ముగ్గులతో అలంకరించి ఐరేండ్ల పూజ చేశారు. ఏడు గాడిపొయ్యిలు తీశారు. వెనుకట ఎడ్లబండ్లమీద వచ్చేవాళ్లకోసం దుమ్ము ధూళి ఉంటుందని స్నానాలకు, వంటలకు గాడిపోయిలు పెట్టి అడివి నుంచి కట్టెలు కొట్టుకొచ్చి అట్లనే పొయ్యిలో పెట్టేవాళ్లు. కుండల్లో ధాన్యం దాచుకునేవారు. అవి పోయినా ఆ ఆచారాలు అలాగే కొనసాగుతున్నాయి.

'అందుగు' కొమ్మను చప్పుడుతో ఎదుర్కొచ్చి ఇంటిముందు పాతిపెట్టి మట్టితో గద్దె కట్టారు. ముత్తయిదువలు బావికి పూజచేసి కొత్త బిందెల్లో నీళ్లు తెచ్చారు. కొత్త కుండలతో కూరాళ్లు పట్టారు. కూరాళ్లు పట్టడం ఆడవాళ్ళ దృష్టిలో చాలా ముఖ్యమైన కార్యక్రమం. ముత్తయిదువలు పసుపు యిసురు రాయితో విసిరి పెట్టారు.

వాకిట్లో కొబ్బరి ఆకులతో పెండ్లి పందిరి వేశారు. రంగు కాగితాలు, డిజైన్లతో పెండ్లి పందిరిని అలంకరించారు. బాసింగాలు పోచమ్మ గుడికి చప్పుడుతో తీసుకుపోయి మొక్కి తీసుకొచ్చారు. పోచమ్మ గుడికి పోయి ఇంటికి చేరేదాకా దుప్పటిని గొడుగులాగా పట్టుకొని నడిచారు. ఈ ఆచారం ఎందుకు మొదలైందో వాళ్లెవరికి తెలియదు. ఎవరోఒకరు గుర్తు చేసినకొద్దీ చెప్పిందల్లా ఆచరించడమే ఆచారాల్లో వస్తున్న తీరు. ఇంటి చాకలి అన్నం, కుంకుమ కలిపి వాళ్ళు ఇంట్లోకొచ్చేటప్పుడు మిత్తి తీశాడు.

ఔసులోల్ల ఇంటి నుంచి స్వయంగా చేయించిన పుస్తెలు, మట్టెలు చప్పుడుతో మంగలహారతితో ఎదుర్కొచ్చారు. మైకులో పాటలజోరు ఊరంతా వినిపిస్తుంటే పచ్చ జొన్నలతో చాకలి వాళ్లతో, మంగలి వాళ్లతో మైలపోలు తీయించారు.

పెండ్లి పిల్లవాడిని మార్కండేయ గుడి నుండి ఎదుర్కోలుగా పోయి చప్పుడుతో ఎదుర్కొచ్చారు. ఎదుర్కోల్ల దగ్గర ఇరుపక్షాలు పసుపు, కుంకుమ, నోట్లో చక్కెర మర్యాదలు జరిగాయి. పెండ్లి పీటగా బట్టచుట్టే దోనుగుకు కంకణం కట్టి పెట్టారు. దోనుగుమీద కూర్చోబెట్టి అల్లుని కాళ్లు కడిగారు. పెళ్లిలోనే అల్లునికి జంధ్యం వేయించారు.

తరువాత కన్యాదానం కార్యక్రమం... జిలకర బెల్లం పెట్టడం పెళ్లికన్నా ముఖ్యం ఎందుకైందో ఎవరికి తెలియదు. కాళ్లు తొక్కించారు. ఒకరి ఎంగిలి మరొకరికి తినిపించారు. కొంగులు ముడివేశారు. పుస్తెలు కట్టిన తరువాత పట్టపగలే అరుంధతి నక్షత్రం అంటూ చూపారు. పత్తి గింజలు అలికించారు. పెళ్లి పందిట్లో తరాజు పట్టుకొని పిల్ల పిలగాడు మూడు చుట్లు తిరిగారు. ఇంత వివరంగా హైద్రాబాద్‌లో తన పెళ్లిలో ఎందుకు జరగలేదో అని రవిప్రకాష్ మనస్సులో అనుకున్నాడు. ఊరికోతీరు పద్ధతి ఉంటుందని గంగాధర్ అన్నాడు.

పెళ్లికి ఐదు యాటలు కోసి మాంసంతో భోజనాలు పెట్టారు. వియ్యంకుడు బీడియల్ శివరాజం, చంద్రమౌళి వాళ్ల చుట్టాలకు రిసెప్షన్ భోజనాలుకూడా ఇవే అని ముందే అనుకున్నారు. శివరాజంకు ఇవన్ని కొత్తగా అనిపించాయి. లస్మయ్యకు తృప్తితీరింది.

సాయంత్రం అప్పగింతల కార్యక్రమం జరిగింది. అంతదాకా ఆనందంగా ఉన్న పెళ్ళిపందిరి గంభీరంగా మారిపోయింది. పోకలు, ఎండిన కర్జూర పండ్లు



చేతిలో పెట్టి కూతురును అల్లుని చేతిలో, అతని తల్లి దండ్రుల, చిన్నాన, పెద్దనానల చేతిలో పెడుతూ కన్నీరు పెట్టారు. పెళ్లికూతురు విజయ వెక్కివెక్కి ఏడ్చింది. ఎవరో కన్నీళ్లు తుడిచారు. పోయస్తా అంటూ విజయ అందరికి పాదాభివందనం చేసింది.

ఆ సన్నివేశం ముగిసిన తరువాత సాగనంపారు. సాగనంపేటప్పుడు బావమరదులు, పెండ్లి పిల్లగాడ్ని, పెళ్లి పిల్లను నవ్వుతూ అడ్డుకున్నారు. చంద్రమౌళికి అది చూస్తుంటే ఎందుకో రుక్మిణీ కళ్యాణం గుర్తుకువచ్చింది. తమ చెల్లెను తీసుకుపోవటానికి వీలులేదని వాదులాటకు దిగారు. గంగాధర్ కొడుకులు, రవిప్రకాష్ కలిసి ఆడే ఆ నాటకాన్ని అందరు నవ్వుతూ తిలకించారు. బావమరదులు ఐదువేల రూపాయలు కట్నంకింద డిమాండ్ చేశారు. చివరకు ఐదు వందల రూపాయలకు దిగింది. పెళ్లి పిల్లవాని తండ్రి వాళ్ళ చేతిలో ఐదు వందలు పెట్టి సరిపుచ్చుకోమన్నారు. దాంతో ఆ తంతు ముగిసింది. ఆ తరువాత బావమరదులు పెండ్లి పిల్లవాణ్నిచేతుల మీద ఎత్తుకొని కారుదాకా తీసుకువచ్చారు. చప్పుడుతో ఊరేగింపు ఊరిబయటిదాకా సాగింది. ఆ ఊరేగింపులో కొందరు డ్యాన్సులు చేసారు. రవిప్రకాష్‌కూడా వారితోపాటు కాసేపు ఎగిరాడు.

గంగాధర్, రామేశంలు తాను అనుకున్నదానికన్నా చక్కని ఏర్పాట్లు చేశారని లస్మయ్య, లచ్చుంబాయి మెచ్చుకున్నారు. పెళ్లి తరువాత రెండవరోజు మారుపెళ్లికి పిలవాడింటికి భోజనాలకు వెళ్లారు. మూడవరోజు వియ్యపురాళ్ల వైనం జరిగింది. మళ్లీ మాంసాహార విందు. వియ్యపురాళ్ల వైనంలో ఇటువాళ్లు అటు, అటువాళ్లు ఇటు బంధువులకు, ఆడపడుచులకు, అల్లుళ్లకు కట్నాలు పెట్టుకున్నారు. లస్మయ్య రవిప్రకాష్‌లు గంగాధర్, రామేశం దంపతులకు పెళ్లి ఏర్పాట్లను చూసినందుకు బట్టలు కట్నాలుగా పెట్టి కాళ్లు మొక్కారు. కొడుకుతోపాటు కోడలు దివ్య అందరి కాళ్లు మొక్కింది. దివ్యకు ఇదంతా ఆసక్తిగా ఉంది.

ఆ తరువాత నాలుగు రోజులకు రవిప్రకాష్, దివ్య బెంగుళూర్‌కు వెళ్లిపోయారు. మూడు నెలలకు రవిప్రకాశ్ స్టేట్స్‌కు వెళ్ళాడు. తరువాత నాలుగు నెలలకు దివ్యకు వీసా వచ్చింది.

ఆ తర్వాత కథ అందరికీ తెల్సిందే. అందుకని క్లుప్తంగా చెప్తాను.

ఆ తర్వాత ఏడాదికి రవిప్రకాశ్ చిన్న చెల్లెలుకు పెళ్ళి కుదిరింది. మొత్తం

ఖర్చంతా అమెరికానుండే పంపారు గానీ వాళ్ళు పెళ్లికి రావడం వీలుకావడం లేదని చెప్పారు. దివ్య వచ్చి ఏడాదే అయింది కాబట్టి యిద్దరు రావడానికి పోవడానికి ఖర్చులు, నెలజీతం నష్టంకల్సి కష్టం అవుతుందని ఫోన్లో మరి మరి చెప్పారు.

కాని కొందరు వాళ్ళు అప్పుడే అమెరికా మనుషులైపోయారని ఇక కొడుకు, కోడలు యింతే అని ఆపెళ్ళిలో ఆడిపోసుకున్నారు. మంచిగ బతుకుతుంటే ఓర్వలేక ఏదో ఒకటి అంటారు అని లస్మయ్య, లచ్చుంబాయి మనస్సు నింపుకొని సరిపెట్టుకొన్నారు. అమెరికాలో కొడుకు ఎనిమిది లక్షలు పెట్టి పెద్దకారు కొన్నడని చెప్తే దగ్గరోల్లే ఓర్వలేదు అని యాది చేసుకున్నారు.

కొంత కాలానికి రవిప్రకాశ్ తన తమ్ముడి కోసం యిండియాలో వున్న ఫ్రెండ్స్‌ను కదిలించి ఏదోలారీ ట్రాన్స్‌పోర్టు ఏజెన్సీ ఖాయంచేసి డిపాజిట్ కట్టాడు. అది బాగా నడుస్తోంది.

అది చూసి పిల్లవాడు బుద్దికొచ్చిండని ఆవూరి లింబాద్రి జగిత్యాల్లో హోల్‌సేల్ బట్టలవ్యాపారం చేస్తున్నాయన తన కూతుర్ని యిస్తానని ముందు కొచ్చాడు. అది లస్మయ్య, లచ్చుంబాయిలకు ఊహించని గౌరవం. ఒక పట్టాన నమ్మబుద్ది కాలేదు.

గంగాధర్ రామేశం పెళ్ళి పెద్దలుగా అన్నీ సవరించారు.

"ఆ! ఏమున్నది బావా! నేను యివ్వాల సేటునైన. కాని నేను ఎనుకట నెలకు పదిరూపాలకు జీతం ఉన్న. మీవోడు లారీ ట్రాన్స్‌పోర్టుతోటి యిప్పుడే సేటయిండు. మీ పెద్దోని చలువ. ఊర్లె దూర్లె తెల్సిన సంబంధం గదా" అని లస్మయ్యను ఒప్పించాడు లింబాద్రి.

రెండు నెలల రాయబారాల తర్వాత పెళ్ళి కుదిరింది. అప్పటికి రవిప్రకాశ్ స్టేట్స్ వెళ్ళి మూడేళ్ళు. వాళ్ళకు కూడా యిండియా చూడాలనిపించింది. ఎమ్మెస్‌కు స్టేట్స్‌కు వెళ్ళిన చంద్రమౌళి కూతురు ప్రవీణకు కూడా పెళ్ళి కుదరడంతో ఇండియాకు వచ్చింది.

ఆ రెండు పెళ్ళిళ్ళలో అందరూ రవిప్రకాశ్‌ను మెచ్చుకున్నారు.

రవిప్రకాశ్ యిదంతా మీకోడలుకే చెందుతుందని దివ్యను చూపాడు.

"నాజీతంతోటి యిల్లు కొనుటానికి అడ్వాన్సు యిచ్చిన. ఇంటికి పంపిన యన్ని ఎక్కువ కెక్కువ కోడలు జీతమే" అని చెప్పాడు.



చాలామంది ఈర్ష్య అసూయతో రగిలిపోయారు. ఆ యింటి కోడలు "మహాలక్ష్మి" అని కొందరు పెద్దలు దీవించారు. పిల్లలు పాదాభివందనం చేశారు. పల్లెటూరి బంధువుల్లో యింత ఆదరం చూసి చలించిపోయింది దివ్య. అప్పటికే నీళ్ళు పోసుకున్న దివ్య వారి ప్రశంసలతో నిండుగా మరింత కళ తేలింది.

రవిప్రకాశ్ తల్లిదండ్రులకు పాస్‌పోర్టు అప్లయి చేయించాడు. మళ్ళీ స్టేట్స్‌కు పోతూపోతూ తల్లినీ, తండ్రినీ స్టేట్స్ రమ్మని మరిమరి చెప్పారు కొడుకూ కోడలూ. గంగాధర్, రామేశం కలిసి లస్మయ్య లచ్చుంబాయిలను రెండు సార్లు మద్రాసుకు తీసుకువెళ్లారు. ఒక్కొక్కరికి నాలువేల ఆరువందల రూపాయలు డ్రాఫ్ట్ చేసి వాళ్లిచ్చిన తేదీ ప్రకారం వెళ్లారు.

మొదటిసారి అమెరికా వీసా కార్యాలయంలో ఏం మాట్లాడాలో తెలియక అయోమయం అయ్యారు. వీసాలు రిజక్టు అయ్యాయి. రెండవసారి వెళ్లేముందు అక్కడ ఎలా మాట్లాడాలో, ఏమ్మాట్లాడాలో నలుగురు నాలుగురకాల ట్రేనింగ్ ఇచ్చారు. అయినా మేమురాము అని మొండికేశారు. ఆ పరీక్షలన్నీ ఎంతో అవమానం అనిపించాయి. గంగాధర్ రామేశం ఎంతో బతిమాలి బయలుదేర దీశారు. ఏవేవో కాగితాలన్నీ పంపిస్తే, గంగాధర్ రామేశమే అవన్ని చూసు కున్నారు. అలా మద్రాసులో వీసా స్టాంపయ్యింది. ఫ్లైట్ టికెట్లు స్టేట్స్ నుంచి కొడుకు రెజర్వు చేసి పంపాడు.

లస్మయ్య, లచ్చుంబాయిలతోపాటు లింబాద్రి, రామేశం, చంద్రమౌళి నాలుగు పెద్ద సూటుకేసులు తీసుకొని కార్లలో బయలుదేరారు. శివరాజం దంపతులు విమానాశ్రయంవద్ద కలుసుకున్నారు. హైద్రాబాద్ విమానాశ్రయంలో వియ్యంకులు, వియ్యపురాళ్లు, అల్లుళ్లు, కూతుళ్లు... వాళ్లందరిని చూస్తుంటే గతం గుర్తుకొచ్చి కళ్లల్లోకి నీళ్లు వచ్చాయి. అందరిని అలాయి బలాయి తీసుకున్నారు. కూతుళ్లు కన్నీళ్లు పెట్టారు. రెండు గంటలు నిరీక్షణ తరువాత లోపలికి వెళ్లారు.

లచ్చుంబాయి, లస్మయ్య విమానంలో వెళ్తుంటే మేఘాలన్నీ కింద కనపడడం – బొంబాయి, లండన్ నగరాల మీదుగా పోతుంటే దేవలోకం పోతున్నట్టుగా అనుభూతి.

ఫ్లయిట్ దిగగానే విమానాశ్రయంలో కొడుకు ఎదురు చూస్తున్నాడు. తమ కొడుకు కొన్న సొంత కారులో పోతుంటే చెప్పలేని ఆనందం.

ఎంత అందమైన రోడ్లూ, ఎంత మంచిగుంది ఊరు అని అనుకోకుండా వుండలేకపోయారు.

కొడుకు రవిప్రకాశ్ కొన్న ఇల్లు చాలా అందంగా ఉంది. సినిమాలో చూసినట్టుంది. 800 గజాల జాగలో విశాలంగా యిల్లు. జీవితంలో కలలో కూడా ఊహించని ఇల్లు.

ఓ రోజు తండ్రి లస్మయ్య "ఎంత కిరాయి" అని కోడలు నడిగితే "మీకొడుకునే అడుగు మామయ్యా" అంది నిండు పొద్దులతో వున్న దివ్య నిండుగా నవ్వుతూ.

"ఇల్లుకు అడ్వాన్సు కట్టిన అని ఇదివరకు చెప్తిని కదనే. ఇదే ఇల్లుకు దీనికి పదిహేను సంవత్సరాలు నెల నెల కిస్తులు కట్టాలె" అన్నాడు రవిప్రకాశ్.

"ఎంతుంటది? పదిలక్షలుంటదారా!" అని అడిగింది తల్లి లచ్చింబాయి.

తల్లి అమాయకత్వాన్ని చూసి ఆత్మీయంగా నవ్వి దగ్గరికచ్చి తల్లి చేయి పట్టుకొని

"కోటి యిరవై లక్షలు" అన్నాడు రవిప్రకాశ్ మెల్లగా.

ఆ లెక్క విలువ ఆతల్లి ఊహకందలేదు.

"పెద్ద కోడలు మన యింటికొచ్చిన యాల్ల" అంటూ కొడుకూ, కోడల్ని దీవించింది లచ్చింబాయి.

మరో నెలకు దివ్యకు నార్మల్ డెలవరీ.

మనుమరాలు పుట్టింది అని లస్మయ్య, లచ్చింబాయి ఎంతో సంతోషపడి పోయారు.

నెలకూడా కాకముందే దివ్య డ్యూటీలో జాయినైంది. మనుమరాలు పుట్టుకతో మరో కొత్త కథ మొదలైంది.

ఆమె పుట్టుకతోనే అమెరికన్ అట.

లస్మయ్యకు, లచ్చింబాయికి అదంతా కలలోలాగా ఉంది.

ఒక్కడు చదువు కొని బుద్ధిమంతుడైతే తమ కుటుంబమంతా ఎంత మారిపోయింది.

తమకు అమెరికన్ మనుమరాలు పుట్టింది. "అమెరికన్ మనుమరాలు" అని మనస్సులో పదే పదే అనుకున్నారు.



మనవరాలు పుట్టిన్నించి వియ్యంకుడు, వియ్యపురాలు, కొడుకులు, బిడ్డలు, అల్లుళ్ళు, చంద్రమౌళి, రామేశం ఇండియానుండి ఎవరో ఒకరు ఎప్పుడు ఫోన్లో మాట్లాడుతూనే ఉన్నారు. అమెరికా నుండి ఇండియాకు, ఇండియా నుండి అమెరికాకు వారంలో మూడు నాలుగు సార్లు ఎవరో ఒకరు ఫోన్లో మాట్లాడుకుంటే అందరూ ఎంతో దగ్గరున్నట్లు పక్కవాడలో ఉంటున్నట్లు అన్పించింది వారికి.

ఓరోజు వీకెండ్‌లో అయిదారుగురు రవిప్రకాశ్ యింట్లో మీటయ్యారు.

ఏదేదో చర్చిస్తున్నారు.

కోడలు దివ్యకూడా ఉత్సాహంగా ఆ చర్చలో పాల్గొంది.

రవిప్రకాశ్ కొలీగ్, బెస్ట్‌ఫ్రెండ్ అమరేందర్ ఆ చర్చలో రవిప్రకాశ్‌ను మాటిమాటికి తప్పుపడ్తున్నాడు. నవ్వుతూనే సీరియస్ అవుతున్నాడు.

"నీకు మొదటినుంచీ చెబుతున్నాను. ఇల్లు కొనద్దని. ఇల్లు కొని పదిహేను సంవత్సరాల దాకా కిస్తులు కట్టుకుంటూ డబ్బంతా డెడ్ క్యాపిటల్ చేస్తున్నావు".

అమరేందర్ మాటలకు దివ్య అడ్డొచ్చింది.

"ఇప్పుడు ఏమంత కొంప మునిగిందని, ఏపాటి ఏజ్ వచ్చిందని, అందరూ థర్టీ ప్లస్ వాళ్ళే కదా! నాకైతే టొంటీ సెవెనే! ఇండియాలో మా క్లాస్‌మేట్స్ కొందరికి ఇంకా ఉద్యోగాలు కూడా రాలేదు. అయినా ఇల్లు కిరాయకు నెలకు వెయ్యిడాలర్లు ఎలాగూ కట్టాల్సిందేగా! మరో ఏడువందలే కదా ఎక్స్‌ట్రా కడుతున్నది? సరే! జరిగిపోయినదాన్ని వదలేయండి. ఇప్పుడేం చేద్దామో చెప్పండి."

"నాకైతే ఇప్పుడప్పుడే రిస్క్ తీసుకోవడం ఇష్టంలేదు" అన్నాడు చంద్రమౌళి అల్లుడు ప్రవీణ భర్త పార్థసారథి.

"రిస్క్ తీసుకోకపోతే జీవితమే లేదు. రిస్క్ లేకుండా ఒక్కక్షణం కారు కూడా నడపలేవు. రిస్క్ లేనిదెక్కడ? ఈ ఉద్యోగాలు శాశ్వతమా? ఇదేమైనా ఇండియానా?" అన్నాడు మరో స్నేహితుడు విశ్వేందర్‌రెడ్డి.

ప్రవీణ "మా ఆయన మొదట అలానే అంటారు. తర్వాత అందరికన్నా తానే ముందుంటారు" అంటూ నవ్వింది.

అలా చర్చ సాగుతూనే ఉంది.

"ఇంకా ఎంతకాలం యిలా ఎంప్లాయిస్‌గా రొటీన్‌గా, బోర్‌గా బతకడం? మనం ఏదైనా అడ్వెంచర్ చేయాలి. ఏదైనా వెంచర్ ప్రారంభించాలి. మనం మరింత ఉన్నత దశకు ఎందుకు ఎదగకూడదు?" అన్నాడు అమరేందర్.

"మనం కూడా ఒక సాఫ్టువేర్ కంపెనీ ఎందుకు స్టార్ట్ చేయకూడదు? రిజిస్ట్రేషన్ చేసుకోవడానికి 300 డాలర్లు చాలు. ఇంతమందిమి కలిసి ఒక సంస్థను నిర్వహించలేమా? మనకాశక్తి లేదా? మనమంతా కలిస్తే అది అసాధ్యమా?" అంటూ విజయ్ వాదనకు దిగాడు.

చివరకు అందరూ ఒక అంగీకారానికి వచ్చారు. దివ్య యం.డిగా ఓ సాఫ్టువేర్ కంపెనీ, రిజిష్టరు చేయడానికి ఒత్తిడి చేశారు.

దివ్య వద్దు వద్దంటూనే వుంది. కానీ ఆమె ముఖంలో మరింత తేజస్సు. ఆమెకు లోలోపల ఉత్సాహంగానే ఉంది.

ఏదో ఊబిలోకి దిగుతున్నట్టుగా భయపడ్డాడు పార్థసారథి.

"ధైర్యంగా ఉండండి. గతం మర్చిపొండి. ఇపుడు మరో 'ప్యారడిగ్మ్ షిఫ్టు'కు స్టెప్ తీసుకున్నాం. తప్పకుండా సక్సెస్ అవుతాం. ఇకనుండి మనజీవితాల్లో కొత్త కథ ప్రారంభం..." అన్నాడు విజయ్ ఉత్సాహంగా.

అంతలో ఫోన్ మ్రోగింది. రిసీవర్ అందుకుంది దివ్య. అవతలినుండి చంద్రమౌళి. మాటల్లో దివ్య తమ ప్రతిపాదన చెప్పింది. అంకుల్‌ను సూచనలడిగింది. చంద్రమౌళి ఎంతో సంతోషపడిపోయాడు. అందరికి వినపడేట్లుగా స్పీకర్ ఫోన్ నొక్కింది దివ్య.

"మాకు వెనకటి కాలంలో టీచర్ ఉద్యోగం దొరకడమే గగనంగా వుండేది. మీ జనరేషన్లో కొందరైనా స్టేట్స్ పోగలిగారు. మిమ్మల్ని, మీ ఉత్సాహాన్ని చూస్తుంటే నాకు లాలాలజపతిరాయ్, గాంధీ, నెహ్రూ, అంబేద్కర్, ఎ.కె.రామానుజం, సర్వేపల్లి రాధాకృష్ణన్ గుర్తొస్తున్నారు. 150 ఏళ్ళ క్రితం నుండి వాళ్ళకు యితర దేశాలకు వెళ్ళే అవకాశాలు వచ్చాయి. అలాంటి అవకాశాలు యిప్పుడు మీకు వస్తున్నాయి. మీ జీవితం యిపుడే మొదలైంది. ఇక ఉన్నత శిఖరాలకు ఎదగడం మీ సంకల్ప బలాన్ని బట్టి, ఉత్సాహాన్ని బట్టి వుంటుంది. బిల్‌గేట్స్‌కు ఎవరు చెప్పారు ఎదగాలని? సత్యం, ఇన్ఫోసిస్ రామలింగరాజు, నారాయణ మూర్తి గారలకెవరు చెప్పారు? గుమాస్తా జీవితాన్ని ప్రారంభించిన రిలయన్సు అంబానీకి ఎవరు చెప్పారు ఎదగాలని? అనాథగా పుట్టిపెరిగిన ఫోర్డ్‌కు ఎవరు చెప్పారు



ఎదగాలని? అంతా సంకల్పబలం. పట్టుదల, నిరంతర కృషి. విశ్వవిజేత అలెగ్జాండర్ ఒక మాటన్నాడు. గెలవదలుచుకున్నవారికి ఈ ప్రపంచం చాలా చిన్నది అని. నేను ఇంతకన్నా కొత్తగా, అదనంగా చెప్పడానికేమీ లేదు. మీరు ఎంతగా ఎదిగితే అంతగా సేవచేసే అవకాశం ఉంటుంది. ఈ విషయం మాత్రం మర్చిపోవద్దు. బెస్టాఫ్ లక్" అన్నాడు చంద్రమౌళి.

అందరు సంతోషంతో చప్పట్లు.

ఎందుకో తెలియక అయోమయంగా చూశారు లస్మయ్య, లచ్చింబాయి.

తమ కొడుకు, కోడలు ఏపని చేసినా మంచిపనే చేస్తరు అని మనస్సులో తృప్తి నిలుపుకున్నారు లచ్చింబాయి, లస్మయ్య. వారికి గతమంత కళ్ళ ముందు కదలాడుతోంది.

కూతుళ్ళమీద ప్రాణం కొట్టుకుంటోంది. అళ్ళుళ్ళుకూడా ఇక్కడికివస్తే ఎంత మంచిగుండు అనుకున్నారు. అదేమాట వాళ్లను అడిగారు.

"అలాంటివాళ్లకోసమే ఈ సంస్థ పెడుతున్నది. వాళ్లక్కడ కంప్యూటర్ ట్రైనింగ్ చేస్తే ఇక్కడ ఏదో చిన్నపనైనా ఇప్పియ్యవచ్చు. అదే మా ప్రయత్నం" నవ్వుతూ అన్నాడు విజయ్.

**ఆదివారం వార్త 21-8-2005**

# ప్రశాంతం

రాపోలు ఎల్లయ్య స్వచ్ఛంద పదవీ విరమణ చేసి పదేళ్ళయింది. నిజానికి అప్పుడీ పథకం లేదు. ఈ పేరూ లేదు. బొంబాయి బట్టల మిల్లులో సాంచాలు నడిపేవాడు. బిడ్డ విమల పెండ్లికెదిగింది. అంతదాకా బట్టకు పొట్టకు నడిచింది. బిడ్డ పెండ్లి ఎట్ల చేయాల్నో తోచలేదు. అప్పు ఎక్కడ పుట్టక ప్రావిడెంట్ ఫండ్ చేతికి రావడంకోసం చేస్తున్న పనికి రాజీనామా చేసిండు.

బిడ్డపెండ్లి అల్లుడు లక్ష్మణ్‌తో మంచిగనే జరిగింది. బొంబాయిలో పని మాత్రం పోయింది. దత్తాసామంత్ 1982 లో యాడాదిన్నర సమ్మె చేయించినపుడు రెండున్నర లక్షలమందికి పనిపోయింది. అప్పుడే ఎట్లనో ఒకట్ల బతికినం ఇప్పుడు బతకరాదా అనుకున్నడు.

పనిపోతే పోయిందిలే అని ఎల్లయ్య బొంబాయి వదిలి బిడ్డ పెండ్లయినంక భీవండి చేరిండు. భీవండిలో పనిగంటలు ఎక్కువ. రోజుకు పన్నెండు గంటలు పనిచేయాలె. ప్రావిడెంట్ ఫండ్‌లేదు. కార్మికుల సంక్షేమ చట్టాలేవీ అక్కడ అమలులో లేవు. నాలుగేండ్లకే ఆరోగ్యం దెబ్బతిని ఇంటికచ్చి చేరిండు.

జగిత్యాల డివిజన్‌లోని కొడిమ్యాల మండలం దగ్గర పల్లెటూరు ఎల్లయ్యది. పచ్చని చెట్లు, అడవి, ఊల్లె ఉండుడు అలవాటైతే మల్ల ఏవూరికి పోబుద్దికాదు. తెల్లారిలేసి వాల్లతోని వీల్లతోని ముచ్చటవెట్టి అంబటాల్లకు ఈతచెట్లల్లకు పోయి వాడకం కల్లుతాగుడు. ఇంటికచ్చి ఇట్ల ఎంతకాలమని కూసుండి తినుడు? చిల్లర పనులు చేసుకుంట పొట్ట కెల్లదీసిండు. కొడుకు పెండ్లి చేసిండు. వాల్లిచ్చిన కట్నం పెండ్లికర్చులకే సాల్లేదు.

మనుమలు, మనుమరాండ్ల పురుల్లు చేసిండు. వెయ్యి రెండువేల చొప్పున అప్పులు పెరగవట్టె. ఎల్లయ్యకు వయస్సు పెరుగుతున్నకొద్దీ వేరే బాధ్యతలు పెరుగుతున్నయి. మల్లా ఏదో ఒకపని చేయక తప్పలేదు. చేద్దా మంటే సొంత ఎవుసం లేదు. నాగలి లేదు. ఎడ్లు లేవు.

ఇంటిముంగన్నే ఇంత చాయె హోటల్ పెట్టిండు ఎల్లయ్య. అది కల్సిరాలేదు. ఉద్దెర లెక్కో అయినయి. పెట్టువడి లేకుంటైంది. ఇగ లాభంలేదని మల్ల భీవండికి పోవుడు సాతగాదని సిరిసిల్లలో పవర్‌లూం కార్మికుడిగా పనిలో చేరిండు.

సిరిసిల్ల భీవండి కన్ననయమే. అక్కడి తీర్గ పాయిఖానాకు లైను, పొట్టకు తినేకాడ లైను, పండుకునేకాడ లైను కట్టుడులేదు. మంచి చల్లనిగాలి వెలుతురు...పాణం హాయిగ అన్పించింది. కానీ సిరిసిల్లలో కరెంటు సరిగ్గా ఉండది. కరెంటు సరిగ్గా ఉంటే నేసే భీములు సరిగ్గా వుండయి. పని సరిగ్గా వుండది. పని సరిగ్గా ఉంటే కూలి సరిగ్గా ఉండది.

ఏదో నడుస్తాందిగదా...పదిరోజులకోసారి ఇంటికి పోయిరావచ్చు. మనుమలు, మనుమరాండ్లను కొడుకు కోడలు అందర్ని చూసుకోవచ్చు అనుకుని తృప్తి నింపుకున్నడు ఎల్లయ్య.

పని సరిగ్గా నడవకపోయినా పెద్దగ బాధనిపించలేదు. పనిలేన్నాడు బస్సెక్కి ఇంటి కచ్చిపడు. అక్కడి కష్టమంత మర్చిపోవు. ఇంటికాడ నికార్సయిన ఈత కల్లు దొరుకు. అది తాగితే కమ్మటి నిద్ర... ఇట్ల చేసీ చెయ్యక ఇంత పొట్టకు నడిపిస్తండు ఎల్లయ్య.

ఇంకోబిడ్డ ఏడోతరగతికే సదువు బందుచేసింది. పెండ్ల కెదుగుతాంది. కోడల్ను దీసుకొని కొడుకు ఏదో పని చేస్త అని మెట్‌పెల్లికి మకాం మార్చిండు. ఇల్లంత బోసిపోయింది.

ఇట్లుండంగ అకస్మాత్తుగ ఒకరోజు ఎల్లయ్య పనిచేసే పవర్‌లూం యజమాని ఆత్మహత్య చేసికొన్నడు. పరిశ్రమ సరిగ్గా నడవక, అప్పులు ఎక్కువై వడ్డీలకు చాలక ఏంచేయాల్నో తోచక ఆత్మహత్య చేసుకున్నడని ఊరంత అనుకున్నరు. అప్పులిచ్చినోల్లు మనుసుల్నే తిట్టుకున్నరు. బాకీలు పెట్టినోల్లు ఎగపెట్టచ్చని లోలోపల సంతోషపడ్డరు.

గింత ఇరాం లేకుండా పనిచేసినా బట్టకు గిట్టుబాటులేకపోవడం ఏమిటో ఎల్లయ్యకు అర్ధం కాలేదు. తానైన ఇంటికాడ ఇంత కల్లుబొట్టు తాగుతడు కని తమసేటు కెటువంటి అలవాట్లు లేవు. పొద్దుందాక తెల్లందాక తమ తీర్గనే ఏదో పనిచేస్తనే ఉంటుండె. అయినా సేటుకు సేటు మందం జీతమైన గిట్టుబాటు ఎందుకు కాలేదు? తనకంటే తక్కువ కూలికి పనిచేస్తే తప్ప గిట్టుబాటు కాదా? ఇప్పుడేం కూడబెట్టిన ఈ కూలి పనిచేసి. ఇంకా తక్కోకు చేస్తే ఏం తింటం? ఎట్ల బతుకుడు?

పవర్‌లూం యజమానుల సంగం సంతాపసభ పెట్టిన్రు. అటు తర్వాత ఈ సంక్షోభం నుంచి ఎట్ల బయట పడాల్నో చర్చలు చేసిన్రు. ఎల్లయ్య ఇంకో సేటు దగ్గర పనికి కుదిరిండు.

యాడాది గడిసింది. అదేందోగని ఈ పవర్‌లూం యజమాని ఉరేసుకున్నపుడు నూలు ధర పెరిగింది. కరెంటు ధర పెరిగింది. ఈ రెండూ దర తగ్గిస్తే ఈ ఆత్మహత్యలు ఆగుతయి అన్నరు కొందరు.

ప్రభుత్వం ఎనుక ముందు జూడకుండ బయటి దేశాలకు పత్తి, నూలు ఎగుమతికి అనుమతి ఇచ్చింది. దాంతోని ఇక్కడ దొరకక ధరలు రెట్టింపైనై. అట్ల జరగకపోతే ఈ యజమానులు ఆత్మహత్యలు చేసికోకపోదురు అన్నరు కొందరు. అవన్ని విన్నంక నిజమే అనుకున్నడు ఎల్లయ్య. ఇంకోచోట పని వెతికిండు ఎల్లయ్య. సిరిసిల్లలో ఎవరిదగ్గరైనా ఇదే స్థితి.

ఎల్లయ్య మల్లా ఇంటికచ్చి చేరిండు. ఇంతలో ఎల్లయ్య పక్కింటి వెంకటయ్య పవర్‌లూం పని దొరకక ఆకలికి అప్పులకు తాళలేక ఆత్మహత్య చేసుకున్నట్టు తెలిసింది. పోస్టుమార్టం అయి డాక్టర్లు, పోలీసులు శవాన్ని



అప్పగించే సరికి సాయంత్రం అయింది. అదే రాత్రి ఇంటికి తెచ్చిన్రు. కాలేసిన్రు. కేవలం ఇరవైవేల రూపాయల అప్పు తీర్చలేక ఉరేసుకోవడం అందర్ని కలచివేసింది.

వెంకటయ్య భార్య ఏడుపు చూసి ఏడవనోల్లు లేరు. వారం రోజులు కర్మకాండలు జరిగినై. తనే చచ్చిపోయినట్టు అవన్ని తనకే జరిగినట్లు గుబులు పట్టుకున్నది ఎల్లయ్యకు. ఏవేవో ఆలోచనలు. ఎల్లయ్యకు ఇంటికాడ ఉండబుద్ధికాలేదు. సిరిసిల్లకు పోబుద్ధి కాలేదు.

అల్లుడు బిడ్డ రమ్మంటే ఎల్లయ్య గోదావరిఖనికి బయల్దేరిండు. అల్లుడు లక్ష్మణ్ చాలా మంచోడు. కాని అల్లుని కష్టాలు అల్లునివి. ఎపుడు ఏమవు తుందో తెలియదు.

ఎంత చెడ్డా బిడ్డింటికి అల్లునింటికి ఎందుకు పోవద్దంటరో ఎల్లయ్యకు ఇప్పుడు ఎరుకైంది. దూరంగా ఉన్నంతసేపు అల్లుడు బిడ్డ మంచిగ బతుకుతున్నరన్న తృప్తి ఉండేది. ఇప్పుడా తృప్తి తన భ్రమ అని తేలిపోయింది. మనుమలు మనుమరాండ్లతో ఆడుకుంటే కాస్త ఊరటగుండేది ఎల్లయ్యకు.

అల్లుడు లక్ష్మణ్ పనిచేసి చేసి బొక్కలు తేలిండు. తాను అక్కన్నే ఏదైనా చిన్న వ్యాపారం మొదలుపెట్టానుకున్నడు. తండ్రి తమ దగ్గరున్నందుకు విమల సంతోషానికి అంతులేదు. పిల్లలను, ఆడించుడు, నీల్లు తెచ్చుడు, కూర గాయలు తెచ్చుడు, బడికి తీస్కపోవుడు...

తండ్రి వల్ల విమలకు ఎంతో తీరికి దొరికింది. అల్లుడు, బిడ్డ కొద్దిగ నిగనిగ అయింద్రు. కని ఎల్లయ్య పెట్టిన కూరగాయల బండి ఎక్కువకాలం నడవలేదు. అప్పటికే చాలా మందైపోయిరి. ఇక ఇన్ల లాభంలేదని మల్ల ఇంటి దారి పట్టిండు ఎల్లయ్య.

ఎల్లయ్య పోతనన్నప్పుడు అల్లుడు బిడ్డ కండ్ల నీళ్లు పెట్టుకున్నరు. అల్లుడు లక్ష్మణ్, తన తండ్రిని గోదావరిఖని రమ్మని ఎన్ని సార్లడిగినా రాలేదు. మీవూరికచ్చి నీముంగట మట్టి పని చేసుడు నీకు నామర్ద. నాకు గూడ మంచిగనిపియ్యది. పని చెయ్యకపోతే ఎల్లది. ఇంకా ఇద్దరెట్ల ఎదగాలె. పెండ్లిల్లు ఎట్ల చెయ్యాలె అనెటోడు.

ఇంట్ల ఇంటికి పెద్ద ఒకల్లుంటే ఇల్లు ఎంత స్వర్గం తీరుంటదో అల్లుడు

బిడ్డకు అప్పుడే తెల్సింది. అందుకే కన్నీళ్ళతో సాగనంపింద్రు.

ఎల్లయ్య మల్లా చేనేత మగ్గం నేయాలనుకున్నడు. ఆ బట్ట కొనేవాళ్ళు కనపడలేదు. పెట్టుబడికూడా చాలా కావాలె. తన దగ్గరలేదు. అందరూ నేత బట్టలుకొంటే నేతకార్మికుల ఆకలిచావులెందుకుంటయి అని ప్రశ్నించుకున్నడు ఎల్లయ్య. గర్మకుర్తిలో ఒక అయ్య దగ్గర చేనేత పనికి కుదిరిండు ఎల్లయ్య.

ఎక్కడ చూసినా మిల్లు బట్టలు. రెడీమేడ్ బట్టలు. ఇతర దేశాలకెల్లి కూడవస్తున్నయి. అవి వేసుకుంటేనే ఖదర్ అట. ఇక్కడికెల్లి పత్తి నూలు ఎగుమతి చేసుడెందుకు? అక్కడి బట్టలు దిగుమతి చేసుకునుడెందుకు? వాల్ల ఫ్యాషన్లతోటి మన నేతబట్ట పోటీ పడ్తదా?

గాంధీకాలంనాడు చేనేత అన్నరు. స్వదేశీ అన్నరు. ఇప్పుడదంతా ఎక్కడపోయింది అని ఒక సంగం పెద్ద అంటుంటే ఎల్లయ్యకు సరిగ్గా అర్థంకాలేదు. తమ బతుకుల్లో మన్నువోస్తున్న మిల్లులు మూలకు వడ అని తిట్టుకున్నడు ఎల్లయ్య.

ఎక్కన్నో తయారైన మాలు ఇక్కడికి పంపి అమ్ముకుంటే మేం అక్కడికిపోయి పని చేసి బతికే స్వేచ్ఛ గూడ ఉండాలె. మేం కూడ అక్కడికిపోయి మా రెక్కల కష్టం అమ్ముకునే స్వేచ్ఛ లేకుంట అక్కడ తయారైన నూలు ఇక్కడికి పంపి అమ్మితే మేం ఏం పని చేసుకొని బతకాలె అని ఎల్లయ్య ఆలోచనలు నాడెలాగా కొట్టుకుంటున్నై.

దసరాపండుగకు అల్లుడు, బిడ్డ, వియ్యంకులు, కొడుకు, కోడలు, మనుమలు, మనుమరాండ్లతో ఎల్లయ్య పాతఇల్లు నిండిపోయింది. ఎన్నాళ్ళకో ఆ ఇల్లు ఆనందంతో కళకళలాడింది. అది ఎన్నో రోజులు మిగలలేదు.

అల్లుడు లక్ష్మణ్ బాధపడ్తూ విషయం చెప్పిండు. అతన్ని కంపెనీలో డాక్టర్లు అన్‌ఫిట్ అన్నరని చెప్పిండు. స్వచ్ఛంద పదవీవిరమణ తీసుకో మన్నరట.

నన్నొక యంత్రంతీరు వాడుకొని వదిలేసుడేనా? నాకిచ్చిన జీతం ఎప్పటికప్పుడు ఖర్చుయిపాయె. కాళ్లు చేతులు కూలవడ్డంక ఎట్ల బతుకుడు? పిల్లలను ఎట్లా చదివించుడు. మల్ల ఏం పని చేసుడు. ఇప్పుడు కొత్తగా మల్ల ఏం పని నేర్సుకునుడు? లక్ష్మణ్ అనడంతో దసరాపండుగకు కళకళలాడిన ఆ



ఇల్లు తెల్లారే చెన్నబోయింది.

కుక్కకున్న విశ్వాసం ఆ కంపెనీకి కార్మికుల మీద లేదు. గింత అన్యాయమా? ఎల్లయ్య కూతురు విమల తలబాదుకుంది.

"మనుషులకు పనిలేకుంట చేసే యంత్రాలు వస్తే మనుషులు ఏంపని చేసుకొని బతకాలె బావా?" అంటూ ఎల్లయ్య వియ్యంకుడు వీరయ్య ఎల్లయ్యనే అందుకు కారకుడైనట్టు నిలేసిండు.

"గదే నేనడుగుదామనుకుంటున్న. ఎవలనడుగాల్నో తెలుస్తలేదు బావా?" అన్నడు ఎల్లయ్య.

వియ్యంకుడు వీరయ్య మట్టి పనిచేసేవాడు. ట్రాక్టర్లు, ప్రొక్లెయినర్లు వచ్చినంక వీరయ్యకు పని దొరక్కుండపోయింది.

చిన్నకొడుకు అరబ్బు దేశంల పని వెతుక్కుంటనని పైరవి చేస్తున్నడు. నీ దగ్గరేమన్న పైసలెల్లయా బావా? అనడిగిండు వీరయ్య.

"కుల వృత్తులు కూడు పెట్టకపాయె. ఈ కొత్త వృత్తులు ఎప్పుడు పోతయో తెల్వదాయె. రేపటిమీద ఆశలేకపాయె. ఎట్ల బతుకుడు? అని ఏదో తత్వం పాట అందుకున్నాడు ఎల్లయ్య.

బైరాగులు పాడే ఆ తత్వం పాటలు చనిపోయినప్పుడు కర్మకాండల కాడ పాడుకునుటానికి పరిమితమైపోయినై. ఎల్లయ్య ఆ పాట పాడ్డంతో ఇల్లంతా విషాదమైపోయింది.

"అందర్ని గొట్టి ఈ పరిశ్రమలు ఎవర్ని బతికిస్తున్నయి మామా? బక్కోడు, కుంటోడు కార్లపోయెటోనితోని పోటీపడ్తరా? మామా? పనిచేసే రెండు చేతులకు పని కల్పించని ప్రణాళికలెందుకు? ప్రభుత్వాలెందుకు?, అని విరుచుకపడ్డడు అల్లుడు లక్ష్మణ్.

ఎల్లయ్యకు అంత పెద్ద మాటలు రావుగని అల్లుడు మాట్లాడుతున్నదాన్ల న్యాయముందనిపించింది.

ఆ తత్వం పాటల జీవుని గురించి అన్నట్టే ఉన్నది. పనిచేసే మనుషులకు జీవిత భద్రత లేకపోతే సమాజానికి భద్రత ఎట్లా వుంటుంది? పరిశ్రమలు మనిషికి సహకరించాలె గని మనిషిని తినేస్తే ఎట్ల బావా? అన్నడు వీరయ్య.

ఆరునెలలు గడిచినై. స్వచ్ఛంద ఉద్యోగవిరమణ కింద అల్లుడు లక్ష్మణ్‌కు వచ్చిన పైసలు తమ్ముడు అరబ్బు దేశాలకు పోవుటానికి చేసిన అప్పులు కట్టుటానికి పనికచ్చినయి.

అల్లుడు లక్ష్మణ్ బిడ్డ విమల కుటుంబంతో సహా ఇల్లు చేరిన్రు. అంతదాకా స్కూలు డ్రెస్సులు టైలేసుకొని ప్రయివేటు స్కూల్లో చదువుకున్న అతని పిల్లలు సాదా డ్రెస్సుల్లో సర్కారు బడికి పోతున్నారు.

లక్ష్మణ్‌కు ఆ పల్లె ఎంతో హాయిగా ఉందనిపించింది. ఆ పల్లె, చల్లగాలి అంతా మంచిగనే ఉందిగాని చేసుటానికి పనిలేదు. దున్నటానికి ఎవుసంలేదు. ఆగమాగంగ కార్మికునిగ డ్యూటీ చేసిన బతుక్కు తిరంలేకుండె. ఇప్పుడు పల్లె మొత్తం తిరమే. తీరుపాటంగ బతుకుడు అలవాటు చేసుకున్నడు లక్ష్మణ్.

పొయ్యిల కట్టెలులేవని విమలంటే గొడ్డలి తీసుకొని అడవిలకు పోయిండు లక్ష్మణ్. అడవిలో కట్టెలు కొడుతుంటే ఎన్నెన్నో చిన్నప్పటి ఆటలు పాటలు జ్ఞాపకాలు. చెమటలు కారుతుంటే అలసటకు బదులు ఆనందం కలిగింది లక్ష్మణ్‌కు.

సైకిల్‌కు సరిపడా కట్టెలు కట్టుకుని వస్తుండంగ ఫారెస్టుగార్డు అడ్డగించి పైసలు అన్నడు. గింతసేపు కట్టెలు కొడ్తె కనవడనోడు గిప్పుడెట్ల వచ్చే అనుకున్నడు లక్ష్మణ్. వాని పనే తప్పులు వట్టుడు అని లక్ష్మణ్‌కు తెలువది.

పైసలియ్యకపోతే కేసుపెట్టి జేల్లేపిత్త అన్నడు గార్డు.

"పైసలు తీస్కరాలె. మల్లస్త" అని సైకిలు అక్కన్నే పారేసి ఇల్లు చేరిండు లక్ష్మణ్. మల్లా అటు పోలేదు లక్ష్మణ్.

ఏం పని లేదా అని విమల ఊకె గులిగితే నాలుగు గాలాలు తీసుకొని చేపలకని బయల్దేరిండు లక్ష్మణ్. చేపలు బాగనే దొరికినై. తోవలో అది చూసిన బెస్తోల్లు ఊర్లె పంచాయితి పెట్టిన్రు. ఆ చెరువును వాల్లె గుత్తకు తీసుకున్నరట. ఆ చెరువు కింద బావులు కాడ చాపలు గూడా మావే అన్నరు. కాళ్ళు పట్టుకొని వాల్ల సంగానికి దండుగ కట్టి బయటపడ్డడు లక్ష్మణ్.

"అట్ల సైకిల్ పోగొట్టినవు. ఇట్ల దండుగు కట్టినవు. నువ్వు ఏ పని చేసినా ఇగగింతే. ఉన్నకాడ సప్పుడంట కూసో" అన్నది విమల.

అల్లుడు లక్ష్మణ్‌కు అంతా అయోమయంగా వుంది. ఈ భూమి, నీరు, చెరువు, అడవి, చెట్టు, కట్టెపుట్ట ఏది తనదికాదు.



ఈ ప్రకృతి ఎంత అందమైనదో, ఈ పల్లె ఎంత ప్రశాంతమైనదో...కాని ఇందులో తనకేమి చెందదు. ఈ గాలి కూడా తన దవునోకాదో...ఈ చెట్లు చేమలు పక్షులు చేపలు పొలాలు చెరువులు ఏవీ తనవి కావు. ఈ పల్లెను ఎట్లా ప్రేమించాలె. ఈ పల్లెల ఎట్ల వుండాలె.

ఇన్నాళ్ళు ఆ ఉద్యోగం తనది అనుకున్నడు. ఆ ఉద్యోగం పోయింది. ఉద్యోగ భద్రతకూడా పోయింది. తనకు జీవితంలో మిగిలిందేమిటి? ఈ పాత ఇల్లొకటేనా?

తన జీవితం ఇక అంతా ప్రశాంతమే. అల్లుడు లక్ష్మణ్ రోజూ ఆ వూరి చెరువు కట్టమీదో, ఈదుల్ల మర్రికిందో వెల్లకిలా పడుకుంటడు.

"నాన్నా అమ్మ అన్నం తినరమ్మంటంది" అని పిల్లలు వస్తే పోయి కాస్త తింటడు. మల్లా ఏదో చెట్టు కిందకి చేరుతడు.

ఎల్లయ్యకు అల్లుని స్థితి చూసి ఏం చేయాలో తోచలేదు. తన కండ్ల ముందే ఎదిగిన కొందరి జీవితాలు...శిథిలమై విధ్వంసమవుతున్న సమాజం. బైరాగితత్వాలు సమాజ విధ్వంసాన్ని ప్రశాంతంగా భరించే శక్తి నిస్తున్నాయి.

ఆ తత్వాలు ఎందుకు పెట్టినయో ఎల్లయ్యకు ఇప్పుడు అర్థమైంది. విమలకు అర్థంకాలేదు. తండ్రిని, భర్తనుచూసి ఎవరూ చూడకుండా కన్నీరుకారుస్తోంది.

ఆమె దు:ఖంలో కోపంలేదు...ప్రశాంతంగా ఏడుస్తోంది.

ఆ ప్రశాంతంలో ఒక నిరాశ. ఒక నిర్వేదం.

అది ఒక సమాధి దశ.

రేపటి సమాజం కూడా ఇంతేలే అని ఆశలన్ని సమాధి అవుతున్న దశ.

తండ్రి ఎల్లయ్య బైరాగితత్వం రాగం తీస్తున్నడు.

ఇల్లంతా విధ్వంస చిహ్నాలకు బదులుగా విషాదం ప్రశాంతంగా చిక్కగా పరుచుకుంటున్నది.

**ఆదివారం వార్త, ఫిబ్రవరి 2003**

**ఆకాశవాణి కార్మికుల కార్యక్రమం, వేదప్రియ కథా సంకకలనం 2003**

# జైలు జీవితం

జైలుకు వెళ్ళడం నాకు అదే మొదటి సారి. భయంభయంగా ఉంది. జైలు గేటుముందు చాలామంది జైల్లో వాళ్ళని కలవడానికి వచ్చి ఎదురుచూస్తున్నారు. అందరూ ఎవరి గోసలో వాళ్ళున్నారు. ఒకరి గోస మరొకరు చెప్పుకుంటున్నారు.

నేను పెద్ద గేటు దగ్గరికి చేరాను. అక్కడ ఒక జైలు పోలీసు ఎవరు కావాలి అని అడిగాడు. పేరు చెప్పాను. యూటీ (అండర్ ట్రైల్) నంబరు ఉందా? అని అడిగాడు. జైలు నుంచి అతను రాసిన కార్డు చూపించాను.

ఆ కార్డు మీద యూటీ నంబరు, నా పేరు నోట్ చేసుకుని సరే అలా చెట్ల కింద ఉండండి. ములాఖత్‌కు వరుసగా పిలుస్తాం అని ఆ చెట్లవేపుకు చూపించాడు.

ఆ చెట్లకింద ముచ్చట్లు పెడ్తున్న వాళ్ళు, సొదను వెళ్ళబోసు కుంటున్నవాళ్ళు నన్ను గుర్తుపడ్తారేమోనని సంకోచం వేసింది. జైలుకురావడం కాస్త సిగ్గుగా



వుంది. జైల్లో మీవారెవరున్నారు? అని ఎవరైనా అడిగితే తలకొట్టేసినట్టుగా ఉంటుందనిపించింది.

అందుకే వెంట తోడు తీసుకురాకుండా ఒక్కడినే బయలుదేరాను.

రవి జైలుకెళ్ళి సంవత్సరం కావస్తుంది. దగ్గరి స్నేహితులం. దూరపు బంధువులం. ఎందరో చూడ్డానికి వెళ్ళారు. నేను వెళ్ళలేదు. రవి ఇప్పటికి మూడు ఉత్తరాలు రాసాడు. ములాఖత్‌కు వెళ్ళిన వాళ్ళకు గుర్తుచేస్తూ రమ్మని కబురు పంపాడు. అయినా భయం, ఒక రకమైన అవమానం అనిపించి వెళ్ళలేదు.

పాపం, వీళ్ళు ఇంతపెద్ద గోడల మధ్య జైలుగదుల్లో ఏళ్ళ తరబడి ఎలా బతుకుతారో! జైల్లో ఇలా బతకడం కన్నా చావడం మేలనిపించింది.

వెనకటి కాలంలో జైళ్లు చీకటి గుహల్లా ఉండేవి అన్నట్టు సినిమాల్లో చూపించేవారు. జైళ్లు ఇప్పుడు ఎలా ఉంటున్నాయో?

బయటి ప్రపంచానికి సంబంధంలేని ఈ జైలు జీవితం ఎందుకోసం, ఎవరికోసం? అనిపించింది. ములాఖత్ కోసం ఎదురుచూపులో ఒక వైరాగ్యం కమ్ముకుంటున్నది. మనసంతా భారమైపోయింది.

ఆ పక్కన నిలబడ్డ పల్లెటూరి స్త్రీల గుంపు ఒకటి శాపనార్థాలు పెడుతున్నారు. వాళ్ళ ఆయన్ని లేని దొంగతనం కేసుపెట్టి శిక్షవేసి జైల్లో పెట్టారని "వాళ్ళ కడుపు కాల, వాళ్ళ మొల్దారం తెంప" అని తిట్టిన తిట్టు తిట్టకుండా ఎవరెవరినో తిడ్తున్నది.

ఇటుపక్కన ఒక తల్లి ఏడుస్తున్నది.

"నా కొడుకు ఏం జేసిండని జైల్లో వెట్టింద్రు. వీళ్ళ సావుగాను. వీళ్ళ దినాలుగాను. వీళ్ళను జెల్ది దుబ్బగడ్డకు వెట్ట. వాళ్ళ వంశం నిర్వంశంగాను. వాళ్ళింట్ల నరుప్పలు పుట్ట" అని శాపనార్థాలు పెడుతోంది.

ఆమె కొడుకు దొంగతనం చేయలేదట. కొట్లాటకు పోలేదట. అన్నలకు సద్దులు మోసినవ్, ఉత్తరాలు ఇచ్చివచ్చినవ్ అని కొట్టి అన్నలల్ల కలిసి బాంబులేసిండని కేసు పెట్టింద్రట.

ఆ తల్లి పక్కన ఉన్న ఆమె కోడలు ఏడుస్తోంది.

"కులం చెడ్డా సుఖం దక్కకపాయె. దీని బతుకు ఆగమైపాయె" అంటూ కోడల్ని ఎవరికో చూపిస్తూ చెప్తోంది.

"పోలీసులు ఇంటికి వచ్చి బెదిరించి కల్లు తెప్పించుకునేటోల్లు. ఆ పని ఈ పని చెప్పి కొడుకును నన్ను బయటికి పంపి కోడల్ను బెదిరించేటోల్లు. ఇట్లనన్నా కేసులు తప్పుతయని అనుకున్నం. కొడుకు వాళ్ళకు భయపడి వాళ్ళను ఏమీ అనలేక, భార్యను ఏమి అనలేక గుడ్లనిండా నీళ్ళు తెచ్చుకునేటోడు".

"ఒకసారి ఇద్దరు పోలీసులు వచ్చి కల్లు, గుడాలు, మాంసం కావాలని వండించుకుని తిన్నరు. తరువాత దీన్ని చెర పట్టాలనుకున్నరు. ఇది భయపడి బయటికి వచ్చి కొడుకుకు చెప్పి నేను ఇంట్లకు పోను అని ఏడ్చింది".

"ఏమీ చేయలేక ఎవరికీ చెప్పుకోలేక నేను, కొడుకు, కోడలు ఏడ్చి ఏడ్చి అక్కడే బయట ఉన్నం. ఒక పోలీసోడు 'కూర వడ్డిద్దువు రా' అని కోడలును ఇంట్లోకి రమ్మని పిలిసిండు. కొడుకు నేను వస్తా పా అని అంటే నువ్వెందుకురా అని ఆమెనే రమ్మని బలవంతం చేసిండు. కొడుకు అప్పుడు ఎదురు తిరిగిండు. దాంతోటి కొడుకును కొట్టి దీన్ని ఇంట్లకు గుంజుకుపోయిన్రు. ముసల్దాన ఎవరూ రాకుండా ఇంటి ముంగట కావలి ఉండు అని బెదిరించిన్రు. ఇట్ల ఎన్ని అవస్థలు పడ్డా కొడుకును జైలుకు పట్టిచ్చిన్రు" ఆ ముసలి తల్లి ఏడుసున్నది.

"అట్లా మర్లపడ్డ తరువాత కొడుకును అడ్డం రాకుండా చేయాలని పోలీస్ స్టేషన్లవేసి పదిరోజులు బాగా కొట్టి చిత్రహింసలు పెట్టి జైలుకు పంపించిన్రు. తర్వాత డ్యూటీ పేరిట వచ్చుకుంట ఎవరెవరో దీన్ని పాడు చేసిన్రు. రెండుసార్లు దిగతాగించినంక దీని పానం తెర్లయిపోయింది. ఒకసారి బాధ భరించలేక ఎదురు తిరిగితే ఎన్‌కౌంటర్ చేస్తా అని బెదిరించిన్రు.

"చచ్చిపోయినా మంచిగుండు కాని చచ్చిపోతే వీడు జైళ్ళకెళ్ళి బయటికి వచ్చుడెట్ల" అని గోడుగోడున ఆ తల్లి ఏడుస్తున్నది. కోడలుకూడా ఏడుస్తున్నది. ఆ తల్లి ఏవో పండ్లు అప్పాలు పేగులో మూట గట్టుకుని వచ్చినట్లున్నది. ఆ మూట వాళ్ళకు చూపిస్తున్నది.

మనసంతా ఎలాగో అయిపోయింది. ఇది నా చుట్టూతా ఉన్న ప్రపంచమేనా? నా చుట్టూ ఉన్న పల్లెల్లో ఇన్ని ఘోరాలు జరుగుతున్నాయా? నేను మరో లోకంలోకి వచ్చినట్టు అనిపించింది.

ఎదురు చూస్తుంటే ఆలోచిస్తుంటే కళ్ళు పీక్కుపోయాయి. మెదడంతా వేడెక్కిపోయింది. రెండు గంటల తర్వాత ములాఖత్‌కు రమ్మని నాకు పిలుపు వచ్చింది. నేను ఇంట్లోంచి బైలుదేరినప్పటి మూడ్ వేరు. మాట్లాడదామనుకున్న



విషయాలు వేరు. ఇక్కడికొచ్చాక మనసంతా ఏదోలా అయిపోయింది. రాకపోయినా బాగుండేదని అనుకున్నాను. కానీ, నాకోసం ఎదురుచూస్తున్న మిత్రునికోసం జైల్లోకి ముందుకు నడిచాను.

జైలు పోలీసులు నన్ను నిలువెల్లా తనిఖీ చేసారు. నేను తెచ్చిన పొట్లాలను విప్పి చూసారు. అతడు నీకేం కావాలని అడిగారు. చెప్పాను. అయిదు నిమిషాల తర్వాత అదిగో అటు వెళ్ళు అన్నారు.

జైలు కిటికీ అవతల వాళ్ళు. కిటికీ ఇవతల నేను. నమస్తే బాగున్నావా అని అడిగాను. జైల్లో బాగుండడమేమిటో అని నాలిక కరుచుకున్నాను. కానీ, రవి నవ్వుతూ ఆ అంతా బాగేనన్నాడు.

ఆ నవ్వు చూస్తే అది నిజమేననిపించింది. ఎండ పొడ పడక మనిషి కొద్దిగా తెలుపు అయ్యాడు. కాస్త లావుకూడా అయ్యాడు.

నేను అనుకున్నంత బాధలో ఏమి లేడు. అయిదు నిమిషాలు అవి ఇవి మాట్లాడుకున్నాక నేను మళ్ళీ మామూలు మనిషినయ్యాను. అప్పుడడిగాను.

"ఈ జైలు జీవితం ఇంకెన్నాళ్ళు?"

రవి నవ్వుతూ అన్నాడు- "నాకైతే ఇంకా చాలాకాలం జైల్లోనే ఉండాలనిపిస్తున్నది. ఇప్పట్లో జైల్లోంచి బయటకు రాబుద్ధి కావడంలేదు. జైలే హాయిగా ఉంది".

"పంజరంలోని చిలుక పంజరంనుంచి వదిలేసినా తిరిగి పంజరంలోకే వస్తుందట. నీక్కూడా ఈ జైలు బతుకు బాగా అలవాటైనట్టుంది" అన్నాను నవ్వుతూ కసిగా.

"నిజమే. ఈ పంజరంలో ఒక క్రమబద్ధమైన జీవితం అలవాటు అవుతుంది. ఇంత క్రమ శిక్షణ గల జీవితం బయట లభిస్తుందా? గోడల్లోపల ఉన్నామనే బాధ వదిలేస్తే నాకిక్కడ వచ్చిన లోటేమీ లేదు. అందుకే విడుదలైన తర్వాత కూడా మళ్లీ కొంతకాలం జైలుకు రావాలని అనిపిస్తున్నది."

"అంటే నీ స్నేహితులు, బంధువులు, నీ బాహ్య ప్రపంచం అంతా ఎలాగైనా పోనీయా?"

"నాకు నిజమైన స్నేహితులెందరో, నిజమైన బంధువులెందరో జైలుకు

వచ్చినంకనే తెలిసింది. నువ్వు గొప్ప స్నేహితుడివనుకున్నాను. ఎంతమందితో చెప్పినా ఏడాదికి గాని నువ్వు చూసుటానికి రాలేదు" అంటూ నవ్వాడు.

నాకు కాస్త రోషం పెల్లుబుకింది. "కలువడానికి రాకపోయినంత మాత్రాన నీ గురించి నేను బాధపడ్డం లేదా? ఆలోచించడం లేదా? బేలు పిటిషన్లకోసం, ష్యూరిటీలకోసం వకీళ్ళచుట్టూ, కోర్టుల చుట్టూ తిరగడం లేదా?"

"వూరకే అన్నాను. నాకిక్కడ కూడా చాలామంది స్నేహితులు దొరికారు. వాళ్ళతో ముచ్చట్లతో సంవాదాలతోటి మాకు కాలం ఇట్టే గడిచిపోతుంది. ఇక్కడ ఒక నూతన మానవ సంబంధాలు ఆర్ద్రత రూపుదిద్దుకున్నాయి. నిజం చెప్పాంటే ఇది ఒక నూతన ఆదర్శ ప్రపంచం. జైల్లోనే దీన్ని నిర్మించుకోవడం సాధ్యపడింది. ఎందుకంటే ఇక్కడ ఆస్తి హక్కు తగాదాలు లేవు, హెచ్చుతగ్గులు అంతరాలు లేవు. అందరికీ ఒకే వంట. ఒకే కూర. ఒకే రకమైన జీవితం. అందువల్ల అందరం సమసమాజం వలె ఇక్కడ బతుకుతున్నాం. కుటుంబాలు లేవన్నట్టుగాని ఇక్కడ ఎంత హాయిగా ఉందో నిజంగా రేపొచ్చే సమాజం కూడా నేను జైల్లో బతికినంత హాయిగా ఉంటుందో లేదో."

జైలంటే నాకంటే ఎక్కువగా భయపడ్డ రవేనా ఈ మాటలు అంటున్నది అనిపించింది. సహవాసం, అనుభవం మనిషిని మార్చేస్తుంది. అనివార్యమైనప్పుడు మనిషి బానిసత్వాన్ని కూడా ప్రేమిస్తాడట. రవి జైలు జీవితాన్ని ప్రేమించడం అదే నేమో? అదేమాట అన్నాను.

"అదేమీకాదు. ఊహలు వేరు. భయాలు వేరు. వాస్తవంగా చూడ్డం వేరు. పాము అని ఊహించుకుని ఉలికి పడ్డప్పుడు భయపడ్తాం. కానీ, నిజంగా పాము కనపడితే అంతగా భయపడం, దాన్ని చంపడమో మనమే తప్పుకుపోవడమో చేయాలనే అచరణాత్మక ఆలోచనలు కలుగుతాయి. ఊహల్లోని భయాలే ఎక్కువ భయపెడతాయి. అవి ఎదురైనప్పుడు నిజానికి అంత భయమేమీ కాదు. నేను లాకప్పులో ఉన్నప్పుడు, జైలుకు వచ్చిన తరువాత కలిగిన అనుభవం ఇది. అంతకన్నా ముందు జైలంటే ఎంతో భయంగా ఉండేది. కానీ, ఇక్కడి కొచ్చిన తరువాత ఆ భయం పోయింది. గాంధీ, నెహ్రూ వంటి ఎందరో గొప్ప గొప్ప వాళ్ళు ఏళ్ళ తరబడి జైల్లో గడిపారు. నెల్సన్ మండేలా 27 ఏళ్ళు జైల్లోనే గడిపాడు. జైల్లో ఉన్నంత స్వేచ్ఛ నిజానికి బయటి ప్రపంచంలో ఉంటుందా? చాలామంది స్వేచ్ఛ కోసం జైలుకు వెళుతున్నాను అని అప్పుడప్పుడు ప్రకటిస్తుంటే



తెలియనప్పుడు ఆశ్చర్యపోయాను. వాళ్ళు ఎందుకలా అన్నారో ఇప్పుడు అనుభవం మీదే తెలుసుకున్నాను."

"మొత్తానికి జైలు పక్షివైపోయి జైలును ప్రేమిస్తున్నావన్నమాట" అన్నాను.

రవికి కోపం వచ్చినట్టుంది. సీరియస్‌గా మొహం పెట్టాడు. "స్త్రీలను వంట ఇంటికి బందీ చేసి కడప దాటనీయకుండా ఉన్న ఇల్లు నిజంగా స్త్రీలకు జైలు కాక మరేమిటి? స్త్రీలది జైలు జీవితమే. కాకుంటే గృహ నిర్బంధం. చాలామంది స్త్రీలకు బయటి ప్రపంచంతో ఉన్న సంబంధాలేమిటి? ఇల్లు, కుటుంబం తప్ప ఏవో పండుగ పబ్బాలకు, ఫంక్షన్లకు వెళ్ళడం తప్ప వాళ్ళకున్న సామాజిక జీవితమేమిటి? వాళ్ళతో పోలిస్తే ఇక్కడ మేం స్వేచ్ఛా జీవులం. మా అభిరుచులను ఆశయాలను స్త్రీలను ఇంట్లో కట్టిపడేసినట్లుగా ఇక్కడ కట్టి పడేయడానికి ఎవరూ లేరు."

"అయితే ఈ ఏడాది ఈ స్వేచ్ఛా జీవితంలో నువ్వు సాధించిందేమిటి?" అని ఉక్రోషంగా అడిగాను.

రవి నవ్వాడు. మెత్తగా నా చేతిని తన చేతిలోనికి తీసుకుని ఆత్మీయంగా తడిమాడు. నాకెందుకో గతం గుర్తొచ్చి కన్నీళ్ళు వచ్చాయి.

"ఈ ఏడాదిలో నేను సాధించింది చాలానే ఉంది. కొన్ని వందల పుస్తకాలు చదివిన. ఈ ప్రపంచం ఎంత విశాలమైందో తెలుసుకున్న. ముందుగా నా జీవితాన్ని ఒక ఆత్మకథ లాగా రాయడం ప్రారంభించిన. అప్పుడే మూడొందల పేజీలైంది. రెండు నవలలు రాసిన. పది కథలు రాసిన. మూడు సంపుటాలు కవితలు రాసిన. అయిదారు పాటలు కూడా రాసిన. నా పాటలు ఇక్కడ పాడుకుంటున్నారు కూడా. జైలు బయట ఉంటే ఒక యాడాదిల ఇన్ని చదవడం, ఇన్ని రాయడం నాతో అయ్యేదా."

"అవన్నీ నీ దగ్గరే ఉన్నాయా? జైల్లో గుంజుకోరా?"

"ఎందుకు గుంజుకుంటరు? వారంకోసారి మాకు ఏమేంకావాల్నో లిస్టు రాసిస్తే రెండు రోజులల్ల పోలీసులు కొనుక్కచ్చి ఇస్తరు. పెన్నులు, నోటుబుక్కులు, సబ్బులు, ఇట్లా ఏవంటే అవి కొనుక్కచ్చి ఇస్తరు. మన ఖాతాల ఖర్చు రాస్తరు. మీ అసొంటోళ్ళు వచ్చినప్పుడు ఇచ్చిన పైసలను ఎవలై వాళ్ళకు బ్యాంకు తీరుగ ఖాతాలో జమచేస్తరు."

"అయితే ఏవైనా పత్రికలకు పంపించినవా?" అని అడిగాను.

"అది రహస్యం. కలం పేర్లతో అప్పుడప్పుడు అచ్చవుతున్నయ్."

"అయితే ఇంకెన్నేండ్లు ఉందామనుకుంటున్నవ్?"

"ఈ ప్రపంచం రోజురోజుకు మారుతున్నది. జైల్లకెళ్ళి కోర్టులకు పోయివచ్చేటోళ్ళు రోజూ ఎన్నో విశేషాలు మోసుకొస్తరు. ఇక్కడ నాలుగు డైలీ పేపర్లువస్తయి. టీవి ఉన్నది. రేడియో ఉన్నది. బాత్రూంలు ఉన్నయి. లైబ్రరీ ఉన్నది. కావలసినన్ని నీళ్ళు ఉన్నయి. వాలీబాల్, కబడ్డీ, క్యారమ్స్, చెస్ మొదలైన ఎన్నో ఆటలు హాయిగా ఆడుకోవచ్చు, పొద్దున ఏడింటికే వేడి వేడి చాయ్ ఇస్తరు. తొమ్మిదిన్నరికే అన్నం పెడుతరు. మధ్యాహ్నం మూడింటికి మళ్ళీ చిక్కటి పాలతోటి చాయ్ ఇస్తరు. సాయంత్రం అయిదున్నరకు మళ్ళ భోజనం పెడ్తరు. ఆరు, ఆరున్నరకు బ్యారక్‌లకు పంపించి తాళం వేస్తరు. బ్యారక్ చిన్నగా సినిమా హాలంత ఉంటది. తెల్లారి ఆరింటకి తాళం తీస్తరు. అంటే పొద్దంతా విశాలమైదానంలో హాయిగా అందరం కలిసి ఉంటాం. వారానికోసారి మాంసం పెడ్తరు. బయట చూడాలనిపిస్తే ఏదో జ్వరం వచ్చిందని హాస్పిటలు కెళ్ళాలని లిస్టు రాయించుకోవాలె. వ్యాన్లో దవాఖానకు తీసుకుపోతరు. దవాఖానకు వస్తున్నానని ముందే కోర్టు పేషీలకు పోయేటోల్లతోటి అక్కడ కలిసినోల్లకు చెప్పుమని చెప్పాలె. ఒకరిద్దరన్న దవఖాన్ల కలుసుటానికి వస్తరు."

"అయితే నన్ను కూడ జైలుకు రమ్మంటవా?" నవ్వుతూ అడిగాను.

"రా ! బాగానే ఉంటది. అసలు నన్నడిగితే ప్రపంచమంతా ఒక జైలులాగా విశాల ప్రపంచంగా ఎదగాలె. ఇప్పుడు విశాలంగా ఉందనుకున్న మీ ప్రపంచం వ్యక్తి స్వార్థంతో కుటుంబ స్వార్థంతో తమకు తాము జైలు జీవితాన్ని జీవిస్తున్నారు. దానికి భిన్నంగా జైల్లో విశాల ప్రపంచం అందుబాటులో ఉంటుంది. అందుకే గాంధీ, నెహ్రూలే కాదు ప్రపంచంలోని గొప్ప పుస్తకాలు ఎన్నో జైల్లోనే రాయబడ్డాయి. బయటి ప్రపంచంలో అంత స్వేచ్ఛా, సమయం సాధ్యం కాదు కూడా. రష్యన్ రచయిత చెహోవ్ ఒక కథలో ఏమన్నాడో చెప్తాను. జైలు ఊచల్లోంచి మీకు నేను జైల్లో ఉన్నట్టు కనపడుతున్నాను. కాని ఈ ఊచల్లోంచి చూస్తే మీరే జైల్లో ఉన్నట్టు కనపడుతున్నది. నాకుకూడా మీరంతా జైల్లో ఉన్నట్టు కనపడుతున్నది."

అలా ఎన్నో విషయాలు చెప్తూనేపోయాడు. టైమైంది అంటూ పోలీసు



వచ్చి చెప్తూనే ఉన్నాడు. రవి అతనికి నమస్కారం పెడుతూ సంభాషణ కొనసాగిస్తూనే ఉన్నాడు.

"అయితే జైలంటే బయటి ప్రపంచం ఎందుకు ఇంత భయపడుతున్నది?" అని అడిగాను.

వేదాంతిలా నవ్వుతూ అన్నాడు రవి "చిన్నప్పుడు అగో పిల్లి అని తల్లులు పిల్లల్ని భయపెడ్తరు. కానీ, పిల్లి మనని ఏమీ చేయదు. పిల్లే మనను చూసి భయపడ్తది. కానీ, అమ్మలు భయపెట్టానికి గట్లనే చెప్తరు. జైలు గురించి కూడ గంతే. గట్ల భయపెట్టకపోతే అందరు జైలుకే వస్తనంటరు. ఎన్నో పోరాటాలు వేయడంవల్ల ప్రపంచంలో ఎందరో శాస్త్రవేత్తలు చెప్పడంవల్ల జైలు ఇంత ఆరోగ్యప్రదంగా అద్భుతంగా ఎదిగినయ్. అయితే, ఇది ఉద్యమకారులకే లాభిస్తున్నది. దొంగలు, క్రిమినల్స్ మొదలైనవాళ్ళను ఇంకా అట్లనే చూస్తున్నరు. నిజానికి వాళ్ళకే సంస్కరణల అవసరం ఎక్కువ."

"గాంధీజీ, నెహ్రూ, వల్లభాయ్ పటేల్ మొదలైన ఎందరో జాతీయ నాయకులు రాజకీయ ఖైదీలుగా జైళ్ళల్లో పుస్తకాలు రాసారంటరు. ఇకనుంచి అయా సమస్యల కోసం కొట్లాడే ప్రజలను లాఠీచార్జి చేస్తే. పరుగెత్తే బదులు టంగుటూరి ప్రకాశం పంతులు తీరు ఎదురు నిలవాలి. చంపుతరా చంపండి అని ఛాతీ చూపాలె. జైల్ భరో కార్యక్రమం ఇయ్యాలె అని అంటవ్."

"అవును అట్లా చేస్తే అద్భుతాలు సృష్టించవచ్చు. ఆమధ్య ప్రముఖ గాంధేయవాది, వాటర్‌షెడ్ పథకాలకు స్ఫూర్తిదాత అయిన అన్నాహజారే మహారాష్ట్ర మంత్రి మీద అవినీతి ఆరోపణలు చేస్తే ఆయన కేసు పెట్టాడు. కేసులో మంత్రికి అనుకూలంగా తీర్పు వచ్చింది. అన్నాహజారే జైలుకు పోతానన్నాడు గాని బెయిల్ పిటిషన్ వద్దన్నాడు. దాంతోని కేసువెట్టి జైలుకు పంపిన మహారాష్ట్ర మంత్రి మీదనే జనం విరుచుకపడ్డరు. మంత్రి కేసుల గెల్చిండు. కానీ, ప్రజలల్ల ఓడిపోయిండు. అన్నాహజారే నన్ను అరెస్టు చేయొద్దు అని మేధావుల, కళాకారుల, రచయితల, శాస్త్రవేత్తల సంతకాల సేకరణ చేయలేదు. అలా చేసి ఉండుంటే ఆ కొందరే స్పందించేవారు. ఆయన నేను జైలు కెళ్ళడమే ఇష్టపడతాను అని అనడం ద్వారా జైలు కెళ్ళడం ద్వారా ప్రజలందరూ అతనికి అనుకూలంగా ప్రభుత్వానికి వ్యతిరేకంగా చివరకు కోర్టుకు వ్యతిరేకంగా కూడా ముందుకు వచ్చారు. నైతిక బలం విజయం ఇది. విజయం

ఎప్పుడూ నైతిక బలంలోనే ఉంటుంది. జైలంటే భయపడ్డం పిరికితనానికి నిదర్శనం. పైగా అది ప్రభుత్వం ముందు నైతికంగా ఓడిపోవడం కదా! అందుకే జాతీయోద్యమ నాయకులు ఎవరు కూడా జైలంటే భయపడలేదు. అన్నాహజారేది అదే సాంప్రదాయం. నేను గాంధేయవాదిని కాక పోయినా ఆ సంకల్ప బలాన్ని, చిత్తుశుద్ధిని, ధైర్యాన్ని ఆదర్శంగా తీసుకున్నాను" అన్నాడు రవి.

జైలు పోలీసు మళ్ళీ హెచ్చరించడంతో సెలవు తీసుకున్నాను. రవి పేరిట జైల్లో కౌంటర్ వద్ద కొంత పైకం అందజేసాను.

జైలు బైటికి వచ్చేసరికి అంతకుముందు కనపడిన తల్లి, కోడలు ములాఖత్‌కు వెళ్ళి వచ్చినట్టున్నారు. కొడుకును చూసిన సంతోషంతో దుఃఖం దిగమింగుకుంటున్నారు. చింపిరి వెంట్రుకలు పాతబడిపోయిన ముదురు రంగు చీరలు చూడగానే పల్లెటూరి వాళ్ళు అని తెలిసి పోతుంది.

ఉదయం వాళ్ళ బతుకు గోస విన్నది ఇంకా చెవుల్లో గింగురుమంటున్నది. జైలు లాంటి జీవితమైనా వీళ్ళకందుతే ఎంత బాగుండేది? రెండు పూటలా అన్నం, రెండు పూటలా చాయ్, ఎన్నో ఆటపాటలు ఎవరో వచ్చి ఎప్పుడు ఏం చేస్తారో అనే భయం లేని జైలు జీవితం ఆ తల్లీ కోడళ్ళకు లభిస్తే ఎంత బాగుండేది అనిపించింది. ఈ విశాల విశ్వం ఆరుబయలు జైలు లాగా మారితే ఎంత బాగుండేది అనిపించింది. వాళ్లు కూడా అదే అనుకుంటున్నట్టున్నారు.

"వానికేందవ్వా ! యాల్లకు తినుకుంటమంచిగానే ఉన్నడు. మంచిగ పానం పట్టిండు. ఉన్న గోసంతా మాకే. ఏం పని చేసుకొని బతుకాలె. ఎట్లా బతుకాలె. వానల్లేవు, కూలి పనుల్లేవు. వకీళ్ళకు ఫీజు ఎట్లియ్యాలె? వీని పిలగాండ్లను ఎట్లా చదివియ్యాలె. పిలగాల్లను ఎవరు జీతం ఉంచుకుంటలేరు. ఏం బతుకో.....జైల్లనే నయం. ఏ రంధీ లేదు. మమ్మల్నందరినీ జైల్లేసినా మంచిగుండు" అంటూ చెప్తోంది.

వాళ్ళ మాటలు వింటుంటే అందరికీ భద్రత, మూడు పూటలా భోజనం మనిషి వికాసానికి తోడ్పడే విధంగా ప్రపంచమంతా జైలుగా మారితే ఎంత బాగుండు అనిపిస్తున్నది.

నేను అక్కణ్ణించి కదిలాను. ఇపుడు నాకు జైలంటే భయం లేదు. పైగా జైలు మీద ప్రేమ కలుగుతున్నది.

**– ఆదివారం వార్త,(దినపత్రిక) 8.5.2005**



# ఇంటల్లుడు

"ఇంటల్లుడు పెద్దకొడుకుతో సమానం. పెద్దకొడుకు తండ్రి తర్వాత తండ్రంత. నువ్వు పూనుకోకపోతే ఈ పెండ్లెట్లయితది" చిన్నమామ లక్ష్మిరాజం బతిమాలుతున్నాడు.

మిట్టపల్లి రవీంద్ర ఎంతకూ జడి తియ్యడంలేదు, తలూపడంలేదు.

రవీంద్ర కష్టపడి పైకొచ్చాడు. ఆయన పెద్దగా కూడబెట్టిందేమి లేదు. హైస్కూలు హెడ్మాష్టరు కూడా కాదు. స్కూల్ అసిస్టెంట్‌గా పనిచేస్తున్నాడు.

దానికే రవీంద్ర చాలా పైకొచ్చాడని అందరికి అతడే సాయం చేయాలని వాళ్ళ చుట్టాలు, పక్కాలు ఆశిస్తుంటారు. ఒక్క జీతంతో ఒక కుటుంబం పోషించడమే కష్టం. నాలు గయిదు కుటుంబాలు అతని నుండి ఆశించడంతో ఎవరికైనా ఎంతకని చేయగలడు. కోపంతో రెచ్చిపోయాడు.

"పదవ తరగతి దాకా ఇంట్లో వుంచుకొని చదివిస్తే బావమరిది శేఖర్

ఏమన్నడు? పనిమనిషి తీర్గ పనిచేయించి బుక్కెడు కూడు పెట్టిన్రు అని అనలేదా! సొంత తమ్ముడో, సొంత కొడుకో అయితే అట్ల అనేటోడేనా? ఏండ్ల తరబడి పెట్టిందంత ఒక్కమాటకిందికి దిగదుడుపాయె. అయితే మంచిమాటలు చెప్పెటోల్లే మంచోల్లు తియ్యి. చేసినకాడికి సాలు మామా! యింక ఎన్నేండ్లు చెయ్యాలె. నేను తెలుగులోకెల్లి సంస్కృతంలకు పోత. సంస్కృతంలనే మంచిగున్నది. "జామాతా దశమ గ్రహా" అని, శనిగ్రహం తొమ్మిదోదైతే అంతటి బంటు ఇంటల్లుడు పదోగ్రహం అని. నాకదే నయమనిపిస్తున్నది."

అందరూ నవ్వారు.

మిట్టపల్లి రవీంద్ర పెళ్లి అయినప్పుడు అత్తగారి కుటుంబం బాగానే వుండేది. చేనేత బట్టలు నేస్తూ రంగులద్దుతూ మామ సిలివేరు లింగం అందరితో కలుపుగోలుగా ఉండేవాడు.

కాలక్రమంలో గిరాకి లేక చేనేత మగ్గం మూలపడిపోయింది. పనిచేయడానికి ఏమీలేదు.

మామ సిలివేరు లింగం ఇంటిముందు చాయ్ హోటల్ పెట్టాడు. అదీ నడువలేదు. ఆయన ఏవో రోగాలతో చూపించే దిక్కులేక పోయాడు. ఆకలిచావు అనడానికి సాక్ష్యమేమీ లేదు.

"అట్లంటె ఎట్ల కొడుక. నువ్వు నిలవడితె ఈంత కార్యం ఒడ్డెక్కుతది." పెండ్లి పిల్ల అమ్మమ్మ లక్ష్మవ్వ రవీంద్ర చేతులు, గదువపట్టుకొని పునికింది. బతిమాలింది. కన్నీళ్ళు పెట్టుకున్నది.

"గా సంస్కృతం ఎవలకు తెలుస్తది బిడ్డ. మనిండ్లల్ల తెలుగే నడుస్తది. ఇంటల్లుడు పెద్దకొడుకుతో సమానం అన్నదే మాకెరుక గని నువ్వన్నదేందో మాకు తెల్వది కొడుక" అంది మామగారి చెల్లెలు... చిన్నమ్మ సరోజ.

"తెల్వదంటే ఎట్ల సిన్నీ. గా సంస్కృతం మంత్రాల్తోటే లగ్గాలు చెయ్యవడ్తిరి. బాపనాయెన లేకపోతే ఎట్లా అంటరు. గాల్లు జెప్పిందేమరి జామాత దశమగ్రహం అని! మరి గిదెందుకు వద్దంటరు?"

"ఏందో తియి. ఎనుకటియన్ని గిప్పుడు అనుకుంటే ఏమత్తది కొడుక. ద్రౌపదికి అయిదు మొగల్లు అని యిప్పుడెవలన్న చేసుకుంటున్ర? కుంతి మనిషికొకలను కన్నదని ఇపుడు సంతు కాలేదని ఎవలన్న మందితోటి



తిరుగుతున్ర. నువ్వు గట్ల తప్పిచ్చుకుంటే దీని పెండ్లెట్లయితది? యిది నీ బిడ్డ అసొంటిదగాద – నీ చెల్లెలసొంటిది గాద. నీకు ఇంకో చెల్లె ఉంటే నువ్వు లగ్గం చెయ్యవ! గట్లనే అనుకోరాదు కొడుక. గింత ఆకరి కార్యం ముంగటుండి చేస్తె పుణ్యం వత్తది. యాజ్జేసుకుంటరు."

"ఔనే అందరు యాజ్జేసుకుంటున్నరు. బామ్మర్ది – పండుగు పండుగుకు అక్కను బావను క్రమం తప్పకుంట పిల్చుకపోవట్టె" అన్నాడు రవీంద్ర వ్యంగ్యంగా.

"వాని పుటుక గూడ ఓ పుటుకేనా? గాని జోలే తియ్యాల్నా? వాడో కొడుకు – వాడో మనిషా? గంతగనం జేస్తివి. వానికి గింతంతనన్న యిది లేకపాయె" అమ్మమ్మ లక్ష్మవ్వ, అత్త రాజేశ్వరి అన్నారు ఒకేసారి.

"ఇగో అత్తా – ఏంజేసినా కొడుకు కొడుకే. ఎంతజేసినా అల్లుడు అల్లుడే. "అల్లుని మంచితనం... అని ఓ పద్యం ఉంది. అల్లుని మంచితనం లోకంల లేదని దాని అర్థం. నేను యింతజేసినా ఏమున్నది? ఒక్క మాటతోటి, ఒక్క సామెత తోటి కొట్టుకపాయె."

పద్మావతి తండ్రి సిలివేరు లింగం చనిపోయి చాలా కాలమైంది. ఇంటికి తొలి సంతానం పద్మావతి కావడంతో ఇంటికి పెద్దల్లుడైన రవీంద్రకు ఆ యింటి బాధ్యతలు కూడా మీద పడ్డాయి. పెద్ద బావమర్ది రాజేష్ భీవండిలో సాంచాలు నడిపించుకుంటూ బట్టకు పొట్టకు బతుకుతున్నాడు. చిన్న బావమర్ది శేఖర్ కూడా భీవండి పోవలసిందే. తమ్ముడు శేఖర్ చదువుకుంటానని ఏడుస్తుంటే పద్మావతి రవీంద్రని బతిమాలి తమ ఇంట్లోనే ఉంచుకుంది.

శేఖర్ చదువుకున్నంతదాకా చదివించారు. శేఖర్ టీచర్ ట్రైనింగ్ చేసాడు. అక్కడే నచ్చిన క్లాస్‌మేట్ అమ్మాయిని పెళ్లి చేసుకున్నాడు. ఆ పెళ్లికి తల్లి ఒప్పుకోకపోతే రవీంద్రే సముదాయించి ఏదో పెళ్లి అయిందనిపించారు. అంతే... ఆ తరువాత అటే ఏదో ఉద్యోగం అంటూ ఉండిపోయారు.

తల్లి ఇంటివద్దే ఉండిపోయింది. తల్లినీ, చెల్లినీ శేఖర్ రమ్మన్నది లేదు. వద్దన్నది లేదు. కోడలు కూడా ఏదో చిన్న ఉద్యోగం చేస్తున్నది. కోడలు వీరిని సైసదు. వీళ్లు పోరు.

"ఎట్ల వుట్టినయో గా సామెతలు నాకు తెల్వయి. అల్లుడా! నూటికొకలు అల్లుల్లు లంగలుంటరు. అంత కొడుకులకే చెందాలె అని పుట్టిన సామెతలియి.

ఏదో పండుక్కు చీరె తువ్వాలు కట్నాలు తప్ప లగ్గమైనంక బిడ్డకు అల్లునికి చెందేది ఏంలేకపాయె. అయినా అల్లుల్లమీద అపనిందలు. అవి పుట్టిచ్చినోని తలపండు వలుగ. కొడుకుల తీర్గ బిడ్డలకు గూడ సరిసమానంగ అన్ని పంచిస్తె ఏ లొల్లి వుండకపోవు. అంత కొడుకులకే చెందాలె. కొడుకులే మంచిగ బతుకాలె అనుకున్రి. ఆడిది ఆడిదే (అక్కడిదే) అనుకుంట కన్న తల్లిదండ్రులే సక్కగ సూడకపోయిరి. లగ్గమయ్యేదాక అరవ సాకిరి చేయించుకునిరి. లగ్గమైనంక అత్తగారింట్ల సాకిరి. ఆడిదాని బతుక్కు ఎన్నడు సుకమున్నది కొడుకా!"

అమ్మమ్మ లక్ష్మవ్వకు తన గతమంతా జ్ఞప్తికి వచ్చింది. - కన్నీళ్లు పెట్టుకుంది.

పిలగాడు మెచ్చిండు అని గ్రీన్‌సిగ్నల్ రావడంతో సంతోషంతో మొదలైన మాటముచ్చట యింటల్లుడు రవీంద్ర కేంద్రంగా ముగిసింది. పిలగానితో పెండ్లిచూపుల ఏర్పాటుకూడా తన యింట్లోనే చేయడంవల్ల ఎప్పటిలాగే అన్ని బాధ్యతలూ అల్లుడే తలకెత్తుకుంటాడనుకున్నారు. ఎప్పుడూ లేనిది అల్లుడు, పెద్దబిడ్డ ఈసారి చేతులెత్తేయడం వారికి ఆశ్చర్యం కలిగించింది.

పెండ్లిపిలగాని తరఫు పెద్దమనిషి ఫోన్‌చేసాడు. పిలగానికి పిల్ల నచ్చిందని లాంఛనాలు మీరు ఒప్పుకున్నకాడికి ఇస్తే ఈ ముహూర్తాల్లోనే పెళ్లి పెట్టుకోవచ్చని చెప్పాడు. రవీంద్ర సతీమణి పద్మావతి ఆ ఫోనందుకుంది.

మూడేళ్లుగా చూడగా చూడగా పద్మావతి చెల్లెలు సాధనకు ఇప్పటికి ఖాయమైంది. ఆ ఫోన్ రావడంతోనే పద్మావతికి చాలా సంతోషం కలిగింది. ఉత్సాహం పట్టలేక స్కూలు నుండి రవీంద్ర ఇంటికి వచ్చేసరికి బంధువులందరికీ ఫోనులో చెప్పేసింది. తెల్లవారి ఉదయం ఆదివారం గావటంతో అందరూ రవీంద్ర ఇంటికి చేరారు.

రవీంద్ర ఎంతో కష్టపడుతూ తమ్ముణ్ణీ, చెల్లెళ్నీ చదివించాడు. రవీంద్ర చెల్లెలు నవ్య టీచరుగా పనిచేస్తుంది. గత యేడాదే రవీంద్ర చెల్లెలి పెళ్లి చేసాడు. ఆడబిడ్డ పెళ్ళి కాకుండా తన చెల్లెలు పెళ్ళి గురించి అడిగితే బాగుండదని పద్మావతి ఊర్కొంది. ఆ పెళ్లి అప్పుకు ఎత్తిన చిట్‌ఫండ్ వాయిదా కిస్తులు ఇంకా రెండేళ్లదాకా కట్టాల్సి ఉంది. పద్మావతికి ఆ విషయం తెలుసు. అందుకే ఎటూ చెప్పలేకపోతున్నది.



ఇంతలోనే పద్మావతి చెల్లెలు సాధన పెళ్లి అనుకోకుండా కుదిరింది. మూడేండ్లు చూడగా, చూడగా సెటిల్ అయిన సంబంధం. పోతే మళ్లీ దొరకదు అని పద్మావతితో పాటు తల్లికి, అమ్మమ్మకి రంది పట్టుకుంది. అప్పైనా సరే అల్లుడికి తప్ప తమకు పుట్టదని వారికి తెలుసు. పెళ్ళయినాక ఎట్లో గట్లా అప్పు తీర్చుకోవచ్చు. పెండ్లి ఎత్తిపోతే మళ్ళీ దొరకడం కష్టం అని వారి బాధ.

రవీంద్ర చెల్లెలు నవ్య కన్నా మరదలు సాధన యేడాది చిన్నది. సాధన చదువు ఆర్థికంగా లేక మధ్యలోనే ఆగిపోయింది. రవీంద్ర సాధననీ చదివించాలనుకున్నాడు. కానీ వాళ్లత్త, చిన్నోడు శేఖర్ ఏదో ఒక దార్లో పడాలని బలవంతంగా రవీంద్రకు బాధ్యతను అంటగట్టారు. రవీంద్ర మామ పోయేనాటికి ఎనిమిదో తరగతి చదువుతున్న శేఖర్ అక్కపంచన చేరాడు.

సాధన కూడా ఇంటర్ పాసైంది. ప్రైవేటు స్కూల్లో టీచర్‌గా పనిచేస్తున్నది. నెలకు ఆరొందల జీతం. బీడీలు చేస్తే యింతకన్నా ఎక్కువే వస్తాయి. కాని టీచరమ్మ అన్పించుకోవాలని ఆరాటం. ఆ ఆరాటంతో జీతంలో సగం పైసలు చీరెలకూ, వాటి యిస్త్రీకే ఖర్చయిపోతున్నాయి.

పద్మావతికి రవీంద్రకు తమ సంసారం గురించి కూడా పట్టించుకోవడం అవసరం అని ఈ మధ్యనే అనుభవానికి వచ్చింది. అందుకే వాళ్లు అందరు మంచి మాటల్తో పని తీసికొనేవారే గానీ వీళ్ళంతా తలాయింత సాయం చేయవచ్చుగదా అని లోలోపల బాధ....

ఆ బాధను మాటల సందర్భంలో పద్మావతి అననే అంది.

"గింతమంది గల్సి మా ఆయినెను బరువెత్తుకోమంటున్రు. మీరందరు మనిషికో చెయ్యేస్తె ఏందే చిన్నాయిన్నా" అంటూ మొదలుపెట్టింది.

ఆ మాట విని అందరు నిశ్శబ్దమైపోయారు. మాటలు ఎవరైనా చెబుతారు. అల్లుడు కాకుండా కూతురే ఎదురుతిరిగేసరికి ఎవరికీ నోట మాట రాలేదు. పద్మావతి చిట్టిచెల్లెలు పెండ్లిపిల్ల సాధన అక్కవైపు బాధగా చూసింది. తల్లి కన్నా ఎక్కువ ప్రేమించే పెద్దక్కేనా యిలా అంటున్నదని కళ్ళల్లోకి నీరుబికింది.

అది గమనించి చెల్లెల్ని దగ్గరికి తీసుకున్నది. పద్మావతి భుజంమ్మీద చేయివేసింది. నేనున్నాను ఏడ్వకే అనే అభయహస్తం యిచ్చినట్టుగా ఉంది. సాధన కళ్లల్లోంచి ఎందుకో, రెండు కన్నీటిబొట్లు జలజలా రాలాయి.

"పెండ్లి అంటే అందరు సంతోషంగుంటరు. ఇది ఏడుస్తున్నది. మీరు అందరు మనిషికింత సగవెడ్తె ఎంతలైతది? అన్ని అల్లున్నే బరువు మోయిమనుడు ఎట్ల? రెండు తులాల పుస్తెలతాడు నీ వంతుకు చేయించే చిన్నాయిన్నా" అంది పెద్దకూతురు పద్మావతి.

ఆ మాటతో చర్చ మలుపుతిరిగింది. ఎదుటివారికి ఎన్ని పనులైనా చెప్పొచ్చు. నోరే గదా. ఇప్పుడు ఆ నోరు మూతవడ్డది. చేతల్లో మనస్సుతో చేసే ఆర్థికసాయం గురించి ఎవరి స్వార్థం. గూట్లోకి వాళ్ళు తాబేలుగా ముడుచుకుపోయారు. తల కాస్త బయటపెట్టి మాట తగ్గించారు.

"మా దగ్గరేముంది అమ్ముకునుటానికి పెళ్ళినాటి ఇత్తెడి బిందె తాంబూలం గూడా లేవు. సత్తు గిన్నెలు, స్టీలు గ్లాసులు తప్ప మా ఇంట్ల ఏమున్నయే. కరెంటు బిల్లుకు పైసలు లేక మూడు నెలల్నించి చీకట్లనే వుండవడితిమి."

అలా ఒక్కొక్కరు తమ బాధలు, అప్పులు చెప్పుకొచ్చారు. వాతావరణం విషాదమై పోయింది. ముప్పై ఏళ్ళలో తాము ఒక దశ నుంచి క్రమంగా ఎలా ఆర్థికంగా చితికిపోయారో గుర్తు చేసుకున్నారు. వెనుకటి కాలమే మంచిగుండె ఇంత గంజి నీళ్ళు, అంబలి అయినా దొరుకుతుండె. ఇప్పుడు అంతకన్నా ఎక్కువ కష్టమైపోయే. చేసుటానికి ఏం పనిలేకపోయె. ఏదన్నా దందా చేస్తే నడవకపాయె అంటూ కన్నీరు పెట్టుకున్నారు.

రవీంద్రకు కూడా ఇలా ఎందుకు జరిగిందో పూర్తిగా అర్థం కావడం లేదు. పరిశ్రమలు పెరిగి చేతి వృత్తులు , కుల వృత్తులు మూల పడ్డాయి. అవి గిట్టుబాటు కాకుండా పోయాయి. ముడి సరుకుల ధరలు పెరిగాయి. గ్లోబలైజేషన్‌తో, కరువులతో జీవితాలు కుదించుకుపోయాయి.

అంగట్లో అన్నీ వున్నాయి. జేబులో డబ్బులు ఉండవు. చేయడానికి పని ఉండదు. ఉన్న ఫ్యాక్టరీలను వాలంటరీ రిటైర్‌మెంట్ స్కీం కింద కార్మికులను పంపించేసి మూసి వేస్తున్నారు. ప్యాక్టరీల స్థలాన్ని ఇళ్ళ స్థలాల కోసం అమ్మేసి కోట్లు సంపాదిస్తున్నారు. సామాన్యుల బతుకు ఇలా ఎందుకయిపోతున్నది. రైతులు కూడా ట్రాక్టర్లను, ప్రొక్రెయినర్‌లను కిరాయికి తీసుకుని వ్యవసాయం నడుపుకొంటున్నారు. కూలీలకు ఏ పని దొరకడం లేదు.

బావులు తవ్వడంపోయి బోరింగులు వేయడం వచ్చింది. చేనేత నూలు బట్టలు పోయి మిల్లు బట్టలు వచ్చాయి. మాదిగ చెప్పులు పోయి కంపెనీ చెప్పులు వచ్చాయి. ఎడ్లబండ్లు పోయి ఆటోలు, లారీలు, బస్సులు వచ్చాయి. ఇక పల్లెటూరి పాతకాలపు మనుషులు ఏం పని చేసుకుని బతకాలి. ఇవన్నీ గుర్తు చేసుకుని నిస్సహాయంగా ఏడ్చారు. ఇలా ఎందుకు జరుగుతున్నదో మిట్టపల్లి రవీంద్ర తనకు తెలిసిన మేరకు వాళ్ళను సముదాయించాడు.

"గిన్ని తెలిసిన నువ్వు ముంగట పడకపోతే ఎట్ల?" అంటూ నీవే దిక్కన్నట్లు దండాలు పెట్టారు అందరూ.

మొత్తానికి తమకున్నంతలో తలా ఇంత పెట్టడానికి, అప్పు తెచ్చి అయినా సాయం చేయడానికి అంగీకరించారు. రవీంద్ర పెళ్ళి బరువు ఎత్తుకోక తప్పలేదు.

ఉన్నంతలో పెళ్ళి ఏర్పాట్లు చేశారు. ముంబాయి నుండి రవీంద్ర పెద్ద బావమరిది రాజేశ్ భార్యా పిల్లలతో సహా నాల్రోజుల ముందే దిగాడు.

చిన్న బావమరిది శేఖర్ రెండ్రోజుల ముందు వచ్చాడు. రెండు తులాల పుస్తెల తాడుకు, మంచం పరుపు బట్టలకు డబ్బులు ఇచ్చాడు.

పెళ్ళి జరిగిపోయింది. మూడవ రోజు వియ్యపురాళ్ళ వైనం పండగ కూడా అయిపోయింది. అందరూ పెద్ద కార్యం ఒడ్డెక్కిందని ఊపిరి పీల్చారు. రవీంద్రకు మాత్రం ఇన్ని బాకీలు ఎలా కట్టాలో తోచలేదు. మనసంతా బరువైపోయింది. పద్మావతికి చెల్లి పెళ్ళి అయ్యిందన్న సంబరం తీరిపోయి బాకీలు ఎలా తీర్చాలో అనే రంది పట్టుకుంది.

నాల్గవ రోజు బంధుమిత్రులందరూ వెళ్ళిపోయారు. పెద్ద బావమరిది రాజేశ్ మాత్రం భార్య పిల్లలతో అలాగే ఉండి పోయాడు. వారం రోజుల తర్వాత పెద్ద బావమరిది చిన్న చెల్లె పెళ్లి చేసినందుకు అక్కా, బావలకు కట్నాలు తెచ్చామని వారిని చాపలో పీట వేసి కూచోపెట్టి బొట్లు పెట్టి బట్టలు ఒడిలో పెట్టి కాళ్ళు పట్టుకున్నారు. రవీంద్ర, పద్మావతిలు అన్నయ్య అన్ని కష్టాల్లో కూడా ఆడపడచు కట్నం పెట్టడం సంతోషమనిపించింది.

మరో రెండ్రోజులకు పెద్ద బావమరిది రాజేష్ రవీంద్ర బావ రెండూ చేతులు పట్టుకున్నాడు.

"బావా నీకు దండం పెడతా. మీ కాళ్ళు ఎన్ని సార్లు పట్టుకున్నా తప్పులేదు. మా పెద్దోడ్ని మీరే సదివిపియ్యాలె. మీ ఇంట్ల వుంచుకోండ్రి.

అక్కడ భీవండిల మంచిగ చదువు చెప్తలేరు. ఏగి అయితున్నడు. నాకు కూడా అక్కడ వుండబుద్ధయితలేదు. వచ్చే ఏటికి నేను కూడా ఈ దేశమే వస్త. ఏదన్నా చికెన్ సెంటర్ కోడిగుడ్ల దుకాణం పెట్టుకునుటానికి నువ్వే ఏన్నన్న అప్పు ఇప్పియాలె." అంటూ తన దీనస్థితిని, ఆరోగ్య స్థితిని చెప్పుకుంటూ కన్నీళ్ళు పెట్టుకున్నాడు రాజేష్.

రవీంద్రకు మనసు ఏదోలా అయింది. అవ్వన్నీ వింటుంటే జాలేసింది. కానీ ఇప్పటికే బరువెక్కువయిపోయింది. ఈ సంసారం ఈదటం ఎలాగో తోచడం లేదు. కడుపులో ఎంత కనికరం ఉన్నా మాట కఠినంగా మాట్లాడక తప్పలేదు. దాంతో రాజేష్ ఒక రకమైన ఆర్తి మరో రకమైన హక్కుతో నిలదీశాడు.

"అవును బావా! తమ్మునికి చేసినవు. చెల్లెకి చేసినవు. నీ సొమ్ము నాకు ఏం చెందింది? నా తమ్ముని చదవించినవు. చెల్లెల్ని చదవించినవు. నాకే సాయం చేయలేదు. కనీసం నా కొడుకునన్నా చదివియ్యవా! మా బతుకు ఇట్లనే కాలిపోని." అని తువ్వాలు దులుపుకుని కన్నీళ్ళు పెట్టుకుని లేచిపోయాడు.

రాజేష్ బావమరిది పిల్లలను తీసుకుని రెండ్రోజులు ఎవరెవరి ఇంటికో చుట్టంగా వెళ్ళాడు. అన్న అంత బాధపడడం చూసిన పద్మావతి "అవును మా అన్నకేం దక్కింది. వాన్ని ఇంకో కొడుకు అనుకొని సాదుదాం. వాడొక్కడు చదువుకుంటే ఇల్లు నిలవడుతది." అంటూ కన్నీళ్ళు పెట్టుకుని భర్తను బతిమాలింది.

రవీంద్రకు సాయం చేయాలనే ఉంది. కానీ స్తోమత లేదు. అయినా అంగీకరించక తప్పలేదు. పదహారవ రోజు పెళ్ళి పండుగనాడు పెద్ద బావమరిది భార్యా పిల్లలను తీసుకుని వచ్చాడు. పండుగ అయిన తర్వాత మరుసటి రోజు కొడుకును అక్కడే వుంచి భీవండీకీ బయల్దేరారు.

"పెట్టిన చెయ్యి ఊరికే ఉండది. నా బిడ్డ అన్నపూర్ణ" అంటూ మురిసిపోయింది పద్మావతి తల్లి.

**'ఆదివారం ఆంధ్రజ్యోతి' దినపత్రిక, 5-6-2005**



# జీవన యానం

"ప్రఖ్యాత ఫ్రెంచి సామాజిక అర్థ శాస్త్రవేత్త ప్రసంగం వినాలని విక్రాంత్ పట్టుపట్టి ఎంతో మేలు చేశాడు. అమర్త్య సేన్ సంక్షేమ అర్థశాస్త్రం కన్నా క్యాపిటల్ – సోషల్ ఎకానమీ (పెట్టుబడి – సామాజిక అర్థశాస్త్రం) ఎంతో సమగ్రంగా ఉందనిపిస్తోంది. ఇది సోషలిస్టు దృక్పథానికి దగ్గరగా ఉందనిపిస్తోంది.'' అంది ఉస్మానియా మెడికల్ కాలేజీలో మెడిసిన్ చదువుతున్న రాధ అరవింద్‌కేసి చూస్తూ.

అరవింద్ ఆరాధనగా రాధకేసి చూస్తూ నవ్వాడు. రాధను కల్సుకోవడానికి ఇదొక మంచి ప్రదేశం అని బషీర్‌బాగ్ ప్రెస్‌క్లబ్ బయల్దేరదీసింది అరవిందే. నీ వెంట నేనూ వస్తా అని లత వెంటపడితే ఎలాగోలా తప్పించుకున్నాడు అరవింద్. ఆమె తనను లైక్ చేస్తోందని తెల్సు, కాని అరవింద్ రాధను లైక్‌చేస్తాడు.

''నిన్న ఉస్మానియా క్యాంపస్ సెమినార్‌లో మాట్లాడింది అద్భుతంగా

ఉందనే కదా యివాళ మిమ్మల్ని తప్పక రమ్మన్నది" అంటూ వాచీకేసి చూశాడు విక్రాంత్.

సాయంత్రం నాలుగున్నరవుతోంది. కొందరు గుంపులుగా చేరి ప్రసంగం గూర్చి చర్చించుకుంటున్నారు. ఒక గుంపులో లత కనపడి గతుక్కుమన్నాడు అరవింద్. విక్రాంత్ అటుకేసి చూశాడు. ఆమె అరవింద్ కేసి కోపంగా చూడ్డం ఎందుకో విక్రాంత్‌కు అర్థంకాలేదు.

ఫస్టుఫ్లోర్ మెట్లు దిగుతూ టైటానిక్ మరోసారి చూద్దామా అంది రాధ అరవింద్‌కేసి అదోలా చూస్తూ. అక్కడే ఏకాంతం లభిస్తుందని ఆమె ఉద్దేశం.

"మీరెళ్ళండి. నాకు పని ఉంది." అంటూ విక్రాంత్ వారి మధ్య తానెందు కన్నట్టు తప్పించుకో చూశాడు. ఆ మాటతో రాధ ముఖం వికసించింది.

విక్రాంత్‌కు యిలాంటివి గిట్టవు. ఆ స్తోమతాలేదు. తండ్రి లేడు, తల్లీ చెల్లె సావిత్రి బీడీలు చేస్తూ చదివిస్తే క్యాంపస్ దాకా వచ్చిన వాడు. అన్నయ్య ఎదిగి మంచి సంబంధం చూసి తన పెళ్ళి చేస్తాడని చెల్లెలి ఆశ.

"సిన్మాకు రాకపోయినా కనీసం తందూర్ రోటీ తినేదాకా కంపెనీ యివ్వాలి. మీ చెల్లెలంత కాకపోయినా ఈ చెల్లెలూ ప్రేమతో నీకు కాస్త గోరుముద్దలు తినిపిద్దామని" నవ్వుతూ అంది రాధ. సరేనంటూ ముగ్గురు మెట్లుదిగి హోటల్‌కి నడిచారు.

టైటానిక్ సిన్మా చూసి అరవింద్ హాస్టల్ రూం చేరేసరికి ఇంటినుంచి వచ్చిన ఉత్తరం మంచంపై పడి ఉంది. రూమ్మేటు దాన్ని అక్కడ ఉంచినట్టున్నాడు. చింపి చదివాడు.

ఇంటర్ ఫేలై బట్టల షాపులో జీతం ఉన్న తమ్ముడు ఆనంద్ రాసిన ఉత్తరం. నాన్నకు ఆరోగ్యం బాగాలేదని వెంటనే బయల్దేరి రమ్మని ఉత్తరం సారాంశం. కనీసం ఇన్‌లాండ్ లెటరైనా రాయండి – కార్డులు రాస్తే అందరూ చదువుతారు బాగుండదని చెప్పిన్నించి తమ్ముడు ఇన్‌లాండ్ లెటర్లే రాస్తున్నాడు.

టైటానిక్ సినిమా చూస్తూ తాను, రాధ కళ్ళతో హృదయాలు కలుపుకున్న ఉత్తేజం, చేతుల్లో వేళ్ళు బిగించి కాళ్ళతో. కాళ్ళు తాకించి అనుభవించిన స్పర్శా సుఖం, కన్నకలలపై ఆ ఉత్తరం నీళ్ళు చల్లినట్టయింది. రాధను పెళ్ళి చేసుకొన్నాక గడుపబోయే మధురమైన జీవితం గురించిన ఊహలకు అడ్డుకట్టపడింది.

పదిరోజుల క్రితం రాసిన ఉత్తరంలో అందరూ బాగున్నారని రాశారు.



ఇంతలోనే ఏమిటా అని ఆందోళనపడ్డాడు అరవింద్.

టైం చూసుకున్నాడు రాత్రి తొమ్మిదిన్నరవుతోంది. రాత్రి ఒంటి గంటదాకా జగిత్యాలకు బస్సులున్నాయి.

తొందరేంలేదు అనుకుని మొస్సుకే దారి తీశాడు.

భోజనం అయ్యాక ఒక డ్రెస్సు బ్యాగులో పడేసుకుని రూమ్మేటుకు చెప్పి బయలుదేరాడు.

ఇమ్లీబన్ బస్టేషన్లో రడీగా ఉన్న బస్సెక్కాడు అరవింద్.

కిటికీ పక్కన సీటు దొరికింది.

ఈసారి రాధ విషయం నాన్నకు చెప్పాలి అనుకున్నాడు అరవింద్.



"మూడు రోజుల్నుంచి మల్లా ఛాతీనొప్పి ఒకటే దగ్గు, మగ్గం నేసుడు సాత్తనైత లేదు. అప్పు పెరుగవట్టె" అంటూ అరవింద్ నాన్న చంద్రయ్య మరోసారి దగ్గాడు.

"ఉస్మానియాలో కొద్ది రోజులు యిన్‌పేషంటుగా ఉండునాన్న అంటే నాకేమైంది అంటావు. అన్నీ నేను చూసుకుంటా ఈసారి పోదాం నాన్నా."

"శాతగాకుంటైతే–దావుకాన్లు ఏం చేస్తయిరా, ఏం రోగం లేదని నువ్వే అంటివి" అన్నాడు చంద్రయ్య.

పోషకాహారలోపమే పేద దేశాల్లో అన్నిటికన్నా పెద్ద జబ్బు. అన్న ఫ్రెంచి సామాజిక అర్థశాస్త్రవేత్త మాట గుర్తొచ్చి తను పేదరికం గురించి, కుటుంబ స్థితిగతుల గూర్చి ఆలోచనలో పడ్డాడు అరవింద్.

"నారాయణన్న నువ్వస్తే ఓసారి వచ్చి నిన్ను కలుస్తానన్నడు. నాన్నను చూసుటానికి నిన్న వచ్చినప్పుడు చెప్పిండు." అంది తల్లి దేవక్క.

"నేనే కల్సి వస్తనే" అన్నాడు అరవింద్.

చిన్నప్పట్నించి నారాయణసేటు అనిపిలిచిన అమ్మ అతన్ని కొంతకాలంగా నారాయణన్న అనడం గమనిస్తున్నాడు అరవింద్. నారాయణ సేటు బిడ్డ నిర్మల జగిత్యాల్లో బి.ఎస్సీ చదువుతోంది. మెడిసిన్‌లో అరవింద్‌కు సీటు వచ్చిన్నుంచి నారాయణ ప్రవర్తనలో మార్పు వస్తోంది. అతని కూతుర్ని అరవింద్‌కివ్వాలని ఆశ.

"పది లక్షలు యిస్తడు. పిల్ల ఎంతో చక్కదనంగా ఉన్నది. డాక్టరు పిల్లనే

చేసుకుంటే ఏం సుఖంరా ఎపుడూ పనే. ఈ పిల్లను చేసుకుంటే ఇంటిపట్టున ఉంటది" అంది తల్లి దేవక్క.

నారాయణ సేటును అరవింద్ చిన్నప్పట్నించీ ఎరుగును.

నారాయణ పెద్దసేటు. నూలు, బట్టలు, రంగుల వ్యాపారం. మొదట్లో అతడు చేనేత సహకార సంఘంలో బాగా పనిచేశాడు.

సబ్సిడీ మీద వచ్చిన నూలును బ్లాకులో అమ్ముకొని బంగ్లాలు కట్టాడని, సంఘాన్ని ముంచాడని చాలా మంది అతని వెనక విమర్శిస్తుంటారు. చాలా కాలం కులసంఘం కోసం అతను ఎంతో చేశాడని పెద్దవాళ్ళు అంటుంటారు. అరవింద్‌కు అవి నమ్మబుద్ధికాదు.

నారాయణ సేటు తండ్రి కూడా బట్టలు నేసి పులిసిన అంబలి జుర్రి బతికినవాడే. సంఘాన్ని ముంచకపోతే నారాయణ సేటు బంగ్లా ఎట్లా కట్టాడు. ఎట్లా పెరిగాడు. అతడు కులసంఘంలో నాయకుడుగా ఉన్నది తన పెద్దరికం కోసమే కాకుండా, తనకు వ్యతిరేకంగా విమర్శించేవాళ్ళు సంఘంలో ఎదగకుండా చేయడం కోసం తప్ప సంఘానికి సేవ చేయాలనే ఉద్దేశ్యం అతనికేమాత్రమూ లేదు అని అరవింద్ అభిప్రాయం.

అరవింద్‌కు బుద్ధి తెల్సేనాటికి నారాయణ సామాజికంగా నిర్వహించే ప్రగతిశీల పాత్ర ముగిసిపోయింది. వ్యక్తిగత స్వార్థంకోసం యువ నాయకత్వాన్ని ఎదగకుండా చేస్తున్న వాడిగానే అరవింద్‌కు తెల్సు. సంస్థ నడిస్తే అతని పెద్దరికానికి ముప్పు. అందుకని ఏ సంస్థనైనా నడవకుండా చేయడం, ఎంత ఉత్సాహవంతుడైన యువకుడినైనా నీరుగార్చడం, నీచంగా మాట్లాడం అతని పని. పైగా పెద్ద సేటు అని అతనికి పేరు.

అరవింద్ నాన్న తన చదువు గురించి చెప్పి అప్పు అడిగితే నారాయణ సేటు ఏమన్నాడో బాగా గుర్తుంది. హైదరాబాద్‌లోని పద్మశాలి హాస్టల్‌లో సీటు యిప్పించమని బతిమాలితే తనను చూసిన చూపు ఇంకా వెంటాడుతోంది. అంత సిరివచ్చిందా నీకు అని ఒక దుర్మార్గుడైన భూస్వామి చూసే చూపు అది.

"చంద్రయ్యా! పిల్లగాన్లు ఏదడిగితే అది నీతోని ఎట్లయితది, వాల్లు తెల్సీ తెల్వక ఎన్నో కోరుతారు. పద్మశాలి హాస్టల్లో సీటంటే మాటలు కాదు. అది ఉత్తగరాదు. దానికి పెద్ద తతంగం ఉన్నది. నీ కొడుకు అసోంటోల్లు ఎంత మంది. ఎంసెట్ కోచింగ్‌కు అప్పు చేస్తే సీటు రాకపోతే ముప్పయి వేలు మీద



పడుతై గద. మంచం ఉన్నంతల కాళ్ళు చాపాలె. ఇంటర్ ఫస్ట్ క్లాసుల పాసైనోనికి టీటీసిల సీటురాదా! టీచర్ ట్రైనింగ్ చేస్తే తర్వాత బి.ఎస్సీ, ఎమ్మెస్సీ, పిహెచ్.డి చేసి లెక్చరర్ కావచ్చు. ముందు తన కాళ్ళ మీద నిలబడే ఆధారం దొరకనీ. గీ బట్టలు నేసుకుంట డాక్టరు కోర్సు సదివించుడు నీతోటి ఎట్లయితది."

ఆ మాటతో అరవింద్‌కు చాలా కష్టం వేసింది. నిర్మలతోని సంబంధం ఖాయం చేసుకుంటే నేనే పెట్టుబడి పెట్టి చదివిస్త. నిర్మలను చేసుకోకపోతే పెట్టిన పెట్టుబడి బ్యాంకు వడ్డీతోని చెల్లుగట్టాలె. డాక్టరు సీటువస్తే తప్పక నిర్మలను చేసికోవాలె మరి. ఏమంటావు అరవింద్? అని తనను నారాయణ సేటు అల్లున్ని చేసికొని ప్రోత్సహిస్తాడనుకున్నాడు అరవింద్.

నారాయణ సేటుకా ఉద్దేశం లేదని తెల్సిపోయింది.

తాను పేరుకు బి.ఎస్సీలో జాయినై బట్టలు నేస్తూ యింటివద్దే ఏడాదంతా ఎంసెట్‌కు చదువుకున్నాడు. అయినా మూడువేల రూపాయల దాకా నారాయణ సేటు దగ్గర అప్పుచేయాల్సి వచ్చింది.

ఎంసెట్లో ర్యాంకు వచ్చాక నారాయణ సేటు తీరు మారింది. అరవింద్ తండ్రిని మర్యాద చేస్తున్నాడు. దేవక్కా తానూ అక్కా చెల్లెల్ల పిల్లలమే అనే బంధుత్వం గుర్తు చేస్తున్నాడు. రసీదు టికెట్ అయినా లేకుండా సాదా కాగితం మీద రాయించుకొని ఎంతంటే అంత అప్పులిస్తున్నాడు.

అదంతా కాబోయే అల్లుని కోసం పెడ్తున్న పెట్టుబడి అని మనస్సులో మొదట్నుంచీ ఉందేమో అని క్రితం రోజు ప్రెస్‌క్లబ్‌లో విన్నాక అరవింద్‌కు యిపుడనిపిస్తోంది.

తనని దాష్టీకంగా రమ్మని పిలిపించుకునే వాడు ఇపుడు తానే వచ్చి కలుస్తాననడం – నాన్న ఆరోగ్యం గురించి పరామర్శించి వెళ్ళడం వెనక యిదంతా ఉందనిపిస్తోంది.

నారాయణ సేటు కూతురు నిర్మల సౌమ్యంగా అందంగానే ఉంటుంది. కాని ఆ పిల్ల కష్టం ఎరగకుండా పెరిగింది. ఆమెకు పేదరికం అంటే ఒక రకమైన ఏవగింపు కూడా.

నూలు కోసం, అప్పు కోసం తానూ నాన్నా వెళ్ళినపుడు వీళ్ళు కూడా తమకులం వాళ్ళే అనే దృష్టితో ఆమె ఎన్నడూ చూడలేదు.

అరవింద్ తనకు వరసకు మేనబావ అవుతాడనే విషయాన్ని కలలో

కూడా నిర్మల సహించలేదు. నాన్న చేతి కింద, తమ చేతికింద పనిచేసే పనిమనుషులు, కూలీవాళ్ళు అన్నట్లుగా చూసేది నిర్మల.

ఇపుడు నిర్మల మారింది. కానీ అరవింద్ మరవలేదు. అరవింద్‌కు ఇప్పటికీ వాళ్ళ యింట్లో ఉన్నంత సేపు ఏదో బెరుకు స్వేచ్ఛ కోల్పోయిన పీలింగ్.

"ఆల్లబిడ్డ నిర్మల సంబంధం గురించి అడుగుతడు కావచ్చు. ఏమని చెప్తవురా" అంటూ తల్లి దేవక్క సరిగ్గానే చెప్పానా అన్నట్టు పెనిమిటికేసి చూసింది.

అనారోగ్యం మిషతో రమ్మన్నది యిందుకేనా అని అనుమాన మొచ్చింది అరవింద్‌కు. అమ్మానాన్నలు బాకీ కింద తనను నారాయణసేటుకు అమ్మేయదల్చుకున్నారా.

బాకీ పెట్టుబడి, జీవితాభివృద్ధి కోసం పెట్టుబడి రెండూ వేరువేరు సామాజిక సంబంధాలను పరిణామాలను సృష్టిస్తాయంటాడు ఫ్రెంచి శాస్త్రవేత్త. అమెరికా ప్రపంచబ్యాంకు యిచ్చే పెట్టుబడులన్నీ బాకీ పెట్టుబడులే తప్ప నిజమైన సామాజికాభివృద్ధి పెట్టుబడి క్రమాలకు సంబంధించినవి కావు. ఆధిపత్యం స్వప్రయోజనమే వాటి అంతిమ లక్ష్యం అన్న అతని మాటలను నారాయణ సేటుకు అన్వయిస్తూ ఆలోచిస్తున్నాడు అరవింద్.

"నేనా విషయం ఆలోచించలేదే, నారాయణ సేట్‌తోని అదేమాట చెప్త. మరి మీ ఆలోచన ఎట్లున్నదే?"

రాధ విషయం ఇప్పుడే చెప్పేద్దామనే తాపత్రయంతో అరవింద్ అడిగాడు. దేవక్క పెనిమిటికేసి చూసింది.

"మన కండ్ల ముంగట పెరిగిన పిల్ల. చేసుకుంటే మంచిగనే ఉంటది" అన్నాడు చంద్రయ్య.

"మంది కొంపలు ముంచి పైకి వచ్చిండు అని ఎన్నోసార్లతిట్టివి. వాని కొంపకూల. వాని చేతులకు కుష్టువ్యాధి రాను అని ఇన్నేండ్లు తిట్టితిట్టి ఇపుడు గిట్లనవడితివెమ్మె నాయినా!" నవ్వుతూ అన్నాడు అరవింద్.

"గిట్ల చేతి కష్టం చేసినోల్లు ఎవలుపైకి వచ్చిన్రుర. ఆ పిల్లను చేసుకుంటే మన అప్పుతీరుతది. నువ్వు ఈ ఊర్లెనే ప్రాక్టీసు పెట్టుకోవచ్చు. శ్రీనివాస్ టాకీసు వెనక కట్టిన బంగ్లా కూడా మీకే యిచ్చేస్తనన్నడు." ఎంతో గొప్ప సంబంధం అన్నట్టు గర్వంగా అన్నాడు తండ్రి చంద్రయ్య.

అరవింద్‌కు అదేమంత గొప్ప సంబంధం అనిపించినట్లు లేదు. వాళ్ళ



ప్రవర్తన గుర్తువచ్చి కోపం వచ్చింది.

"అంటే వాళ్ళ పెద్ద కొడుకుతోని మెడికల్ షాపు వాళ్లే నడుపుకుంటారన్న మాట. నేను యిల్లరికం అల్లునితీరో, జీతంలేని డాక్టరు తీరో వాళ్ళ ఉచ్చులో బతకాలన్న మాట" అరవింద్ నోటిదాకా వచ్చి ఆగిపోయాడు.

"నాన్నా! ఏదైనా పి.జి చేసినంక పెళ్ళి చేసుకుంటే మంచిగుంటది. రా..." అంటూ అరవింద్ రాధ గురించి చెప్పబోయేంతలో అందుకున్నాడు తండ్రి.

"దానిదేముంది. పెళ్ళి ఖాయం చేసుకున్నంక అట్లైనే సదువుకోనీ ఇద్దరికి సరిపడా నేనేపంపిస్త. ప్రాక్టీసు పెట్టేదాక అని అన్నడుర."

"ఈ బుద్ధి ఎంసెట్ కోచింగ్‌కు పోతానని అడిగినపుడెటు పోయిందే. రాధ అని ఓ అమ్మాయి ఉంది. ఇంతకంటే మంచి గుంటది. వాళ్ళ నాన్న పెద్ద ఆఫీసరు, నారాయణసేటుకన్న ఎక్కువే యిస్తడు, అమ్మాయి నాతోటే డాక్టరు కోర్సు చేస్తున్నది." అని ఇంకా పెద్ద సంబంధం అన్నట్టు ఎంతో ఉత్సాహంగా చెప్పుకొచ్చాడు అరవింద్.

చంద్రయ్యకు సంతోషం కలిగింది. కాని తమ ఊళ్లో సంబంధం ద్వారా పెరిగే ప్రతిష్ట గొప్పది. అది దూరపు సంబంధంతో ఎలా వస్తుంది అని ఆలోచనలో పడ్డాడు. తల్లి సరిగ్గా అదేమాట అంది.

"ఎక్కడిదో దూరపు సంబంధం ఎట్లర! ఆఫీసర్ల పోకడ వేరు. వాల్లతోని మనం తూగం. నారాయణన్న, నిర్మల మనకు చిన్నప్పట్నుంచి తెల్సిన సంబంధమాయె" అంది దేవక్క.

నిజమే. కాని చంద్రయ్య, దేవక్క అదే నేత వృత్తిలో ఉండి పేదగా మిగిలిపోవడం వల్ల ఆ సంబంధం సేటు-నేతగాడు సంబంధంగా మారుతూ వచ్చింది. అరవింద్ ఎలా చెప్పాలి... ఎలా సున్నితంగా ఈ సంబంధం తప్పించుకోవాలి అని ఆలోచిస్తున్నాడు. గట్టిగా చెప్తే నా బాకీ నాకు పారేసి మాట్లాడు అని అంటే ఇప్పుడెక్కన్నించి తెచ్చికడ్తాడు.

నారాయణ సేటు కాస్త చదువుకున్నవాడు, చిన్నప్పుడు తండ్రిలా ఇరవై నంబరు దొడ్డుచీరెలు నేసినవాడే. తర్వాత ముప్పయి నలభయి నంబరు చీరలు నేశాడు. తర్వాత అరవై నంబరు ధోతులు నేశాడు.

1949లో చేనేత సహకార సంఘం పెట్టినప్పుడు అతను కూడా తిరిగాడు. అతను హకీం నారాయణదాసు, గుంటుక నర్సయ్య పంతులు, కొండాలక్ష్మన్

బాపూజీ, గంగుల భూమయ్యలతో కల్సి తిరిగినవాడే. స్వాతంత్ర్య సమర యోధుడే.

"నాన్నా! నారాయణ మామ బాగా ఉన్నవాడు, నా మీద పెట్టుబడి పెట్టడం ఎందుకే. నాకు ఎవరైనా పెట్టుబడి పెడ్తారు. మన గురించి చిన్నప్పట్నుంచి తెల్సిన సంబంధం కదా. తమ్ముని కన్నా నిర్మల ఎనిమిది నెలలు చిన్నదే. తమ్మునికిచ్చి ఒక మంచి బట్టల దుకాణం పెట్టిచ్చి తమ్మున్ని తన తీరుగ పెద్ద సేటును చేయవచ్చు గదా."

"గట్ల ఆలోచిస్తే ఈ లోకం గిట్ల ఎందుకుండుర? అందరు మంచిగ బతుకకపోదురా? గంత ఓపికలు, మంచి గునాలు ఎవలనుకున్నయిరా? పండిందానికి ధర కడ్తమని వస్తరు. మంచి సీరెలు నెయ్యున్రి అనే రైతులు మొత్తం పైసలు అడ్వాను యిస్తే యింతకన్న తక్కువ ధరకు ఇంతకన్న మంచిగనేసి ఇస్తుంటిమి. ఈ అప్పులు వడ్డీలు అన్నీ తగ్గు. గట్ల ముందుగాల పెట్టుబడి పెట్టు మంటే ఎవలకైనా బుగులే". తల్లి దేవక్క నిర్వేదంగా అంది.

తమ్ముని భవిష్యత్తు గురించి పెద్దకొడుకు ఆలోచిస్తున్న తీరుకు తల్లికడుపు నిండిపోయింది.

తల్లి ఫ్రెంచి శాస్త్రవేత్త చెప్పిన విషయాల్నే ఎంత అలవోకగా చెప్పేసిందని కొత్తగా ఆశ్చర్యపోయాడు అరవింద్.

"అట్లాగాక పోతే నేను రాధనే చేసుకుంట. ఇద్దరం కల్సి దవఖాన నడిపిస్తే తమ్ముడు మెడికల్ షాపు నడుపుకుంటడు. అట్లా తమ్ముడూ-మనం అందరం ఒక్కతీరు బతుకుతం గదనే."

"ఆఫీసరు బిడ్డ గట్ల సాగనిస్తాదిరా" అంది తల్లి.

"సరే ! నేను నారాయణ మామను కల్సి వస్త" అంటూ బయటకు నడిచాడు అరవింద్.

నారాయణ మామతో అరవింద్ తమ్ముడు ఆనంద్ గురించి చెప్పేసరికి విస్తుపోయాడు. అరవింద్ వాదన బాగానే ఉంది. కాని తనను చేసుకొమ్మని అడిగితే తమ్మునికిమ్మని చెప్పడం చాలా అవమానంగా ఫీలయ్యాడు. తరువాత అయినా మనస్సు మార్చుకుంటాడేమోనని ఆశగా మర్యాదగా అలాకాదని చెప్పాడు.

పోతూ పోతూ అరవింద్ మరో రెండుసార్లు బతిమిలాడితే తమ్ముడికి నిర్మలను ఇచ్చుటానికి ఒప్పుకొనేటట్టు ఉన్నడు అని తల్లి దండ్రులకు చెప్పి మరీ



అదే రాత్రి హైద్రాబాద్ బయలుదేరాడు.

నిర్మల తన చిన్న కోడలు అవుతుందనే ఆశ తల్లి దేవక్కకు కాలు నిలువ నీయలేదు. బాకీలన్ని దూది పింజలుగా తేలికైపోయినట్టు అనిపించింది. అయినా అడగడానికి వెనకాముందైంది. వారం రోజులకు ధైర్యం తెచ్చుకొని బయలు దేరింది.

వారం తర్వాత చెల్లెలు దేవక్కనోటి నుండి మళ్ళీ అదే ప్రతిపాదన విని నారాయణ సేటు దెబ్బతిన్న అహంతో మండిపడ్డాడు.

"మొన్నవాడు చెప్పింది సాలక మల్ల నువ్వచ్చినావే సంబంధం అంటూ! ఇంటర్ మీడియట్ ఫేలైనోనికి డిగ్రీ సదివే నా బిడ్డను అడుగుటానికి వానికి బుద్ధి లేకపోతే మీకు లేదా! నీ కొడుకు డాక్టరు కోర్సు సదువుతే కాదుగని ఎక్కడ ఆగుత లేరెమ్మే! చిన్న అంతరం-పెద్ద అంతరం చూడకుంట ఎట్లడగ బుద్ధయిందే? వియ్యానికైనా కయ్యానికైనా ఇద్దరూ సమానంగా ఉన్నప్పుడే రక్తి కడుతది. వాడేదో డాక్టరు కోర్సు సదువుతున్నడని పిలిసి పిల్లనిస్తనంటే మేం అంత లాచార్ (దిగజారినవాళ్ళం) అయినమా....." అంటూ దులిపేశాడు నారాయణ.

అనుకోని సంఘటనకు దేవక్క కనుగుడ్ల నీళ్ళను కొంగుతో ఒత్తుకుని అక్కన్నించి లేచింది.



ఎనిమిది నెలలు గడిచాయి.

అరవింద్, దేవక్క మాటలకు అహం దెబ్బతిన్న నారాయణసేటు నిర్మలకు ఒక లెక్చరర్ సంబంధం ఖాయం చేసి భారీ కట్నంతో పెళ్ళి చేశాడు.

ఓ పెద్ద బరువు దిగిపోయినట్టు సంతోషపడ్డాడు అరవింద్.

"హలో అరవింద్, ఈ హైదరాబాద్ ఫిలిం ఫెస్టివల్ ఎంత అధ్వాన్నంగా అర్గనైజ్ చేశారో చూశావుగా! ఈ ఎలిజబెత్ సినిమా అద్భుతంగా ఉంది కదూ! పాస్ సంపాదించే సరికి తల ప్రాణం తోకకు వచ్చింది. నాన్న ఫోన్ చేసి యిప్పిస్తే గానీ దొరకలేదు. నువ్వెలా సంపాదించావు." ఉత్సాహంగా పలకరించింది రాధ.

అరవింద్ చెప్పాడు. విక్రాంత్ డీల్ చేసి యిప్పించిన తీరు విని ఆ చొరవకు ఆశ్చర్యపోయింది రాధ.

"ఎలిజబెత్‌కు ఎన్ని ఆస్కార్ అవార్డులొస్తాయో చూడాలి. ఇండియా వాడు తీశాడని నిర్లక్ష్యం చేస్తారేమో" అంది ఎంతో బాధగా రాధ.

ఎలా మొదలు పెట్టాలో తెలియక కాసేపు ఆలోచించి అన్నాడు అరవింద్.

"రాధా నీకో గుడ్ న్యూస్! మా అమ్మానాన్నలు మన పెళ్ళికి సరే అన్నారు. ఇక మనదే ఆలస్యం" అంటూ హమ్మయ్య చెప్పేశాను అని సంతోషంతో ఉబ్బిపోయి రాధ కేసి చూశాడు అరవింద్.

రాధ అకస్మాత్తుగా కలవరపడిపోయింది.

అంతలోనే తేరుకొని ఎటోచూస్తూ అంది.

"సారీ అరవింద్! నీకు చెప్పలేదు కదూ! నిరుడు స్టేట్స్ (అమెరికా) కెళ్ళిన వి.యల్.కాంట్ (వనమాల లక్ష్మీకాంతం) యం.యస్ కార్డియాలజిస్టుతో నాపెళ్ళి సెటిలైపోయింది. డాడి చూసాడీ సంబంధం. మార్చి అయిదో తేదీన పెళ్ళి. నువ్వు తప్పకుండా రావాలి."

ఓడిపోయి సింహాసనం దిగిపోయిన చక్రవర్తిలా అరవింద్ మొహం నల్లబడిపోయింది. అమ్మానాన్నా, నిర్మల, నారాయణమామ, తమ్ముడు గిర్రున జ్ఞాపకాల్లో తిరిగి ఎందుకో కన్నీళ్ళొచ్చాయి.

"మంచిది రాధా! గుడ్‌బై. విష్‌యూ బెస్టాఫ్‌లక్." అంటూ అక్కన్నించి చరచరా ముందుకు నడిచాడు అరవింద్.

మూడ్ అంతా చెడిపోయింది. హాస్టల్‌కు వెళ్ళి మెస్‌లో తిని పడుకున్నాడు అరవింద్. తన కలలు కుప్పకూలిపోయాయి. ఏడ్చి ఏడ్చి అలసిపోయాడు.

జ్వరం వచ్చిన వాడిలా గాఢ నిద్రపోతున్న అరవింద్ విక్రాంత్ కుదుపుతో లేచాడు. రాత్రి పదకొండైనా కాలేదు. ఎంత గాఢ నిద్ర....అంటూ ఇంకా ఏదో అనబోయి కన్నీటి చారికలు చూసి ఆగిపోయాడు విక్రాంత్.

"ఏంటి సంగతి! పైసలు పంపం అని ఇంట్లో ఏమైనా లొల్లి అయిందా? ముందు మొఖం కడుక్కొని రాపో! నాకు పార్ట్ టైం జాబ్ వచ్చింది. అమ్మా చెల్లెలి మీద నా భారం తగ్గింది. చెల్లె పెళ్ళి కోసం కాస్త కట్నం కూడా ఇక కూడబెట్టవచ్చు. ఈ సంతోషం నీతో పంచుకుందామని నీ కోసం ఫిలిం ఫెస్టివల్ అంతా తిరిగిన. విసిగి వేసారి నీకోసం ఇక్కడికి వస్తే నువ్వు యిలా...." అంటూ డీలా పడిపోయాడు విక్రాంత్.

అరవింద్ ఫ్రెష్ అయివచ్చాడు. అయినా మూడీగానే ఉన్నాడు.

విక్రాంత్ అడగ్గా అడగ్గా రాధ విషయం వివరించాడు అరవింద్.



"రాధ యిలా చేస్తుందని ఏ కాస్త అనుమానం ఉన్నా నారాయణ మామ కూతురు నిర్మలనైనా చేసుకొనేవాడిని. నాకు ఎంతో ఆధారం ఉండేది." అన్నాడు అరవింద్ చివరికి.

"అరె బావా! బాధపడకు. రాధకూడా నీలాగే ఆలోచించింది, ఎవరైనా ఉన్న స్థితినించి మరింత ఉన్నత జీవితం గెలుచుకోవాలనుకుంటారు. సమాజంలోని దాని పర్యవసనాలే నేటి ప్రపంచ ఆర్థిక వ్యవస్థ అని మన దేశ దుస్థితికి ఈ దృష్టే ఎలా కారణమో ఫ్రెంచి శాస్త్రవేత్త ఎంత బాగా చెప్పాడు. రాధకు నీ సోషల్ బ్యాగ్రౌండ్ ఎప్పుడైతే తెల్సిపోయిందో అప్పుడే కట్ చేయకుండా ఇంకా నీతో స్నేహం కొనసాగించడం ఆమె సహృదయతకు నిదర్శనం రా!" అంటూ చాలా సేపు ఓదార్చాడు విక్రాంత్.

మరోసారి సముదాయించాడు విక్రాంత్.

"అరే అరవింద్! రాధ నీ ప్రేమను నిరాకరించిందని భగ్నప్రేమికుడిగా బెంగటీలిపోతే నీమీదే ఆశలు పెట్టుకున్న నీ కుటుంబం ఏం కావాలి! నువ్వు డాక్టర్‌వై రేపు యం.ఎస్. జనరల్ సర్జన్ చేస్తే మీ తమ్ముడు మెడికల్ షాపు నడిపించుకుంటా ననుకున్నది మరిచిపోయావా? ఇట్లా బాధపడుతూ కూర్చుంటే యింటర్ ఫేలయిన చిన్న బావ ఆనంద్ ఇలాగే బట్టల దుకాణం గుమాస్తాగానే మిగిలిపోతాడు. నువ్వు, పారూ, జూలీ, రాధా, అనార్కలీ అంటూ ఏడుస్తూ కూర్చుంటే నీకు ఎవరో పెట్టుబడి పెట్టేసి మీ తమ్ముణ్ని కాదని మెడికల్ షాపు, ల్యాబ్, ఎక్సరే యూనిట్ అన్నీ వాళ్ళే నడుపుకుంటారు. అపుడు నారాయణ సేటు బిడ్డ నిర్మలను చేసికొని యిల్లరికం అల్లుడుగా మారినట్టుంటుంది నీ స్థితి.

"అరవింద్! బీ బ్రేవ్! అసలు ప్రేమ గురించి, పెళ్ళి గురించి నీకున్న సెంటిమెంట్లు, దృక్పథం మారాలి. ఫెమినిజం వచ్చాక ప్రేమ, పెళ్ళి, కుటుంబం, వాటి నిర్వచనాలు మారిపోయాయి. రేపు 'మానవి' సంస్థ వాళ్ళు చిక్కడపల్లి సిటీ సెంట్రల్ లైబ్రరీలో 'పెళ్ళి – దృక్పథాలు' పై సెమినార్ పెట్టారు. ఫిలిం యిండస్ట్రీ ని ఫెమినిస్టులతో పాటు, ఇంటర్నేషనల్ ఫెమినిస్టులు, ఫెమినిస్టు రైటర్స్ వస్తున్నారు. మగవాళ్ళు కూడా వెళ్ళవచ్చు. తప్పకుండా రావాలి. రేపు అక్కడే కలుసుకుందాం.

"సరే! నేను పోతున్నాను. ఈ రాత్రి ఓ.యు. క్యాంపస్‌కు బస్సు దొరుకుతుందో లేదో! ఆటో ఎక్కితే ముప్పయి రూపాయలు అడుగుతారు. మా అమ్మ, చెల్లె ఎంతో కష్టపడి, తినీ, తినక, రోజంతా బీడీలు చేసి నేను చదువు

కోవాలని పంపిస్తున్న పైసలివి. బస్సు దొరక్కపోతే నడిచేపోతా! ఒరే అరవింద్! కన్నీళ్ళు తుడుచుకోరా! నా చెల్లెలు కూడా నిన్ను ప్రేమించినందుకు నీలా ఏడుస్తూ కూర్చుంటే కష్టపడి పైసలు పంపునా? అపుదు నా గతి నీ తమ్ముడి గతి అయ్యేది. నేనిలా చదువుకోగలిగేవాడినా? సావిత్రిలా జీవితాన్ని నిబ్బరంగా అర్థం చేసుకో. వాస్తవ జీవితాన్ని గ్రహించు."

అంటూ వచ్చినంత వేగంగా వెళ్ళిపోయాడు విక్రాంత్. తన చెల్లెలు భగ్నప్రేమ గురించి విక్రాంత్ మాట్లాడిన మాటల అంతరార్థం మెడిసిన్ చదువుతున్న అరవింద్ అబ్సర్డ్ మూడ్‌కు అర్థం కాలేదు.

రాధ అతన్ని నిరాకరించి మరొకర్ని పెళ్లి చేసుకోబోతున్న విషయమే అతనికి ప్రపంచం మునిగిపోయే సమస్యగా కనపడుతోంది. తాను నిరాకరించడం వల్ల సావిత్రి కూడా కలలు చెదిరి యిలాగే బాధపడిందని అరవింద్ ఇప్పటికీ గ్రహించలేకపోయాడు.



అరవింద్ చిక్కడపల్లి సిటీ సెంట్రల్ లైబ్రరీ హాలు చేరేసరికి హాలు బయట కూడా జనం కిటకిటలాడుతున్నారు. ఇదంతా ఫెమినిజంపట్ల ఆకర్షణో, ఆడవాళ్ళపట్ల ఉండే ఆకర్షణో, ఫిలిం సంబంధీకుల పట్ల ఆకర్షణో అర్థం కాక ఆశ్చర్యపోయాడు అరవింద్.

ఎంతసేపట్నుంచో తేపకోసారి అతనికోసం చూస్తూ

"సీటు ఆపి ఉంచిన దా!" అంటూ వచ్చి పలకరించాడు విక్రాంత్.

"లేటయితే గొప్ప ఉపన్యాసం మిసర్సయ్యేవాడివి. జాగ్రత్తగా విను. మీ మెడికోల మెదళ్ళు సోషల్ సైన్సెస్ విషయంలో ఉత్త మట్టి బుర్రలు. మీకు మీ సబ్జక్టు తప్ప లోకం తెలియదు. ప్రేమా దోమా అని బుర్ర బద్దలు కొట్టుకోకు" అంటూ లాక్కుపోయాడు విక్రాంత్.

మట్టి బుర్ర అన్నందుకు ఏదో అనబోయాడు అరవింద్. కాని ప్రసంగం నడుస్తోంది.

"ప్రేమ, పెళ్ళి, కుటుంబ వ్యవస్థ, సామాజిక సంబంధాలు, సంస్కృతి, ఇవన్నీ రాజకీయాలే. ప్రతి వ్యక్తిగత విషయం కూడా రాజకీయమైనదే, సామాజికమైనదే. వీటితో పాటు ఉద్యమాల, పార్టీల, భావజాలాల, సంస్కృతుల పవర్ సెంటర్స్ అన్నీ సోషల్ క్యాపిటల్ సంచయాలే. ఇవన్నీ సోషల్ ఎకనమిక్స్



తాలూకు సోషల్ క్యాపిటల్ రూపాలు. ప్రేమ, పెళ్ళి, కుటుంబం మొ॥ రూపాల్లో పైసా పెట్టుబడి లేకుండా పురుషాధిపత్యం చెలాయించడం పితృస్వామిక సమాజ విలువల వల్ల సాధ్యపడుతున్నది." అమెరికన్ ఫెమినిస్టు ఎవరో చెప్పుకుపోతున్నారు. చప్పట్లు మారుమోగాయి.

"నేడు ప్రేమ అని చాలామంది ఫీలయ్యేదాన్లో ఫ్యూడల్ పెట్టుబడిదారీ దోపిడి వర్గాల, పురుషాధిపత్యవాదుల దృక్పథమే ఉంది. రెండు హోదాల మధ్య, రెండు ఉద్యోగాల మధ్య, రెండు వ్యాపారాల మధ్య పెళ్ళిళ్ళవుతున్నాయే తప్ప అవి రెండు హృదయాల మధ్య కాదు. తల్లిదండ్రులు చూసే సంబంధాలు కూడా యివే. కాదంటే కట్నంతో కొందరు కాస్త పెద్ద హోదాతో పెళ్ళి చేస్తారు. అటువైపునుండి హోదాను, ఉద్యోగాన్ని బట్టి కట్నం లాగుతారు."

అరవింద్‌కు ఒక్కొక్క మాట బాణంలా గుచ్చుతోంది. రాధపట్ల తనది రెండు హోదాల మధ్య ప్రేమేనా? మరదలు సావిత్రి ప్రేమను తాను అందుకే అంత తేలిగ్గా తీసేశాడా? రాధ కూడా యిందుకే తన ప్రేమని అంత తేలిగ్గా తీసేసిందా? మరదలు సావిత్రి గురించి విక్రాంత్ రాత్రి ఏదేదో చెప్పాడు. తనను ఇందుకేనా విక్రాంత్ యీ మీటింగుకు మరీ మరీ రమ్మని చెప్పింది. నారాయణ సేటు నిర్మలకు కట్నంతో హోదాను కొన్నట్టేనా? విక్రాంత్ రాత్రి అన్న మాటల అర్థం అరవింద్‌కు మెరుపులా మెరిసింది.

తన మేనమరదలు సావిత్రి పదవ తరగతి పాసై ఆగిపోయింది. బీడీలు చేస్తోంది. అరవింద్ బావ టీచర్ ట్రేనింగ్ చేస్తే బావతోనే పెళ్ళవుతుందని ఆశించింది. కాని మెడికల్ సీటు రావడంతో ఆశ వదులుకుంది. అది ఎంతో సహజం అన్నట్టే సావిత్రి మామూలు మనిషై పోయింది. ఆమెను ప్రేమించిన తన ప్రేమను కూడా చాలా తేలికగా తీసుకుని మరిచిపోయాడు అరవింద్.

"మనిషి యిష్టాయిష్టాలను మనిషి కాకుండా వ్యవస్థలు, హోదాలు, స్థలకాలాలు, భావాలు, అర్హతలు నిర్ణయిస్తుంటాయి" ఆమె చెప్పుకుపోతూనే ఉంది.

ఆమె ప్రధాన ప్రసంగం అయిపోయాక ఫ్రెండ్స్‌ని విష్ చేద్దామని విక్రాంత్‌ని లేవదీసి వరండాలోకి నడిచాడు అరవింద్.

లత "హాయ్" అంటూ అరవింద్‌కేసి చూస్తూ అందంగా విష్ చేసింది. స్త్రీ గొంతు. తననేమో అనుకుని ఉలిక్కిపడి చూశాడు విక్రాంత్.

ప్యాంట్, షర్టు వేసుకుని మగవాడిలా ఉన్న ఆమెను పోల్చుకో లేకపోయాడు.

అరవింద్, లత ఏదో మాట్లాడుకుంటూ నవ్వుకున్నారు. మైకు శబ్దంలో విక్రాంత్‌కు విన్పించడం లేదు. కాసేపటికి అరవింద్ చెయ్యి పట్టుకొని కాస్త పక్కకు తీసుకెళ్ళి గుసగుసగా అన్నాడు విక్రాంత్.

"ఫెమినిస్టుల సెమినార్‌కు రమ్మన్నానని పొరపాటున ఫెమినిష్టును పెళ్ళి చేసుకునేవు. చేసుకొంటే నీ కుటుంబం మొత్తం ఆగం అవుతుంది జాగ్రత్త. ఫెమినిస్టులు తనకు తాను వ్యక్తిగతంగా మరింత ఎదగాలని కోరుకుంటారే తప్ప ఆమెకన్నా వెనకబడిపోయిన మీ తమ్ముళ్ళీ, తల్లిదండ్రుల్నీ ఎదిగిస్తూ పోషిస్తూ కూర్చోరు. అదంతా వాళ్ళ దృష్టిలో వేస్టు లగేజీ. మనలాగ నూటికొక్కడు పైకొచ్చే కుటుంబాల్లో ఫెమినిస్టులను పెళ్ళి చేసుకొంటే మన అభివృద్ధి నీవాళ్ళకందకుండా పోతుంది. అసలు ఉమ్మడికుటుంబం విచ్ఛిన్నమై, వ్యక్తికుటుంబం ఏర్పడితే తప్ప ఫెమినిజం పుట్టడం సాధ్యం కాదు." అన్నాడు విక్రాంత్ ఎక్కడ లత బుట్టలో పడిపోతాడేమో అని ఆలోచిస్తూ.

అరవింద్‌కు కాస్త కోపం వచ్చింది.

"ఫెమినిస్టులు నిజమైన ప్రేమ – అసలైన హృదయం గురించి మాట్లాడుతుంటే వాళ్ళను మరీ యింత స్వార్థపరులనడం బాగాలేదు. రాజకీయాలు, సామాజిక అర్థశాస్త్రం చదివి చదివి నీ బుర్ర ప్రతి వ్యక్తిలో స్వార్థాన్నే చూస్తున్నది. ఆమె ఎవరనుకున్నావు? లత. నా క్లాసుమేటు. నన్ను బాగా ప్రేమిస్తోందని చెప్పానే ఆమే యీ లత. హృదయం లేనిది ఆమెకు కాదు నీకే." తనది మట్టిబుర్ర అన్నందుకు సరిగ్గానే అన్నానని సంతోషపడ్డాడు అరవింద్.

విక్రాంత్ అహం దెబ్బతిన్నది. తనకు హృదయం లేదని ఎవరైనా అని ఉంటే బాధపడి ఉండేవాడు కాదు. అన్నీ తెల్సిన చిన్ననాటి క్లాసుమేటు అరవింద్ ఆ మాట అన్నాడు. బాధ నుంచి కోపంగా అన్నాడు విక్రాంత్.

"అరేయ్ అరవింద్! ముందసలు నీకు హృదయం ఉందా చెప్పు! ఉంటే చిన్నప్పట్నుంచి నువ్వు ప్రేమించిన నా చెల్లెలు సావిత్రిని పెళ్ళి చేసుకొని నిరూపించురా! నీ స్వార్థానికి చాలదు కాబట్టి సావిత్రిని వదిలి రాధను ప్రేమించావు" అంటూ కన్నీళ్ళతో గబగబా వెళ్ళిపోయాడు విక్రాంత్.

ఆ మాటల ఈటెల్నుంచి తేరుకునేసరికి విక్రాంత్ మెట్లు దిగాడు. గబగబా



వెళ్ళిన అరవింద్ ప్రయత్నం వ్యర్థమే అయింది.

చేయి విదిలించుకొని తీక్షణంగా చూసి వెళ్ళిపోయాడు విక్రాంత్. అరవింద్ వెనకే లత పరుగులా వచ్చింది.

"అసలేం జరిగింది" అంటూ ఆరా తీసింది లత.

టూకీగా విషయం చెప్పాడు అరవింద్. అది విన్నాక లత కూడా అరవింద్‌పై విరుచుకుపడింది."

నా గురించి విక్రాంత్‌కు ఇంతకాలం దాకా అసలు విషయాలు ఎందుకు చెప్పలేదు. నేను మాదిగ ఎస్సీనని, మా అమ్మ వరంగల్‌లో మున్సిపల్ స్వీపరని, మా అన్న పరకాలలో స్కూలు అటెండరని చెప్పడం నీకు చిన్నతనం అన్పించిందా! అవి నీకు చిన్నతనంగా కన్పించాయంటే మీలో ఎంతో కులతత్వం ఉందని అర్థం.

"సమాజానికి ఉపయోగపడే ఏ పని అయినా గౌరవనీయమేనదే. మా అమ్మకు, అన్నయ్యకు ఆ ఉద్యోగాలే లేకపోయి వుంటే నేనెలా ఈ చదువు చదువుకోగలిగేదాన్ని? నీకన్నా విక్రాంతే నిర్మలమైన మనస్కుడు. ఎంతో హృదయ సంస్కారం ఉంటే తప్ప తన చెల్లెలి ప్రేమను నిరాకరించినవాడితో యింకా ఎలా స్నేహం చేస్తాడు? పైగా వేరే ప్రేమికురాలితో జరిగిన పరాభవం నుండి ఓదార్చాడంటే ఎంత మంచివాడై ఉండాలి...

"ఈసారి నేనే అతనికి అన్ని విషయాలూ వివరిస్తాను. విక్రాంత్ అన్నదాంట్లో తప్పేముంది? నిన్ను ప్రేమించినందుకు నన్ను కూడా ఎంత లోకువగా చూశావు. నిన్ను ప్రేమించి భగ్నప్రేమికురాలిగా ఏడ్వడం ఎంత బుద్ధితక్కువో యిపుడే తెలిసింది. గుడ్‌బై" అంటూ చకచకా మెట్లెక్కి తిరిగి మీటింగ్‌లో కల్సిపోయింది లత.

విక్రాంత్‌తో చెంపదెబ్బ, లతతో గోడదెబ్బ తగిలి అచేతనుడయ్యాడు అరవింద్. కాళ్ళీడ్చుకుంటూ మీటింగ్ కేసి నడిచాడు.



లత విక్రాంత్‌లు ఎడాపెడా వాయించిన మాటలు అరవింద్‌ను నిద్ర పోనీయడం లేదు. రాధ కోసం తాను బాధపడ్తున్నట్టే తనకోసం లత బాధపడింది. తమ యిద్దరి బాధకన్నా సావిత్రి దుఃఖం ఎంతో హెచ్చు. తనకోసం సావిత్రి ఎంత బాధపడిందో.

అమ్మానాన్నలు పెద్దసేటు అయిన నారాయణ మామ కూతురు నిర్మలను పెళ్ళి చేసుకొమ్మని అడిగారే గానీ మేనమరదలు వరుసైన సావిత్రి ఊసే ఎందుకు

తీయలేదు. అత్త బీడీలు చేస్తుందనే గదా!

కట్నం ఏమీ యివ్వలేరనేదొక్కటి తప్ప సావిత్రిని కాదనడానికి కారణాలేముంటాయి?

తనకు డాక్టరమ్మాయే కావాలంటే దొరక్కపోదు. లత ఉంది. కాని సావిత్రికి డాక్టరు భర్త దొరుకుతాడా-తాను కాదంటే. అమెరికన్ ఫెమినిస్టు అన్నట్టు బాకీ సంబంధాల్లాగే మేన సంబంధాలు కూడా సోషల్ క్యాపిటల్ తాలూకు హక్కులు అధికారాలే. విక్రాంత్, సావిత్రి యింతకాలంగా హృదయాల్లో ఎంత బాధ దాచుకున్నారో. అలాంటి విక్రాంత్‌ను నీకు హృదయం లేదని తిట్టాడు తాను.

ఆలోచిస్తున్నకొద్దీ అరవింద్‌లో ఏదో బాధ పెరిగిపోతూ ఉంది. చదువు మీదికి దృష్టి పోవడం లేదు. లతను పలకరిస్తే ముక్తసరిగా మాట్లాడి తప్పించుకుంది.

తనకోసం పడిచస్తుందనుకున్న లత ఈసడింపు మరింత బాధ పెట్టింది.

"సారీ అరవింద్, ఆ రోజు నుండి ప్రేమ, పెళ్ళి పట్ల నా దృష్టే మారిపోయింది" అంటూ వెళ్ళిపోయింది.

అరవింద్‌కు ఎందుకో ఇంటికి పోవాలని, సావిత్రిని పలకరించాల నిపిస్తోంది.

రాత్రి తొమ్మిదింటికి అకస్మాత్తుగా దిగిన కొడుకు అరవింద్‌ను చూసి దేవక్క, చంద్రయ్య ఆశ్చర్యపోయారు.

మళ్ళీ పైసలు కావాలంటాడేమోనని తల్లిదండ్రుల మనస్సు బిక్కుబిక్కు మంది. తన కూతురు నిర్మల పెళ్ళిసంబంధంను కాదన్న నుంచి బాకీ అడిగినప్పుడల్లా నారాయణ పైసలు లేవనే అంటున్నాడు. నిర్మల పెళ్ళికి తానే అప్పు చేయాల్సి వచ్చిందని గొణుగుతున్నాడు.

తమ్ముడు ఆనంద్ బట్టల షాపు నుండి అపుడే వచ్చాడు. ఆనంద్‌తో అదీ యిదీ మాట్లాడి తిని తొందరగానే పడుకున్నాడు అరవింద్.

ఉదయం స్నానం అవడంతోనే తయారై సావిత్రి యింటికేసి నడిచాడు అరవింద్.

సావిత్రి తల్లి సక్కుబాయి ఇంటెనుక గిన్నెలు కడుగుతోంది. సావిత్రి బీడీల ఆకు కత్తిరిస్తోంది.



అరవింద్‌ను చూసి సావిత్రి తొట్రుపడి సిగ్గుపడిపోయింది.

అరవింద్ ముహంలో కాస్త చిరునవ్వు విరిసింది.

సావిత్రి చేతిలోని కత్తెర, బీడీల ఆకు బుట్టిగుల్ల (గంప) లో పడేసి "అమ్మా! అరవింద్ బావచ్చిండే" అంటూ యింటి వెనక్కు పరిగెత్తింది.

సావిత్రి కాళ్లకున్న వెండి పట్టగొలుసుల గజ్జెలు గలగలమంటూ అరవింద్ హృదయంలో సవ్వడి చేశాయి.

"కూసొమ్మను. చాయె పెట్టు పో. గిన్నెలు ఈన్ని కడిగి వస్త" అంది సక్కుబాయి.

అరవింద్‌తో కొడుకు విక్రాంత్ ఏం చెప్పి పంపాడో అనుకుంది సక్కుబాయి.

"సావిత్రీ! నువ్వు ఓపెన్ యూనివర్సిటీ డిగ్రీ పరీక్షకు కట్టకపోయినవ్" అంటూ అడిగాడు అరవింద్ కుశల ప్రశ్నలయ్యాక.

సక్కుబాయి ఆ సలహా యిదివరకెన్నోసార్లు విన్నది. ఎన్నోసార్లు చెప్పిన జవాబే మళ్ళీ చెప్పింది.

"నీకేందోయి అల్లుడా! మొగోల్లు ఎంత సదువుకుంటె అంత మంచి ఉద్యోగం దొరుకుతది. ఆడపిల్ల ఎక్కువ సదువుకుంటె అంతకన్న ఎక్కో సదివిన సంబంధం తేవాలంటే నాతోని అయితదా?"

"ఎందుకు కాదత్త! విక్రాంత్ ఉద్యోగం చేస్తనే ఉండె. అన్నట్టు విక్రాంత్ పైసలు పంపిండు" అంటూ అయిదు వందలు యిచ్చాడు అరవింద్.

టీ యిచ్చి మళ్ళీ బీడీల ఆకు ముందేసుకుంది సావిత్రి.

సావిత్రి ఎంత అందంగా ఉంది అనుకున్నాడు అరవింద్.

రాధ, నిర్మల, లతకన్నా సావిత్రే ఎంతో బావుంది.

తనకు చిన్నప్పట్నుంచీ తెల్సిన పిల్ల.

కొద్ది క్షణాలు గుండె వేగంగా కొట్టుకుంది.

తాను రాధను ప్రేమించి పొరపాటు చేశాడా!

అక్కడినుంచి సెలవు తీసుకొని యింటికొచ్చాడు అరవింద్. అప్పటికి తమ్ముడు ఆనంద్ బట్టలషాపుకు వెళ్ళిపోయాడు. నాన్న మగ్గం నేస్తున్నాడు. అమ్మ నూలు కండెలు చుడుతోంది. రాట్నం తుమ్మెద రాగంలా తిరుగుతోంది.

"అమ్మా! సావిత్రికి ఏమైనా పెండ్లి సంబంధాలు వస్తున్నయా? సావిత్రి తోటిదైన నిర్మలకు పెళ్ళయిపాయె. ఇపుడు విక్రాంత్ ఉద్యోగం కూడా చెయ్యవట్టె." తల్లి దేవక్కను అడిగాడు అరవింద్.

సావిత్రి విషయం ప్రస్తావించిన కొడుక్కేసి ఎగాదిగా చూసింది దేవక్క.

"కాంతడు చెల్లెకు ఏమైనా సంబంధం చూసిండా ఏందిరా? అందుకే వచ్చినవా ఏంది?"

"అందుకోసమైతే విక్రాంతే రాడా? పైసలు పంపుతె యిచ్చి వచ్చిన. ఎవలన్న అడుగుటానికి వస్తున్నరా?"

"మొన్న రెండు సంబంధాలు వచ్చినై. ఆల్ల కుటుంబం ఎసొంటిది అని నన్నే అడిగిన్రు. ఆల్లు యింతట్ల పెళ్ళి చెయ్యరు అని చెప్పిన" అంటూ అర్థోక్తిగా నవ్వింది దేవక్క.

"అట్లా ఎందుకు చెప్పినవే. విక్రాంత్ సావిత్రి పెళ్ళి చేసే ఆలోచనల ఉన్నడు."

"మన ఆనంద్‌కు సావిత్రిని చేసుకుంటే ఎట్లుంటదిర? మొన్న వాల్లు అడుగవచ్చినపుడే నాయిన్న నేను అనుకున్నం. అది రోజుకు వెయ్యి బీడీలు చేస్తది. మనమంటే దానికి చిన్నప్పట్నుంచీ ఎంతో భయం, భక్తి. నీక్కూడ కుదిరితే యిద్దరికీ ఒకసారే పెండ్లి చేస్తే ఓ పని తీరుతది. వానికి గూడ ఏండ్లు పడవట్టె. దాన్ని నీకు చేద్దామని మునుపు అనుకున్నంగని నీ బాకీ తీరుదెట్ల అన్నడు మీ నాయిన్న."

నాన్న నేస్తున్న మగ్గంలో టక్కుం టిక్కుం అంటున్న నాడె దారితప్పి తన గుండెల్లో దిగబడ్డట్టు అరవింద్ హృదయం కలుక్కుమంది.

"సావిత్రికి తెలుసానే మీరనుకున్నది?"

కండెలు చుడుతున్న రాట్నం జంకారంలాగే నవ్వి అంది దేవక్క. "తెలువకుంట ఎట్లుంటదిర?"

"ఇల్లంత పులిసిన గంజి వాసన వేస్తున్నదే" అంటూ మాట మార్చాడు అరవింద్.

"ఇయ్యాల కొత్తగా అడుగవడితివేంర? మబ్బుల వడ్డది గద. సరి చేసిన నూలు గంజి వాసనత్తంది" అంది దేవక్క.



చంద్రయ్య మగ్గం నేయడం ఆపి మగ్గం గుంట నుండి లేచాడు.

"పెద్దోడు వచ్చిండు గద. ఆకలైతంది. ఇద్దరికి అన్నం బెట్టు" అన్నాడు చంద్రయ్య.

రాట్నం ఆపి దేవక్క అన్నం వడ్డించింది.

రెండు రోజులున్నాడు అరవింద్.

తనలాంటి వాళ్ళకు అటు పూర్తి పై స్థాయి రాధతోనూ పెళ్ళి వీలు కాలేదు. ఇటు పూర్తిగా కింది స్థాయి సావిత్రితోనూ పెళ్ళి కాలేని స్థితి. ఎందుకిలా జరుగుతోంది. పెళ్ళికి మనిషి యిష్టాయిష్టాల ప్రమేయం లేదా!

రెండు రోజులయ్యాక తనలో తాను సమాధానపడ్డాడు అరవింద్.

అమ్మానాన్నా అన్నదాంట్లో తప్పేమీ లేదు అని అర్థం అయ్యాక అతని మనస్సు తేలికపడింది.

తనను ఎంతగానో ప్రేమించే లత ఉండగా విక్రాంత్ మాటలను పట్టుకొని తాను ఫీలవడం, ఆలోచించడం ఉత్త సెంటిమెంటల్ అనుకున్నాడు అరవింద్.



హైద్రాబాద్ నాంపల్లి పబ్లిక్‌గార్డెన్ ఎకరాలకొద్దీ పచ్చని చెట్లు. అంత పెద్ద నగరంలో నడిబొడ్డున అంత పెద్ద పార్కు ఎలా సాధ్యమయిందో అని ఆశ్చర్యపోయేంత పెద్ద పార్కు. అక్కడే అసెంబ్లీ హాలు. అందులోనే పురావస్తు శాఖ. లలిత కళాతోరణం ఓపెన్ ఆడిటోరియం. అటునుంచి పడపటికి వెళ్తే నాంపల్లి రైల్వేస్టేషన్ అంతా చూసేవిధంగా ఫుట్‌పాత్ ఫ్లైఓవర్. జూబ్లీహాల్, ప్రియదర్శిని హాల్ అన్నీ తిరిగి మూడ్ బాగాలేక అరవింద్ ఒక చెట్టు కింద కూలబడ్డాడు.

అల్లంత దూరాన మరో చెట్టు కింద లతను చూసి ఆశ్చర్యపోయాడు అరవింద్. లత కూడా అతన్ని అక్కడ చూసి ఆశ్చర్యపోయింది.

లతకూడా మూడ్ బాగాలేక అక్కడికి చేరిందని అరవింద్‌కు తెలియదు.

తనను వెతుక్కుంటూ వచ్చాడా అని క్షణకాలం పులకరించింది లత. ఆమె కళ్ళు సంతోషంతో మెరిసాయి. అంతలోనే దిగాలు పడిపోయింది.

"హాయ్ లతా! ఏంటి ఈ మధ్య మూడీగా ఉంటున్నావు? ఏమైంది?"

"హాయ్!" అంటూ విషాదంగా నవ్వింది లత.

అరవింద్ మళ్ళీ మళ్ళీ అడిగేసరికి లత టాపిక్ మార్చింది.

"ఏం లేదు అరవింద్! మనం ప్రేమించే వారికన్నా మనను ప్రేమించే వారితో పెళ్ళి జరిగితే జీవితం ఆనందమయమవుతుందంటారు. నీ అభిప్రాయం ఏమిటి?"

"అది నిజం లతా! అందుకే మన పెళ్ళి యిద్దరికీ ఆనందమయమైన జీవితాన్నే యిస్తుంది" అంటూ నవ్వాడు అరవింద్.

అరవింద్ పెళ్ళి ప్రస్తావనతో లత విస్తుపోయింది. తనను చూస్తే అరవింద్‌కు వేళాకోలంగా వుందా! అని అతనికేసి ఎగాదిగా చూసింది లత. ఆమెది ముందే గాయపడ్డ హృదయం.

అరవింద్ చూపుల్లో పశ్చాత్తాపంతో కూడిన ప్రేమ. లత కళ్ళల్లో మళ్ళీ క్షణకాలం వెలుగు. మళ్ళీ అంతలోనే విషాదం.

"నువ్వు అకస్మాత్తుగా యింటికెళ్ళావేంటి! మళ్ళీ ఏదైనా పెళ్ళి సంబంధం వచ్చిందా?" నవ్వింది లత.

"అసలు విషయం దాటవేస్తున్నావు. నేనడుగుతున్నది మన పెళ్ళి గురించి."

"నిన్ను ప్రేమించే నన్ను చేసుకుంటే నీ జీవితం ఆనందమయమవుతుంది. కాని నన్ను ప్రేమించే వారితో నా పెళ్ళి జరిగితే నాకు ఆనందంగా ఉంటుంది గదా!" ఉడికించింది లత.

అరవింద్ సీరియస్ అయిపోయాడు.

వెళ్తానంటూ వెళ్ళబోయాడు. చేయి పట్టి ఆపి అంది లత.

"అరవింద్! మా అమ్మా అన్నయ్యల సంగతి తెలిస్తే నన్ను చేసుకుంటా అని అనలేవు. విక్రాంత్ మొన్న మా వూరికొచ్చాడు. మా పరిస్థితి అంతా చూశాడు. విక్రాంత్ రాకపోతే మా అన్నయ్య యిపుడు జేల్లో ఉండేవాడు. వదిన ఆత్మహత్యా ప్రయత్నం చేసింది. ఇపుడు కొంత కోలుకుంది."

"అరరే....ఎందుకు జరిగింది? విక్రాంత్ ఎపుడొచ్చాడు. ఏం జరిగిందసలు."

"అదంతా పోనీలే అరవింద్! పార్కులోనైనా ప్రశాంతంగా ఉండనివ్వు. మీ ఊరికి ఒకసారైనా రమ్మనవేం? ఎస్సీననా?"

"ఛ! అలా అంటావేం? వచ్చే ఆదివారం వెళ్దామా?"



"ఈసారి వీలు కాదు. తర్వాత చూద్దాం. ఊరికే అడిగాను" అంది లత.



సెలవుల్లో విహార యాత్ర పేరిట లతను తీసుకొని విక్రాంత్, అరవింద్ జగిత్యాల బయలుదేరారు. సావిత్రి తోడుగా ఉంటుందని సక్కుబాయి ఇంట్లోనే ఉండిపోయింది లత.

మొదటి రోజులోనే లత సావిత్రితో, విక్రాంత్ తల్లి సక్కుబాయితో యింట్లో సొంత మనిషిలా కల్సిపోయింది.

"మేం మాదిగోల్లం అంటీ" అని లత అంటే సక్కుబాయి, అరవింద్ తల్లి దేవక్క నమ్మలేకపోయారు.

లత అచ్చం మన పద్మశాలీల పిల్ల తీరే ఉన్నది అని మెచ్చుకున్నారు.

రెండు వందల ఎకరాల విస్తీర్ణంలో గల ప్రభుత్వ చల్‌గల్ అగ్రికల్చరల్ ఫారం, పొలాస అగ్రికల్చరల్ రీసెర్చ్ సెంటర్, రెండువందల ఏళ్ళనాటి జగిత్యాల ఖిలా చూద్దామని బయల్దేరదీశాడు విక్రాంత్.

సావిత్రి, సక్కుబాయి, దేవక్క, లత, అరవింద్, విక్రాంత్ కల్సి బయల్దేరారు. ఖిలా గురించి విక్రాంత్ చెప్తుంటే సావిత్రి, లత ఆసక్తిగా విన్నారు.

సావిత్రితో కలిసి మరుసటిరోజు ముప్పై కిలోమీటర్ల దూరంలోని ధర్మపురికి గోదావరి స్నానానికని బయల్దేరారు. సక్కుబాయి, దేవక్క యింటి వద్దే ఆగిపోయారు.

గోదావరి నది ఎంత అందంగా ఉందో! గోదావరినది మెత్తని యిసుకలో నడుస్తున్నపుడు అరవింద్‌తో మెల్లిగా అంది లత.

"అరవింద్! విక్రాంత్ వాళ్ళ అమ్మనూ, సావిత్రినీ చూస్తుంటే అది మా యిల్లులాగే ఉంది. నా సోషల్ బ్యాగ్రౌండుకూ, నా అభిరుచులకూ విక్రాంతే మంచి మ్యాచ్ అన్పిస్తోంది" సాభిప్రాయంగా చూసింది.

అరవింద్ అవాక్కయ్యాడు. తాను ఆలస్యం చేశాడా? అని మదనపడిపోయాడు.

"విక్రాంత్‌కు తెల్సా నీ ప్రేమ?" అడిగాడు అరవింద్.

లత నవ్వుతూ అంది.

"అతనెలా ఊహిస్తాడు? నేను నిన్ను ప్రేమిస్తున్నట్టు అతనికి తెల్సు. అంతే."

"నా మీద అలిగి మనస్సు మార్చుకున్నావా లతా!" అన్నాడు అరవింద్ ఉండబట్టలేక.

అరవింద్ లోలోపల ఏదో తెలియని బాధ చీకటిలా పరుచుకుంటోంది.

"అరవింద్! అలా బాధపడకు. ఉన్నతంగా ఆశించడం ఎవరికైనా సహజమే. అనుభవించగలిగిన స్తోమత, విశ్వాసం ఉన్నపుడే ఆశించింది అందినపుడు సుఖపడడం సాధ్యం."

"ఏంటి లతా! ఇవాళేదో తత్వశాస్త్రం చెపుతున్నావు" అన్నాడు అరవింద్ మనస్సులోని బాధను అదిమిపెట్టుకొని.

"తత్వశాస్త్రం కాదు అరవింద్! జీవిత శాస్త్రం. సోషల్ సైన్సు యిది. మొన్న మా యింట్లో జరిగిన గొడవ నా అవగాహనను మార్చింది."

అరవింద్ డీలాపడిపోయాడు. మనసంతా శూన్యం అయిపోయింది. ఏం మాట్లాడాలో తోచలేదు. అలవాటుగా కాళ్ళీడుస్తూ వారి వెనుక నడిచాడు.

ఎవరికి చెప్పుకోలేని వేదన... రాధ... సావిత్రి... లత... నిర్మల... ఎవరూ తన ప్రమేయం లేకుండానే తనకు దూరమైపోయారు. నదీప్రవాహ అందాల్ని చూస్తున్న ఆనందంలో ఎవరూ అరవింద్ మూడ్‌ను గమనించలేదు.

అందరు స్నానాలకోసం కేరింతలు కొడుతూ నది అంచున నీళ్ళతో ఆడుకుంటున్నారు. కొందరు బట్టలు ఉతుక్కుంటున్నారు. కొందరు ఏవో తెప్పలు తీస్తున్నారు. కొందరు బ్రాహ్మణులు చితా భస్మాలను గోదావరిలో ఎలా కలుపాలో చెప్తూ ఏవేవో మంత్రాలు చదువుతున్నారు. గోదావరి నుండి చూస్తే ఒడ్డున ఉన్న దత్తాత్రేయ మందిరం ఎంతో ఎత్తున పర్వతం మీద ఉన్నట్టు కనపడుతోంది. లేత నీలి, ఆకుపచ్చ రంగులో గోదావరి నది నీళ్ళు ఎక్కడినుంచో గల గలా జలపాతంలా సవ్వడి చేస్తూ ప్రవహిస్తున్నాయి.

లత, సావిత్రి గోదావరిలో కాస్త కిందికి స్నానం కోసం దిగారు. మోకాలి లోతు నీళ్ళల్లో కూర్చుని నీళ్ళు చల్లుకుంటూ అదే లోతని భయపడుతున్నారు. నీటి వేగం కాళ్ళ కింది యిసకను తొలగిస్తున్నకొద్దీ కొట్టుకుపోతున్నట్టు భయం.

విక్రాంత్ నదిలో కాస్త ఎగువన స్నానం చేస్తున్నాడు. అక్కడినుంచి అరవింద్ ఈదుకుంటూ ముందుకు సాగాడు.

"అటు వెళ్ళొద్దు. కొట్టుకుపోతారు" అని ఒడ్డునించి కొందరి అరుపులు వినపడ్డాయి.



అరవింద్ అప్పటికే నీళ్ళల్లో మునకలేస్తున్నాడు.

స్నానం చేస్తున్న స్థానికులు నలుగురైదుగురు గబగబా అటుకేసి ఈది అరవింద్‌ని రక్షించి ఒడ్డుకు చేర్చారు.

అరవింద్ ఆత్మహత్య చేసుకోవాలనుకున్నాడా అని లత మనస్సు పీకింది. ఎవరికీ చెప్పలేదు.

అలా ఆనందం విషాదంగా ముగిసింది.



లత విషయంలో దెబ్బతిన్న అరవింద్ ఆ విషాదం నుండి చాలా రోజులు కోలుకోలేదు.

అమెరికా అల్లుడు రాలేక రాధ పెళ్ళి వాయిదా పడింది.

ఎన్నో రాత్రులు తెగ బాధపడ్డ అరవింద్ మామూలైపోయాడు.

రాధ పెళ్ళినాటికి విక్రాంత్ ఫుల్ టైమ్ లెక్చరయ్యాడు.

రాధ పెళ్లికి భారీ ఏర్పాట్లు జరిగాయి.

లత అటుఇటు పరిగెడుతున్నది. కొత్త పట్టుచీరలో ఆమె మెరిసిపోతున్నది.

అరవింద్‌ని చూసి "హాయ్" అని విష్ చేసింది.

"హాయ్, అసలు పెళ్ళికూతురు రాధో-నువ్వో అర్థ కావడం లేదు. నీ హడావిడీ ఆనందం చూస్తుంటే" అంటూ నవ్వుతూ పలకరించాడు అరవింద్.

"విక్రాంత్! ఆరోజు లతను నువ్వు ఫెమినిస్టు అనుకొన్న అప్పటి ప్యాంటు షర్టు డ్రెస్సుకు ఇప్పటి డ్రెస్సుకు పోలికే లేదు గదా." అన్నాడు అరవింద్ లతను ఉడికిస్తూ.

"ఈ పట్టుచీర నేను కొనలేదు. నేను పెళ్లికి రానంటే రాధవాళ్ళ మమ్మి ఈ కొత్త చీర కొనిచ్చింది." సిగ్గుగా అంది లత.

అసందర్భ చర్చకు ఆశ్చర్యపోయి అరవింద్‌ను ఎగాదిగా చూశాడు విక్రాంత్.

గుసగుసగా అడిగాడు విక్రాంత్.

"రాధ మీది కోపంతో యిక్కడే యిదే పందిట్లో లతను పెళ్ళాడతావా ఏమిటి?"

"ఆ మాట నువ్వు చెప్పాలి" అంటూ అర్థోక్తిగా నవ్వాడు అరవింద్.

విక్రాంత్ అయోమయం చూసి లత నవ్వుతోంది.

"నేను రాధను లైక్ చేస్తున్నానని అలిగి లత నన్ను ప్రేమించడం మానేసింది. నీలాంటి వాళ్ళంటే చాలా ఇష్టం అంది లత. మరి యీ పందిట్లోనే పెళ్ళి చేసుకుంటారా!"

విక్రాంత్ ఏమంటాడో అనే ఆందోళన ఓవైపు, ఆసక్తి ఓవైపు... అతన్నే గమనిస్తోంది లత.

"సావిత్రి పెళ్ళయ్యేదాక నేను పెళ్ళి చేసుకోను అని నీకు తెల్సుకద బావా!" అన్నాడు విక్రాంత్ గర్వంగా అరవిందకేసి చూస్తూ.

సగం అంగీకారం లభించినట్టయి లత ముఖం ఆనందంతో విరబూసింది. కాస్త ధైర్యం వచ్చింది. నవ్వుతూ కలుగజేసుకొని అంది.

"ఆమాట అరవింద్ చెప్పాడు విక్రాంత్. ఆ నిర్ణయంతో మీపై నాకు యింకా గౌరవం పెరిగింది. ఆమె పెళ్ళికి ఒక్కచేతి సంపాదన కన్నా రెండు చేతులు కలిస్తే బాగుంటుంది కదా. జగిత్యాలకు వచ్చినపుడు సావిత్రితోటి, అత్తమ్మతోటికూడా చెప్పిన. నీకు చెప్పలేదా?" ఆశ్చర్యంగా అడిగింది లత.

"నాకు ఎవరు చెప్పలేదు. యిప్పుడే నీ ద్వారానే తెల్సింది. నువ్వు చెప్పకుండా వాళ్ళే ముందు ఎందుకుచెప్తారు? నాకు ఆలోచించుకోవడానికి కాస్త టైం కావాలి" అంటూ అబద్ధమాడాడు విక్రాంత్. లత కళ్ళల్లో కళ్ళు కలిపాడు విక్రాంత్. ఇద్దరిలో ఏదో ఉత్తేజం.

అరవింద్‌కు పెళ్ళి పందిట్లో యిదంతా ఆసక్తికరంగా ఉంది.

అరవింద్ ఆలోచిస్తున్నాడు విక్రాంత్‌కు ఎంత టైం కావాలో అని. తన పెళ్ళయ్యేదాకనా! లేక సావిత్రి పెళ్ళయ్యేదాకనా?

"అరె కాంత్! తమ్ముడు ఆనంద్‌కు సావిత్రిని ఇచ్చి పెళ్ళిచేస్తే ఎలా ఉంటుంది." అడిగాడు అరవింద్.

విక్రాంత్ మాట్లాలేదు. అమ్మ ఆమాట ఇదివరకే చెప్పివుంది. బాగానే ఉంటుందని అతని కళ్ళు చెప్తున్నాయి. కాని సావిత్రిని చేసుకుంటాడేమో అని ఆశ కల్గించిన అరవింద్ చూపిన పరిష్కారానికి ఆశ్చర్యపోయాడు. ఆనక నవ్వొచ్చింది.



"ఈ ప్రతిపాదన నాదికాదురా! అమ్మది. సావిత్రికూడా ఒప్పుకుందట."

"అరవింద్! డాక్టర్లకు యింజనీర్లకు సోషల్ సైన్సెస్ తెలియవు అనుకున్నాను యింతకాలం. కాని నువ్వు సామాజిక అర్థశాస్త్రంతో పాటు బతుకు శాస్త్రం కూడా బాగా చదివినావు. మరి మెడికల్ షాపుతో పాటు ఎక్స్‌రే యూనిట్ కూడా మీ తమ్మునికే యివ్వాలి. కట్నం కింద వాటికి పెట్టుబడి మేమే పెడ్తాంలే" ఏమంటావన్నట్టు లత కేసి చూశాడు విక్రాంత్.

"ష్యూర్!" అంటూ లత విక్రాంత్ చేతిలో చేయికలిపింది.



ఏళ్ళు గడిచాయి. అరవింద్ జగిత్యాల్లో తహసీల్ చౌరస్తా సమీపంలో హాస్పిటల్ ప్రారంభించాడు. స్థానికుడు కావడంతో ప్రాక్టీసు తొందరగానే వేగం పుంజుకుంది.

ఆనంద్‌తో సావిత్రికి పెళ్ళయాక తనపై తల్లి దండ్రులు పెళ్ళి చేసుకోవాలని ఒత్తిడి కాస్త తగ్గించారు. లత విక్రాంత్‌ల పెళ్లి సాదాగా జరిగిపోయింది. పెళ్లి రిజిస్ట్రేషన్‌కూడా చేసుకున్నారు.

అరవింద్‌కు హాస్పిటల్‌లో పిల్లల స్పెషలిస్ట్ అవసరం ఎంతో ఉందనిపించింది. నిజామాబాద్‌కు చెందిన అరుణ పిల్లల స్పెషలిస్ట్‌గా హాస్పటల్‌లో చేరింది. ఆమె ఆ యింట్లో పూర్తిగా కలిసిపోయింది. అరుణ అరవింద్‌ల పెళ్లి త్వరలో జరుగుతుందని అందరు అనుకుంటున్నారు.

అరవింద్ చాలామంచి డాక్టర్ అని పేరొస్తూ పేషంట్లరాక పెరుగుతున్న కొద్దీ ఇంటిల్లిపాదికీ సంతోషంగా ఉంది.

తల్లి దేవక్క ఊరకే ఉండలేక కోడలు సావిత్రికి బీడీలు చేయడంలో సహకరిస్తోంది.

ఇక అరవింద్ అరుణను పెళ్ళి చేసుకుంటే నిశ్చింతగా గడపొచ్చు అని తల్లిదండ్రుల ఆరాటం.

చంద్రయ్య మగ్గం నేయడం మానేసి ఇపుడు చిన్నకొడుకు ఆనంద్‌తో పాటు మెడికల్ షాపులో కూర్చుంటున్నాడు.

ఏదో ఆపరేషన్ చేసి రాత్రి తొమ్మిది దాటాక యింటికి చేరాడు అరవింద్. అందరూ అతని కోసమే ఎదురుచూస్తున్నట్టు కూర్చున్నారు.

దేవక్క అందరికీ భోజనం వడ్డించింది. ఆదాయం పెరిగినా భోజనంలో పెద్ద మార్పేమీ లేదు. అన్నం, పప్పు, ఒక కూరగాయ, కాస్త పెరుగు.

"అరుణ మన యింట్ల కల్సిపోయినట్టు ఉంటది. అరుణ గురించి నీ అభిప్రాయం ఏందిరా? నీకు లగ్గమైతే యిగ మాకు నిశ్చింత" అంది దేవక్క.

"అరుణది మన కులం గాదే" ఏమంటుందోనని నవ్వుతూ అమ్మకేసి చూస్తూ అన్నాడు అరవింద్.

"యాడాదాయె పని చేయపట్టి. గాయింత తెల్వదార నాకు" అంది దేవక్క.

"అమ్మకు, నాన్నకు ఆ వివరాలన్నీ తెల్సున్నా" అన్నాడు తమ్ముడు ఆనంద్.

"ఈ కాలంల కులం ఎవలు చూస్తున్నర? కాంతయ్య లతను చేసుకోలేదా? ఎంతో మంది డాక్టర్లు వేరే కులపోల్లను చేసుకున్నరని నువ్వే ఎన్నో సార్లు చెప్తివి గదర" అన్నాడు తండ్రి చంద్రయ్య.

అమ్మానాన్నలకిష్టమైందంటే అరుణ తాననుకున్నదానికన్నా ఎక్కువగా యింట్లో కల్సిపోయిందన్న మాట. చిల్డ్రెన్ స్పెషలిస్టు అరుణలో ఎంత వినయం. అయినా తనకు తాను బయటపడకుండా అన్నాడు అరవింద్.

"అయితే అమ్మా! అందరూ కూడబలుక్కున్నారా?"

"నీతోని పెండ్లి జోలి తీసుడే భయమాయె. అరుణ వచ్చిన నాలుగు నెలలకే అనుకువైన పిల్ల అన్పించింది. మన కులం పిల్ల అంత సదువుతే ఎంత నీలుగుడో. డిగ్రీ సదువుతెనే నిర్మలకు ఎంత నీలుగుడు ఉండెనో నీకెరుకలేదా?"

"ఆమె మనస్సేందో తెల్సుకోకుండా గాలి మేడలు కట్టకున్రి" అన్నాడు అరవింద్.

"ఆడపిల్ల నోరిడిసి చెప్తదారా? యాడాది నుంచి ఆ పిల్లను చూస్తున్న. గాయింత తెల్వదా?"

"అమ్మా! వాళ్ళ కల్చర్ వేరు. మన కల్చర్ వేరు. మనది పని చేసికొని బతికే సంస్కృతి. మనది పనిని గౌరవించే సంస్కృతి. అందుకే నేను వద్దన్నా! డాక్టరు తల్లివైనా నువ్వూ, మరదలు ఇప్పటికీ బీడీలు చేస్తున్నారు. ఊరికే ఎందుకుండాలనే తత్వం మీది. ఒకరు పని చేస్తే అందరు కూర్చుని తినే సంస్కృతి వాల్లది. వాల్లకు బీడీలు చేయడమన్నా, పని అన్నా అగౌరవం, చిన్నచూపు. కులం, వంశ ప్రతిష్ట అంటూ బాగా అహంకారాలకు పోయే తత్వం వారిది. మరోసారి ఆలోచించుకోన్రి." తన మనసులోని మాట బయట పడకుండా గంభీరంగా అన్నాడు అరవింద్.



"మన యింటికి వచ్చే పిల్ల మనకు ముఖ్యం. పిల్ల మంచిది. ఆమె కులంతోని వాల్ల తత్వాలతోని ఏం పనిరా. మీరిద్దరు డాక్టర్లు కల్సి పని చేస్తే యింకో పది మంది మీతోని దావఖాన్ల బతుకుతరు గదర!" ప్రేమగా అంది దేవక్క.

కన్నతల్లి కూడా ప్రేమ, పెళ్ళిని పక్కా వ్యాపార దృష్టితోనే చూడ్డం అరవింద్‌కు కాస్త కష్టం వేసింది. తాను కూడా యిలాగే ఆలోచించాడని గుర్తొచ్చి కొరడాతో కొట్టినట్టు ఒళ్ళు జలదరించింది.

అలా చర్చ సాగి సాగి ముగిసింది.

మూడో రోజుకు అరవింద్ మౌనంగా అంగీకరించాడని దేవక్క ద్వారా తెల్సిన అరుణ "అంతా మీ ఆశీర్వచనం అత్తమ్మా" అంటూ పాదాభివందనం చేసింది.

దేవక్క హృదయం కాబోయే కోడలి పట్ల ప్రేమతో నిండిపోయింది. ప్రేమగా లేవదీసి గుండెకు హత్తుకుంది.

అరవింద్ చొరవ తీసుకోవాలని అరుణ ఆశిస్తోంది.

అరవింద్‌లో మార్పు లేదు.

లోలోపల కలలు కంటూ మనస్సులోనే డ్యూయట్లు పాడుకుంటున్నాడు అరవింద్. అరుణ కూడా అదే పనిలో ఉంది.

వారం తర్వాత నిజామాబాద్‌లోని సొంతింటికెళ్ళిన అరుణ ఉత్సాహంతో అరవింద్ విషయం తల్లి చెవిన వేసింది. ఆమె భర్త చెవిన వేసింది.

అరుణ తండ్రి దయాకర్ రావు ఏదీ చెప్పలేదు. ఆర్థికంగా, వృత్తిపరంగా మంచి సంబంధం అనిపిస్తోంది. కాని కులపరంగా, సాంఘిక హోదా పరంగా వాళ్ళకీయడం చిన్నతనంగా ఉంది.

"నువ్వు సొంతంగా యిక్కడే ప్రాక్టీసు మొదలుపెట్టు. పెళ్ళి సంగతి తర్వాత చూద్దాం. ముందు పది రోజుల్దాకా రాలేనని ఫోన్లో చెప్పేయి" అన్నాడు తండ్రి దయాకర్ రావు.

తండ్రి అంటే ప్రేమతో పాటు భయం ఉన్న అరుణ విలవిలలాడిపోయింది. పదిరోజులు అరవింద్‌ను చూడకుండా ఉండాలా? రాత్రీ పగలూ పేషంట్లతో బిజీగా ఉండడం అలవాటైన తనకు పది రోజులు ఎంత బోర్.

"దేవక్క అత్తమ్మ ఫోన్ చేస్తే ఏమని చెప్పాలె నాన్నా? ఆరోగ్యం బాగులేదని చెప్తే కారేసుకుని అత్తమ్మా, అరవింద్ అందరూ ఇక్కడికి పరిగెత్తుకొస్తే ఎట్లా నాన్నా?" అంటూ అమాయకంగా అడిగింది అరుణ.

"ఇక్కడే క్లినిక్ ఓపెన్ చేస్తున్నా అని చెప్పెయ్యి" అంటూ ఇంట్లోంచి ఏదో పని ఉన్నవాడిలా బయటకు నడిచాడు దయాకర్ రావు.

అరుణకు ఏం చేయాలో తోచక తల్లి దగ్గర కన్నీళ్ళు పెట్టుకుంది.

వారం తర్వాత దయాకర్ రావు యింట్లో తుఫాన్ రేపాడు.

"అరవింద్‌కు ఒకరు కాదు యిద్దరు లవర్‌లున్నారట. ఒకామె రాధ. అమెరికా పోయిందట. మరొకామె లత. విక్రాంత్‌ని పెళ్ళి చేసుకుని కూడా అరవింద్‌తో ప్రేమాయణం సాగిస్తోందట. ఇలాంటి వాడినా నువ్వు ప్రేమించింది?"

"డాడీ! అరవింద్ అలాంటివాడు కాదు. గిట్టనివాళ్ళెవరో మీకు చెప్పి ఉంటారు."

"అరుణా! నీవు చిన్నపిల్లవేమీ కాదు. కాని ప్రేమ గుడ్డిది. నీకు తెలియని విషయాలెన్నో ఉన్నాయి. మరదలు సావిత్రిక్కూడా అతడు అలవాటని అన్నారు. కాని నేనామాట నమ్మలేదనుకో."

"ఛఛ! ఏం మాట్లాడుతున్నారు డాడీ? మెడికల్ ప్రాక్టీసు పోటీలో చాతగాని వాళ్ళెవరో క్యారెక్టర్ మీద ఇలాంటి అభాండాలు వేసి ఉంటారు డాడీ!" ఉక్రోశంగా అంది అరుణ.

అరుణ తల్లి ఏది వాస్తవమో తేల్చుకోలేక ఆలోచనలో పడిపోయింది.



రాధ జీవితం అనుకున్నట్టుగా సాగలేదు. అమెరికాలోనే స్థిరపడుదామనుకున్న రాధ ఇండియాకు వచ్చేసింది. వి.యల్.కాంట్ అకస్మాత్‌గా పోవడంతో మనస్సు బాగలేక హైద్రాబాద్ చేరింది. హైద్రాబాద్ చేరాక తిరిగి అమెరికాకు వెళ్ళాలనే ఆలోచనే మానుకుంది.

న్యూయార్కు నుండి రాధ హైద్రాబాద్ వచ్చిందని కరీంనగర్‌లో ప్రాక్టీస్ చేస్తున్న లతకు తెల్సి వారంపైనే అయింది. కరీంనగర్ నుండి సిటీకి వెళ్ళడం వీలుచిక్కలేదు. తనకు వీలు చిక్కాక విక్రాంత్ వెంట రాలేక పోవడం ఏదో వెలితిగా ఉంది.



ఆరేళ్ళ తర్వాత కల్సుకోబోతున్న క్లాసుమేటు రాధను ఇద్దరం కల్సి వెళ్ళి పలకరిస్తేనే బావుంటుందనుకుంది లత. మళ్ళీ ఎపుడు వీలవుతుందో అని ఒక్కర్తే మూడేళ్ళ పాపను తీసుకొని కారులో బయల్దేరింది.

హైద్రాబాద్‌లోని దిల్‌సుఖ్‌నగర్‌కు మలుపు తిరిగి ఎంతో ఉత్సాహంగా యిల్లు చేరేసరికి రాధ లేదు. ఎటో వెళ్ళింది. లతకు ఒక్కసారిగా నీరసం ముంచుకొచ్చింది. పనిమనిషి మంచి నీళ్ళచ్చి టీ తీసుకు వచ్చింది. లత టీ తాగుతూ ఆ యింట్లో ఆరేళ్ళలో వచ్చిన మార్పుల్ని గమనిస్తోంది. పదేళ్ళ క్రితం ఫ్యాషన్‌గా ఉండిన నాటి అలంకరణ పెద్దగా మారలేదు. అదే ఇపుడు క్లాసిక్‌గా కనపడుతోంది. మనిషి దృష్టి ఎంతలో ఎంత మారుతుంది అని ఆశ్చర్యపోయింది లత.

సత్తయ్య రావడం చూసి గుర్తుపట్టింది లత.

"నమస్కారం అంకుల్! బావున్నారా" అంటూ విష్ చేసింది లత.

కమర్షియల్ టాక్స్ డిప్యూటీ కమిషనర్‌గా రిటైరైనా ఆ హుందాతనం అలాగే ఉంది. పైగా వయసుతో పాటు మరింత పెరిగిందనుకుంది లత.

ప్రతి నమస్కారం చేసి లతను గుర్తుకు తెచ్చుకునే ప్రయత్నం చేశాడు సత్తయ్య. అది గమనించి తనను తాను పరిచయం చేసుకుంది లత.

"నన్ను గుర్తు పట్టలేదా అంకుల్! లతను, రాధ క్లాసుమేట్‌ను. ఈ యింట్లో ఒక కోరస్ పాట మీద డ్యాన్సు ప్రాక్టీస్ చేశాం. చాలాసార్లు మీ యింట్లో భోంచేశాను. నాకు మంచి డ్రెస్సు లేదు. ఈ పాత డ్రెస్సులో రాధతో నీ పెళ్ళికి రాలేను అంటే ఆంటీ కొత్త పట్టుచీర కొనియిచ్చింది. గుర్తుందాండి." నవ్వింది లత.

లత కూతురు నవ్య ఆసక్తిగా యిల్లంతా పరిశీలిస్తూ అవీ యివీ ముట్టి చూస్తోంది.

సత్తయ్య ముహంలో బల్బు వెలిగింది. అంతా గుర్తొచ్చి నవ్వాడు.

"నీ పేరు లత కదూ! విక్రాంత్ అనే లెక్చరర్‌ను ఆదర్శ వివాహం చేసుకొన్నావు. ఎలా వుంది నీ ప్రాక్టీసు? ఉద్యోగంలో గాని జాయినయ్యావా? ఎంతమంది పిల్లలు?"

"ఒక్కతే పాపండి. అక్కడికి ఆపేద్దాం అని ఉంది. సెకండ్ థాట్‌కి ఇంకో రెండేళ్ళు అవకాశం యిద్దాం. అప్పటికీ ఒక్కరే చాలనిపిస్తే ఆపరేషన్ చేసుకోవచ్చు

అని అనుకున్నామండి" అంది లత.

పెద్దాయనతో మాట్లాడ్డం లతకు కాస్త బెరుకుగానే ఉంది.

"మీ ప్రాక్టీసు బాగా నడుస్తోందా?" మళ్ళీ అడిగాడు సత్తయ్య యింకేం అడగాలో తోచక.

"ప్రాక్టీసు బాగా పికప్ అయింది. అర్ధరాత్రిల్లు కూడా నిద్ర లేపి పిలుస్తారు. అపుడపుడు విసుగనిపిస్తుంది రెస్టు దొరక్క. యిపుడు సిటీలో ఉన్న వైద్య సదుపాయాలన్నీ కరీంనగర్‌లోనే దొరుకుతున్నాయి."

"దట్స్ గుడ్! కంగ్రాచ్యులేషన్స్!" అన్నాడు గంభీరంగా సత్తయ్య.

కాసేపు యిద్దరి మధ్యా నిశ్శబ్దం. ఆ నిశ్శబ్దాన్ని తొలగిస్తూ అడిగింది లత.

"రాధ లేదా అంకుల్? ఎటు వెళ్ళింది? ఎపుడొస్తుంది? నేను ఫోన్ చేస్తే ఈ వేళకు యింట్లోనే ఉంటారని ఎవరో చెప్పారు."

సత్తయ్య ముఖంలో విషాదం అలుముకుంది. గోడకున్న ఏదో ఫోటో కేసి చూస్తూ చెప్పాడు సత్తయ్య.

"ఎవరైనా పాత స్నేహితులొస్తున్నారని తెలిస్తే ఒకసారి ఉంటుంది. ఒక్కోసారి ఉండి ఉండి సమయానికి ఎటో వెళ్ళిపోతుంది. స్టేట్స్‌కి మళ్ళీ వెళ్ళడం లేదని మీదాకా తెల్సిందనే అనుకుంటాను" అంటూ మళ్ళీ అదే ఫోటో కేసి చూశాడు సత్తయ్య.

లత చూచాయగా విన్నది గుర్తుంది. స్టేట్స్‌లో పాప పుట్టాక రాధ భర్తను కోల్పోయింది. వి.యల్.కాంట్‌ది యాక్సిడెంటన్నారు. కాని యాక్సిడెంటో, హత్యో స్పష్టం కాలేదు. మొదట రాధ పాపతో అక్కడే ఉందామనుకుంది. భర్తతో గడిపిన జ్ఞాపకాలు ఆమెను ఉక్కిరి బిక్కిరి చేసేవి. వాతావరణం మార్పిడి కోసం ఇండియా వచ్చింది. ఇక్కడికి వచ్చాక నిర్ణయం మార్చుకుంది. శాశ్వతంగా యిక ఇండియాలోనే ఉండిపోదల్చుకుంది. ఇంతవరకు తెల్సు తనకు. పాపతో యిలాగే ఉండిపోతుందా? మళ్ళీ పెళ్ళి చేసుకుంటుందా? వగైరా వివరాలేమీ తెలియవు.

"అరవింద్ ఏం చేస్తున్నాడు, ఎక్కడున్నాడు?" ఏదో గుర్తొచ్చి అడిగాడు సత్తయ్య.

"అరవింద్ యం.ఎస్. జనరల్ సర్జన్ చేశాడు. జగిత్యాల్లో ప్రాక్టీసు బాగా నడుస్తోంది. పెద్ద హాస్పిటలే ఓపెన్ చేశాడు" అంది లత.



అరవింద్, రాధ ఎంతో గాఢంగా ప్రేమించుకున్నారు. ఆ విషయం సత్తయ్యకు తెల్సు.

అరవింద్ చాలా పేదవాడని, తండ్రి నేత పని చేస్తూ అప్పు చేసి చదివిస్తే చదువుకుంటున్న కుర్రాడని తెల్సిన సత్తయ్య తన కూతురుకు ఈ సంబంధం తప్పించాలనుకున్నాడు.

"లతా! అరవింద్‌కూ నీకూ పెళ్ళి కుదిరితే ఎంత చక్కని మ్యాచ్" అని అప్పట్లో మెచ్చుకున్నాడీయన.

స్టేట్స్‌లో కార్డియాలజిస్టుగా సెటిలైన వి.యల్.కాంట్ సంబంధం చూసి రాధను ఒప్పించింది ఈయనే. అయితే అరవింద్ గురించి యిపుడెందుకు ప్రస్తావించినట్టు? అర్థం కాక విస్తుపోయింది లత.

"అరవింద్‌కెంత మంది పిల్లలు?" మళ్ళీ అడిగాడు సత్తయ్య.

"అరవింద్‌కింకా పెళ్ళి కాలేదండి."

"అరే! ఇంతకాలం నుండి యింకా పెళ్ళి చేసుకోలేదా!" ఆశ్చర్యపోయాడు సత్తయ్య. ఆలోచనలో పడ్డాడతను.

చేసేదంతా చేసి ప్రేమికుల్ని విడదీసి ఏమీ తెలియనట్టు అడుగుతున్న అతన్ని చూస్తుంటే లతకు కోపం వచ్చింది. తనను తాను అదుపులోకి తెచ్చుకొని సౌమ్యంగా అంది లత.

"భగ్న ప్రేమికుడు కదా అంకుల్! అతను ఎవర్ని మెచ్చట్లేదు" అంటూ బలవంతంగా నవ్వింది లత.

అదీ యిదీ పిచ్చాపాటి మాట్లాడి టైం చూసుకుంది లత. రాధ యిక రాదని నిశ్చయించుకొంది లత.

"మరి వెళ్తానంకుల్. నేను వచ్చి వెళ్ళానని చెప్పండి వస్తాను" అంటూ పాపను తీసుకొని సెలవు తీసుకుంది లత.



కరీంనగర్‌లో బిజీ డాక్టర్‌గా మారిన లత రాధ గురించి ఏదో గుర్తొచ్చి అకస్మాత్తుగా అరవింద్‌కు పలకరింపుగా ఫోన్ చేసింది.

"హలో అరవింద్! నేను లతను మాట్లాడుతున్నాను. ఇండియన్ మెడికల్ అసోసియేషన్ నేషనల్ సెమినార్‌లో మీరేదో పేపర్ సమర్పిస్తున్నారట,

కంగ్రాచ్యులేషన్స్" అంది ఫోన్లో లత.

"ఎవరన్నారు?" నవ్వుతూ అన్నాడు అరవింద్.

"ఇంకెవరు విక్రాంత్ చెప్పాడు. నిజమే కదా! అద్వాన్సు కంగ్రాచ్యులేషన్స్! ఇంతకూ మీ సెమినార్ పత్రం సారాంశం తెల్సుకోవచ్చా? ఇఫ్ యూ హావ్ నో అబ్జక్షన్" నవ్వుతూ అంది లత.

"థాంక్స్ లతా! భారతీయ సంప్రదాయిక శస్త్రచికిత్స విధానాలు, వైద్య పద్ధతి – వర్తమాన అవసరాల్లో వాటి పాత్ర, అభివృద్ధి" అన్నాడు అరవింద్.

"అద్భుతమైన టాపిక్. మీ పేపర్ పెద్ద సంచలనం సృష్టిస్తుందనుకుంటాను. గడ్డలు కోసే మంగలివాళ్ళ వైద్యం గురించి, చీరుకుపోతే పెట్టే నల్లాలం పసరు, వంటి నాటు వైద్యాల్ని గురించి కూడా మీ పేపర్లో చర్చిస్తారా?"

"వై నాట్! తప్పకుండా. నా లక్ష్యం కూడా అదే. వేల ఏళ్ళుగా భారతీయులు యుద్ధాల్లో, యాక్సిడెంట్లలో ఉపయోగించిన వైద్యం, శస్త్ర చికిత్స విధానాలు – వాటి మంచి చెడ్డలు అన్నీ చర్చిస్తున్నాను. దానివల్ల ఆనాటి ప్రజల ఆరోగ్య స్థాయి, జీవన ప్రమాణాలు, అవగాహన కూడా తెల్సి వస్తాయి" అన్నాడు ఉత్సాహంగా.

"ఇలాంటి టాపిక్ మీద నీ దృష్టి ఎలా పడింది."

"మా తాత అంటే మా తల్లి తండ్రి గొప్ప ఆయుర్వేద వైద్యుడు. నిజాం రాష్ట్రంలో యాభయి ఏళ్ళ క్రితం దాకా ఏడు వేల మంది ప్రభుత్వ గుర్తింపు పొందిన ఆర్.యం.పి. ఆయుర్వేద వైద్యుల్లో ఆరువేల మంది పద్మశాలీలే. అలోపతి వైద్యం ప్రాచుర్యంలోకి రావడంతో వాళ్ళ ప్రాక్టీసు పడిపోయింది. బతుకు చితికిపోయింది. అందులో మా తాత కుటుంబం ఒకటి. బట్టల మిల్లులొచ్చి పద్మశాలీల కులవృత్తిని దెబ్బ తీసాయి. బతుకుదెరువు కరువైంది. అలోపతి వచ్చి దెబ్బదీసింది కూడా పద్మశాలీల బతుకుల్నే. వాళ్ళ బతుకులు శిథిలమై మన బతుకులు బాగుపడుతున్నాయి. మన పూర్వీకుల వారసత్వ వైద్య సంపదను వెలికి తీసి తిరిగి ప్రజల పరం చేయాలన్నది నా సెంటిమెంటు. ఇవన్నీ విక్రాంత్ నీకు చెప్పే ఉండాల్నే?"

"అతను చెప్తేనే గదా తెల్సింది. నిజాం రాష్ట్ర రాజవైద్యుడు హకీం నారాయణ దాసు రాధ అమ్మమ్మకు అన్నయ్యవుతాడట గదా!"

"భలే తెల్సుకున్నావే?" నవ్వాడు అరవింద్.



"థాంక్స్! అన్నట్టు సత్తయ్య అంకుల్ గుర్తున్నాడా? ఈ మధ్య నిన్ను ఫోన్లో చాలాసార్లు గుర్తు చేశాడు. రాధతో నీ ప్రేమను కట్ చేసిందానికి ఇప్పుడు పశ్చాత్తాపపడుతున్నట్టున్నాడు. నువ్వు రాధను పలకరించి రావడానికి వెళ్తానంటూ ముఖం చాటు వేస్తున్నావేంటి?"

"అదేం లేదు లతా! అర్జంటు కేసుల్తో బిజీ. జనరల్ మెడిసిన్ వాళ్ళకు లాగా సర్జన్లకు టైం మన చేతిలో ఉండదని నీకు తెలియదా? గైనకాలజిస్టువి. ప్రసూతులు, ఆపరేషన్లతో నీకూ అంతేగా!'

"అవుననుకో. కాని రాధ ఇండియా వచ్చి రెండు నెలలైపోయింది. ఒక్కసారైనా కల్సి రావాల్సింది. బాధల్లో ఉన్నవారిని ఓదార్చడం బాధ్యత కదా!"

అరవింద్ ఊ కొడ్తూ మౌనం వహించాడు. ఏవేవో గుర్తొచ్చాయి.

ఏదో చెప్తామనుకుని "ఆ ఏం లేదు. మంచిది. యా.యా" ఆ టాపిక్ కట్ చేశాడు అరవింద్.

బాధ! ఎవరికి బాధ! ఆమె బాధల పట్లే స్పందించాలా? ఎదుటివారి బాధల పట్ల ఆమె స్పందించింది ఏపాటి? అమెరికానుండి తనకెపుడైనా ఫోన్ చేసిందా? తనను అసలు గుర్తుంచుకుందా? తనగురించి ఆమెకు బాధేమీ లేనపుడు ఆమె గురించి తాను బాధపడాలా! ఆమెను ఓదార్చాలట. కావచ్చు. కానీ తనని ఓదార్చాలని ఆమె ఏనాడూ అనుకోలేదే. డబ్బు హోదా పెరిగాక తనను అసలు మనిషిలా గుర్తించిందా? డబ్బు హోదా ఉన్నవాళ్ళకు కష్టాలొస్తే పేదలు మాత్రం స్నేహం అనీ, క్లాసుమేటు అనీ, రకరకాల పేర్లతో సాయం చేయాలా? చేసి చేసి తిరిగి వారు కోల్పోయిన సుఖాలను, హోదాలను సమకూర్చే సాధనాలై తాము సమిధలుగా మిగిలిపోవాలా?

లత ఏదేదో చెప్తుంటే ఊకొడ్తున్నవాడల్లా మళ్ళీ అడిగేసరికి ఏంటీ సరిగ్గా వినపడట్లేదు అన్నాడు అరవింద్.

"అది సరే గానీ మీ హాస్పటల్ అనస్థటీషియన్‌గా ఎవరొస్తున్నారు? అపుడపుడు అర్జంట్ కేసులకు నాక్కూడా కావాలి."

"లతా! నాక్కూడా కష్టంగా ఉంది. నాలుగు ప్రయివేటు హాస్పిటల్స్. ఒక్కడే అనస్థటీషియన్. చాలా యిబ్బందిగా ఉంది. వస్తానన్న టైంకు రాడు. అన్నీ రెడీ చేసి ఎదురుచూడ్డం. అటు పేషెంట్ల బంధువులకు టెన్షన్. ఇటు మనం చాలా రిస్కు ఫేస్ చేయాల్సివస్తోంది."

"రాధను పిలిస్తే ఎలా ఉంటుంది? కొత్త పరిసరాల్లో పడి కాస్త తేరుకుంటుంది. ఏమంటావు?"

అరవింద్ ఉలిక్కిపడ్డాడు. "ఏంటి రాధనా? నా హాస్పటల్‌లోనా?" ఎందుకో అరవింద్ గుండె లబ్‌డబ్‌మని కొట్టుకుంటూ వేగం హెచ్చింది.

"పర్మనెంటుగా కాదులే. కొద్దిరోజుల కోసం. విజిటింగ్ అనస్థటీషియన్‌గా అర్జంట్ కేసుల్లో పిలిపించుకోవచ్చు. కొంతకాలం రాధను మా యింట్లో ఉండుమని కోరుదామనుకుంటున్నాను. నీ అభిప్రాయం?"

"ముందు విక్రాంత్‌ని అడిగావా?"

"విక్రాంతే ఈ సూచన చేశాడు. నీ అభిప్రాయం కూడా కావాలి."

"నేను ఆలోచించి చెప్తాను. ముఖ్యంగా అమ్మానాన్నలను అడగాలి."

లత ఫోన్లో నవ్వింది. ఇందులో నవ్వడానికేముందో. పేదవాళ్ళయిన తమ అమ్మానాన్నలంటే లతక్కూడా యింత చిన్న చూపేమిటో అర్థం కాదు. అనుకున్నాడు అరవింద్.

"అరవింద్! రాధ మీ యింటి కోడలుగా రావట్లేదు. ఫ్రెండ్‌గా డాక్టరుగా వస్తుంది."

అరవింద్ యిబ్బందిగా ఫీలయ్యాడు. తన ప్రేమను నిరాకరించిన రాధను క్షమించాల్సిన స్థాయికి వచ్చాక ఎందుకో క్షమించలేకపోతున్నాడు. ఎపుడో లత అన్నట్టు యిది మగ అహంకారమా?

లత ఫోన్ పెట్టేశాక అరవింద్ తీవ్ర ఆలోచనలో పడ్డాడు. లత ఆలోచనలో వాస్తవికాంశం ఉండొచ్చు. కాని యిదే ప్రతిపాదన నిర్మల విషయంలో ఎందుకు చేయలేకపోయింది.

నిర్మల భర్త పోయి మూడేళ్ళవుతోంది. భర్త పోయినవాళ్ళను చేసుకోవాల్సి వస్తే నిర్మలనే చేసుకోవడం కనీస బాధ్యత. వాళ్ళ నాన్న నారాయణమామ పెట్టిన పెట్టుబడితోనే తాను మెడిసిన్ పూర్తి చేయగలిగాడు. నిర్మలను పెళ్లి చేసుకో అని అడిగితే అపుడు తాను అదే కట్నం యిచ్చి తమ్ముడికివ్వచ్చు గదా. ఆ కట్నంతో ఇంటర్ తప్పిన తమ్ముణ్ని షాపు పెట్టించి పెద్ద సేటును చేయచ్చు గదా అని అడిగాడు. నారాయణమామ అహం దెబ్బతిని నిర్మలకు మరీ తొందరపడి పెళ్ళి చేశాడు. నిజానికి అలా తొందరపడి ఉండకపోతే తాను నిర్మలను పెండ్లి చేసుకొనేవాడేమో. నారాయణమామ ఆ అవకాశం యివ్వలేదు.



నిర్మల భర్త మదన్ ఎంతో సిన్సియర్. అయితే మరీ యింత సెన్సిటివ్ అని అతను ఆత్మహత్య చేసుకునే దాకా ఎవరికీ తెలియదు. రెండుసార్లు అయ్యేయస్ పాసైనప్పటికీ యింటర్వ్యూలో కావాలని పడగొట్టారని కనీసం గ్రూప్ వన్ లో నైనా న్యాయం జరుగుతుందనుకుంటే అంతకన్నా హీనంగా పలుకుబడి, పైరవీలు. ఖచ్చితంగా వస్తుందనుకున్న గ్రూప్ వన్ కూడా మిస్సవడంతో తట్టుకోలేకపోయాడు. నిర్మల అయిదో నెల క్యారియింగ్ అనైనా చూడకుండా అర్థాంతరంగా నిష్క్రమించాడు. అదంతా గతం. ఇదంతా తెల్సిన లత నిర్మలక్కూడా ఒక కొత్త జీవితం యివ్వాలి అని యిన్నేళ్ళుగా ఎందుకు ప్రస్తావించలేకపోయింది?

ఈ ఆలోచనల్తో అరవింద్ మనస్సంతా వికలమైంది. ఎపుడూ కలవారి కష్టాలే కష్టాలుగా గుర్తొస్తాయా? పేదవారికి అవే కష్టాలు వస్తే గుర్తు రావా? ఫేర్ కాపీ రాస్తున్న సెమినార్ పేపర్‌ని మూడ్ చెడిపోయినట్టయి పక్కన పెట్టి లేచాడు అరవింద్.

అరుణని ఫోన్ చేసి అర్జంటుగా పిలిపించుకోవాలి అనుకున్నాడు అరవింద్. అరుణే ఫోనెత్తింది.

అరవింద్ కంఠం విని పులకించి పోయింది అరుణ.

నాన్న లేడు. ఇదే సరైన సమయం అని అమ్మకు చెప్పి వెంటనే బయల్దేరింది.

అరుణకు కాస్త యింగ్లీషు బాగా వచ్చు. ఏవేవి సంక్షిప్తం చేసి, ఏవి చర్చించాలో చెప్పి సెమినార్ పేపర్ ఫేర్ కాపీ చేయమని యిచ్చాడు అరవింద్. అరుణ రాకతో దేవక్క, చంద్రయ్య, ఆసుపత్రి సిబ్బంది, పేషెంట్లు, సావిత్రి ఎంతో సంతోషించారు.



లత విక్రాంత్‌లతో పాటు ఈసారి అరవింద్ రావడం సత్తయ్యకు సంతోషం కలిగించింది. అతనికి రాధ పట్ల గల ప్రేమను తేలికగా తీసుకొని అవమానించి పంపిన విషయం గుర్తొచ్చి సత్తయ్యకు అరవింద్‌తో మాట్లాడ్డానికి ముఖం చెల్లలేదు. అరవింద్ వెంట వచ్చిన అరుణను అతని శ్రీమతేమో అని ఆశ్చర్యంగా చూశాడు సత్తయ్య. రాధ కూడా అరుణను ఆసక్తిగా చూసింది.

లత అరుణను పరిచయం చేసింది.

"డాక్టర్ అరుణ చిల్డ్రెన్ స్పెషలిస్టు నిజామాబాద్ నేటివ్. ప్రస్తుతం జగిత్యాల్లో అరవింద్ హాస్పిటల్‌లో పనిచేస్తోంది."

రాధ అరుణను విష్ చేసింది. కుశల ప్రశ్నలయ్యాక ఊసుపోక కోసం అడిగాడు విక్రాంత్, "రాధా! అమెరికన్ లైఫ్ అద్భుతంగా ఉంటుందంటారు. ఆరేళ్ళలో మీకెలా అన్పించింది?"

అవన్నీ గుర్తు చేసికోవడం యిష్టంలేనట్టుగా విషాదంతో యిబ్బందిగా చూసింది రాధ. లత కూడా అడిగేసరికి వేదాంత ధోరణిలో అంది రాధ.

"ఎవరి కోసం బతుకుతున్నామో, ఎందుకోసం బతుకుతున్నామో ఆలోచించుకొనే టైం లేనంత వేగంగా అక్కడి జీవితం సాగుతుంది. ఎవరో అన్నట్టు అది యవ్వనకాల దేశం. జీవితంలోని మిగతా దశలకు అంతగా పనికి రాదు. ఆ వే ఆఫ్ లైఫ్‌ను, స్టాండర్డ్ ఆఫ్ లివింగ్‌ను తట్టుకోవడం కష్టం."

"అక్కడ కాంట్రాక్టు మ్యారేజెస్ ఉంటాయట గదా!" అరుణ అమాయకంగా అడిగింది.

"మన భారతీయుల్లో అలాంటివేమీ లేవు. మనవాళ్ళు అక్కడా కూడా యిలాగే ఉంటారు. విడాకులు సెకండ్ మ్యారేజి మాత్రం యిక్కడంత కష్టం కాదు. ఇక్కడంత తప్పూ కాదు."

"ఇక్కడ కూడా బిలో మిడిల్ క్లాసులో అవి మొదట్నుంచీ ఉన్నాయి. వాటిని వాళ్ళు ఎపుడూ తప్పుగా భావించలేదు. మా అమ్మకు నేను సెకండ్ మ్యారేజీ కూతుర్నని మీకు తెల్సుగా! అయితే ఈ మేన్ స్ట్రీం మీడియా సృష్టిస్తున్న సంస్కృతిని అడాప్ట్ చేసుకొని సాంస్క్రిటైజ్ అవుతూ యిప్పుడు తప్పని కొందరనుకుంటున్నారు. మరో వైపు ఫెమినిస్టులు దాన్ని వ్యతిరేకిస్తున్నారు. దీనికి బదులుగా మన పూర్వీకుల తల్లి సంస్కృతిని, మాతృస్వామిక వ్యవస్థని హైలైట్ చేస్తూ మేన్ స్ట్రీం కల్చర్‌గా మీడియాలో చూపించగలిగితే ఫెమినిజంకన్నా వంద రెట్లు శక్తితో అద్భుతాలు సృష్టించవచ్చు" అంది లత.

"అబ్బ! యిక్కడ కూడా నీ ఫెమినిస్టు లెక్చర్లు దంచడం మొదలెట్టావూ" నవ్వుతూ విసుక్కుని, రాధని అడిగాడు విక్రాంత్.

"రాధా! లత లెక్చర్లకేం గానీ మీ అత్తగారి తరపువాళ్ళు ఇప్పుడు మీ పట్ల ఎలా ఉన్నారు. ఐ మీన్ ....." ఆ వాక్యం ఎలా పూరించాలో తోచక ఆగిపోయాడు విక్రాంత్.



"అన్నయ్యా! నాకు వాళ్ళతో అంతగా అటాచ్‌మెంట్ పెరగలేదు. పెళ్ళయ్యాక ఏడాదిలోపే స్టేట్స్‌కి వెళ్ళాను గదా! వెళ్ళేదాకా ఏ కొద్ది రోజులో తప్ప ఆ ఏడాది కూడా మా యింట్లోనే ఉండిపోయాను" అంది రాధ.

"ఐ మీన్ మీ కుటుంబ సంబంధాలు కాదు. వారితో మీ ఆర్థిక లావాదేవీలు ఎలా ఉన్నాయి, నామినీగా ....." అంటూ అర్థోక్తిగా అడిగాడు విక్రాంత్.

"ఓ అదా అన్నయ్యా! నామినీగా నా పేరే ఉంది. దాంతో అతను చనిపోయాక చాలా పెద్ద గొడవైంది. వాళ్ళది జాయింటు ఫ్యామిలీ. ఆయనొక్కడే ఇన్‌కం సోర్స్. అందరి చదువులు, అవసరాలను మేమే చూసేవాళ్ళం. మా చిన్నాడపడుచుకు ఒక పెద్ద సంబంధం నిశ్చయమైనాక యిలా జరిగింది. ఇవన్నీ నాన్న చూసుకున్నాడు. లీగల్‌గా అన్నీ నీకే చెందుతాయని నాన్న పట్టుబట్టాడు. అతనే పోయాక డబ్బు గురించి నాకు ఆసక్తి పోయింది. పైగా నాకన్నా వాళ్ళకే డబ్బు ఎంతో అవసరం. మూడింట రెండొంతులు వాళ్ళకే ట్రన్స్‌ఫర్ చేస్తూ అగ్రిమెంటుపై సంతకాలు జరిగాయి. ఇదంతా పూర్తయ్యేసరికి వాళ్ళతో అటాచ్‌మెంట్ ఆ కాస్తా లేకుండా పోయింది. లత ఇంతకు ముందు వచ్చినపుడు ఈ గొడవల వల్లే మనసంతా ఏదోలా ఉండి కలవలేక పోయాను. ఇపుడవన్నీ గత జన్మ విషయాలు. ఆ విషయాలు వదిలేసి వేరే ఏదైనా మాట్లాడుకుందాం ప్లీజ్" విషాదంగా నవ్వే ప్రయత్నం చేసింది రాధ.

"అంటే యిపుడు నువ్వు కొత్త జన్మ ఎత్తి మళ్ళీ కొత్త జీవితం జీవించడానికి నిర్ణయించుకున్నావు. నువ్వు తొందరగా కోలుకున్నందుకు నాకు సంతోషంగా ఉంది."

"ఈ పాపకు వాళ్ళ డాడీతో బాగా అటాచ్‌మెంట్. ఎపుడూ డాడీ కావాలని ఏడుస్తూ ఉంటుంది. ఎక్కన్నించి తేను? ఎలా సముదాయించను? ఎలా చిక్కి పోయిందో చూడండి" అంటూ కన్నీళ్ళు పెట్టుకుంది రాధ.

అరుణ ఆప్యాయంగా ఆ పాపకేసి చేతులు చాచింది. ఎత్తుకుని ముద్దు పెట్టుకుంది. "అప్పుడే పాపకు ఎనీమియా (రక్త హీనత). న్యూట్రిషన్ పుడ్ తినిపించాలి" అంది అరుణ.

"విన్నావా లీనా! ఆంటీ ఏం చెబుతోందో. ఇకనుంచి అన్నం తింటావుగా!" అంటూ అడిగింది రాధ. అలాగే అని తల వూపింది లీనా.

అరవింద్‌కు లీనా రాధ చిన్నప్పటి ఫోటోలా ఉందనిపించింది.

అందరూ అక్కడే భోంచేశారు.

"రాధా! కొంతకాలం నాతో వచ్చెయ్యి. విక్రాంత్ వారానికి రెండ్రోజులే యింట్లో ఉంటాడు. నీవు నాకు తోడుగా ఉన్నట్టుంటుంది. నీక్కూడా పరిసరాలు ఛేంజయి ఫ్రెష్‌గా ఉంటుంది. పాత జ్ఞాపకాల్లో ఉంటే కొత్త జీవితం గెల్చుకోవడం సాధ్యం కాదు" అంది లత.

లెక్చరర్‌గా తన లోకం తనది అనుకున్నాడు విక్రాంత్. లతకు తాను ఏనాడూ ప్రొఫెషనల్‌గా తోడు కాలేకపోయాడు.

"ఇద్దరు డాక్టరమ్మలతో మీ ప్రాక్టీసు మూడు పువ్వులు ఆరు కాయలవుతుంది" అంటూ నవ్వాడు విక్రాంత్.

ఎంతో ఒత్తిడిమీద రాధ సరేనంది. సత్తయ్యకు కాస్త సంతోషం అన్పించింది. సాయంత్రమే తమతో పాటు రాధను బయల్దేరదీసింది లత.



అరుణతో రాధ ఏదో చెప్తోంది.

అసిస్టెంటు బాయ్ డోర్ తీసి, "నిర్మల మేడం వచ్చింది సార్. రమ్మంటారా?" అంటూ అడిగాడు అరవింద్‌ని. పంపుమన్నట్టు తల పూపాడు అరవింద్.

చంకలో పాపతో చిక్కిన శరీరంతో ప్రవేశించిన నిర్మల అందరికీ సమస్కరించింది. అరుణకు చూపించుమన్నాడు అరవింద్.

అరుణ అవీ యివీ పరీక్షలు చేసింది.

"ఇంత చిన్న పాపకు వస్తున్న నొప్పి అపెండిసైటిస్ అయి ఉండదు. ఏదో పడని వస్తువు తిన్నట్టుంది. మీరేం కంగారు పడకండి" అంటూ మందులు రాసింది అరుణ.

"కాసేపు కూర్చో" అంటూ అరవింద్ రాధను నిర్మలకు పరిచయం చేశాడు. నిర్మలను రాధకు పరిచయం చేశాడు.

"రాధా! నేను వీళ్ళ డాడీ పెట్టిన పెట్టుబడితోనే చదువుకోగలిగాను. అఫ్‌కోర్స్ వడ్డీతో సహా యిచ్చేశాననుకో. అయినా అలా వడ్డీకైనా నమ్మి యిచ్చేవాళ్ళు కూడా కావాలి గదా! స్టేట్స్‌లోని కార్డియాలజిస్టుతో నీ పెళ్ళి సెటిలైందని నాతో దాచకుండా వెంటనే చెప్పేసి ఉంటే నేను ఈ నిర్మలనే పెళ్ళి



చేసుకొని ఉండేవాడిని. అట్లా నీతో పెళ్ళి కాకుండా పోయింది. నిన్ను చూసుకొని నిర్మలను వద్దంటే యిటు నిర్మలతో పెళ్ళి కాకుండా పోయింది" అంటూ వేదాంతిలా నవ్వాడు అరవింద్.

జరిగిపోయిన విషయాలను అంత స్పోర్టివ్‌గా చెప్తున్న అరవింద్‌కేసి గౌరవంగా చూసింది నిర్మల.

అరవింద్‌లో ఎంతో హృదయ సంస్కారం. కాని తానపుడు అరవింద్‌ను తమ వద్ద పనిచేసే పనిమనిషి కొడుకన్నంత తేలికగా చూసింది. తనకంత గర్వం ఎందుకుండిందో.

"నేను అపుడు చాలా గర్విష్టిగా ఉండేదాన్ని లెండి" నిర్మల పేలవంగా నవ్వింది.



ఏదో పార్టీ టికెట్ సంపాదించి ఎమ్మెల్యేగా పోటీ చేసి అయిదు వేల ఓట్ల తేడాతో ఓడిపోయేసరికి నారాయణ సేటు కొడుకు శ్రీనివాస్ దివాలా తీసినంత పనైంది. రాజకీయాల్లో తిరగడంతో వ్యాపారం కుంటుపడింది.

ఇటు చూస్తే నిర్మల బతుకు యిలా అయిపోయింది. అరవింద్ ప్రోత్సాహంతో తమ్ముడు ఆనంద్ శ్రీనివాస్‌కు కుడిభుజంలా తిరిగాడు.

మెడికల్ షాపులో యిపుడు పూర్తిగా చంద్రయ్యే కూర్చుంటున్నాడు.

ఎంతో కష్టపడి సాధించిన అభివృద్ధినుంచి వెనక్కి మళ్ళినట్టనిపిస్తోంది నారాయణ సేటుకు.

బి.పి. పెరగడంతో నారాయణ సేటును అరవింద్ హాస్పిటల్‌కు తరలించారు.

"నారాయణమామ తొందర పడకపోతే నేను నిర్మలనే చేసుకొనేవాడిని" అని అరవింద్ అన్నాడని నిర్మల చెప్పిన మాటలోని అంతరార్థం ఏదేదో ఊహించాడు నారాయణ సేటు.

తన పక్కనే కూర్చుని అరవింద్ తనను పరీక్షిస్తుంటే నారాయణసేటు కళ్ళల్లో నీళ్ళు.

"మామా! కంగారేమీ లేదు. నార్మల్‌గానే ఉంది. టెన్షన్ పెట్టుకోకండి" అన్నాడు అరవింద్.

నారాయణసేటు మంచం పక్కన నిర్మల పాపనెత్తుకొని కూర్చుంది.

నాన్న కన్నీరెందుకో నిర్మలకు తెలుసు. అరవిందక్కు తెలియదు.

"బతుకుతానో లేదో" రెండు చేతులు జోడించాడు నారాయణసేటు. అతని ప్రార్థన అర్థం వేరు.

చంద్రయ్య, దేవక్కలు నిర్మలకు ధైర్యం చెప్పారు. ఎందరెందరో చూడ్డానికి రావడంతో హాస్పిటలంతా మూడు రోజులు సందడిగా మారిపోయింది.

నారాయణను నాలుగోరోజు సిటీకి తరలించారు. అంబులెన్సు సిద్దిపేట చేరకముందే సిటీకి వెళ్ళాల్సిన అవసరం తీరిపోయింది.

నిర్మల దుఃఖానికి అంతులేదు.

ఒక ఎమ్మెల్లే తండ్రిలా ఎందరెందరో పురప్రముఖులు, ఎంతో మంది కులసంఘ నాయకులతోను నారాయణసేటు శవయాత్ర సాగింది.

శ్రీనివాస్ అగ్గి పట్టుకొని ముందు నడిచాడు. నారాయణసేటు శవాన్ని అరవింద్, ఆనంద్, చంద్రయ్యలతో ఎవరెవరో పోటీ టు పడి భుజం మార్చుకున్నారు.



నెలలు గడిచాయి. నిర్మల అన్న శ్రీనివాస్ వ్యాపారం మూలబడింది. రాజకీయాలే అతనికి సర్వస్వమయ్యాయి. నిర్మల వదిన పురమాయింపుల్లో నిర్మల తన యింట్లోనే పనిమనిషిలా అయిపోయింది.

ఇలా కాదని ప్రైవేటు స్కూల్లో టీచరుగా ఉద్యోగంలో చేరింది నిర్మల. నిర్మల మళ్లీ మామూలు మనిషి అయింది. జీవితం అంటే తెలిసిరాసాగింది. అన్నిటినీ తట్టుకునే శక్తి సంపాదించుకుంది. ఎంత గారాబంగా పెరిగిన ఆ పిల్ల బతుకు ఎట్లైపోయె అని నిర్మలను చూస్తుంటే దేవక్క మనస్సు తరుక్కుపోతోంది.

వియ్యపురాలైన సక్కుబాయి యింటికి వెళ్ళింది దేవక్క. నిర్మల గురించి అయ్యో పాపం అని సానుభూతిగా అంది దేవక్క.

"ఎందుకు పాపం అనాలె వదినే? చేసిన పాపం ఉత్తగనే పోతాదో. మమ్ముల ముంచె. మందిని ముంచె. కులాన్ని ముంచె. కుల సంగాన్ని ముంచె. అందర్ని ముంచి తానొక్కడు మీదికి తేలితే – ఆ గోస తాకదా? నా ఉసురు తలుగదా" అంది సక్కుబాయి ఈసడింపుగా.



"తండ్రి పాపం చేస్తే బిడ్డ ఏం చేసిందో. పోయినోడు పాయె. ఉన్న గోసంతా ఆ పిల్లకేనాయె. మంచిగ బతికినపుడు కానకపాయిరి. ఇపుడు రెండో సంబంధం ఎవలు దొరుకుతరు?"

"ఆడు నన్ను ముండ మోపిచ్చినట్టు వాని బిడ్డ ముండ మోసింది" అంటూ గతమంతా తవ్వింది సక్కుబాయి.

విక్రాంత్ అలా మాట్లాడవద్దని వారించాడు. సక్కుబాయి ఊరుకోలేదు.

తన పెనిమిటీ, నారాయణసేటూ ఒక కాడనే బట్టలు నేసేవాళ్ళు. చేనేత సహకార సంగం కోసం యిద్దరు కలిసే తిరిగిన్రు. తన పెనిమిటిని సంగంలో నెగలనీయలేదు. తన పెనిమిటి నేత కార్మికుడుగానే పోయాడు. వీడు ముంచిన రందితోనే పోయిండు.

"ఇంత దివాలైనా ఇపుడు కూడా మా కన్నా మంచిగనే బతుకుతున్నారు. అయ్యో అనుడేంది? ఆ పిల్లకేమైన నీలుగుడు తక్కువుండెనా? అది ఎన్నడన్న నన్ను చిన్నీ (చిన్నమ్మా) అని పిలిసిందా!"

"అవన్ని కాంతయ్య, సావిత్రి మరిసినా నువు మాత్రం మరువలేదో వదినే. మన కండ్ల ముంగట పెరిగిన పిల్ల గోస అన్పిస్తంది" అంటూ బాధపడింది దేవక్క.



"రాధ వచ్చిన్నించి అరుణ మూడీగా ఉంటోంది" బెడ్ మీద వెల్లకిలా పడుకొని లతకేసి చూస్తూ అడిగాడు విక్రాంత్.

"వాళ్ళ నాన్న ఏదో అన్నాడట. ఈ మధ్య అరవింద్కూడా మూడి అయి మతిమరుపు ఎక్కువై పోయింది" అంది లత ఏదో ఫెమినిస్టు పుస్తకం తిరగేస్తూ.

"నీవు అనవసరంగా అరవింద్కు కొత్త సమస్యలు సృష్టిస్తున్నావనిపిస్తోంది. రాధను నువ్వు మళ్ళీ తన జీవితంలోకి తీసుకురాకపోతే అతను అరుణను పెళ్ళి చేసుకొని ఉండేవాడు. ఇప్పుడు అరుణను చేసుకోవాలో రాధను చేసుకోవాలో తేల్చుకోలేక సతమవుతున్నాడు" అన్నాడు విక్రాంత్.

"సమస్య యింత క్లిష్టమవుతుందనుకోలేదండి. పరస్పరం ప్రేమించు కున్నారు కాబట్టి అరవింద్ రాధలకు ఒక్కటి కావడానికి జీవితం మరో అవకాశం యిచ్చిందనే అనుకున్నాను."

లత అమాయకత్వానికి జాలిపడ్తూ నవ్వాడు విక్రాంత్.

"సమస్య నీకు అంత సరళ రేఖలా కనపడుతోందా? ఇంత జరిగాక కూడా నీకు సమస్య అర్థం కాలేదన్న మాట. జీవితమంటే పాత సిన్మా ముగింపు అనుకున్నావా? నీ సంప్రదాయ ఊహాత్మక ఆదర్శాల దృష్టి అలాగే ఉందన్నమాట. ఇక ఫెమినిజం చదివి ఏం నేర్చుకున్నట్టు?"

"అంటే అరుణను చేసుకొంటాడంటారా?"

"ఇప్పుడది సాధ్యం అనుకోను. కాని నువ్వు రాధను సన్నిహితం చేసేసరికి అదే సానుభూతికి అర్హమైన నిర్మల కూడా అతనికి గుర్తొచ్చింది. రాధ రావడం వల్ల అరవింద్‌కు నిర్మల కొత్త ప్రాబ్లం అయింది."

"అంటే ఇపుడు నిర్మలను చేసుకొంటాడంటారా?"

"అది కూడా చెప్పలేం. నువ్వు రాధను అతని నెత్తిన రుద్దకపోయి వుంటే ఖచ్చితంగా అరుణనే పెళ్ళి చేసుకొని ఉండేవాడు. అసలు అతని జీవితంతో ఆటలాడుకుంటున్నది రాధో, నిర్మలో, అరుణో, విధో కాదు. నీవు."

లత తల గిర్రున తిరిగిపోయింది. "ఏమిటి మీరనేది?" అంటూ పక్కమీంచి అకస్మాత్తుగా లేచి కూర్చుంది.

"ఆలోచిస్తే నీకే అర్థమవుతుంది. నిర్మల పెళ్ళయిపోయి, రాధ పెళ్ళి సెటిలయ్యాక నిన్ను చేసుకొందామనుకున్న అరవింద్‌కు ఆపాటికే నువ్వు అలిగి నన్ను చేసుకొని అపుడూ సమస్య సృష్టించావు. సకాలంలో గమనించి కాపాడకపోతే అరవింద్ ధర్మపురి గోదావరిలో ఆ రోజే చనిపోయి వుండేవాడు. పైపైన చూసేవారికి అరవింద్ కష్టాలకు రాధే కారణంగా కనపడుతుంది. కాని ఆ కష్టాలన్నీ నీ వల్ల వచ్చినవే. ఇప్పుడూ అలాగే చేశావు. లతా! గతాన్ని గతంలోలాగే వర్తమానంలో పరిష్కరించడం సాధ్యం కాదు. ఇది గమనించలేదు నువ్వు."

లత ఆలోచిస్తున్నకొద్దీ తానెంత పెద్ద పొరపాటు చేసింది తెల్సి రాసాగింది. నిర్మలను, రాధను చూసి అరుణ తనలాగే అలిగి మరొకర్ని ప్రేమిస్తే ... అరవింద్ ఏమైపోతాడో.

"అరవింద్! నాకు తెలియకుండానే నీ జీవితంలో ఎంత చిచ్చుపెట్టాను" అంటూ తల బాదుకుంది లత. అరవింద్ ఈ సమస్య పరిష్కరించుకోలేక ఆత్మహత్య చేసుకోడు గదా అని వణికిపోయింది లత.



"అరవింద్ గురించి నాకు భయంగా వుందండి, ఇపుడేం చేద్దామంటారు?"

"ప్రస్తుతం మనం చేయగలిగిందేమీ లేదు. కాని ఒకటి తోస్తోంది. ముందు రాధను సొంతంగా ప్రాక్టీసు ప్రారంభించమని చెప్పు. అప్పుడు అరవింద్‌కు ఆలోచించుకోవడానికి కాస్త వీలు చిక్కుతుంది."

"అప్పుడు ఎవర్ని చేసుకొంటాడంటారు?"

"ఇప్పుడే ఎలా చెప్పగలం? కాలమే నిర్ణయిస్తుంది. రాధ దూరంగా ఉంటే అతని మనస్సు నుంచి నిర్మల కూడా దూరమై అరుణనే చేసుకోవచ్చు. ఈలోగా అరుణ నీలాగా అలిగి మరొకర్ని ప్రేమిస్తే నిర్మలను చేసుకోవచ్చు. ఎలా చెప్పగలం?" అన్నాడు విక్రాంత్. "నాకు నిద్ర వస్తోంది" అంటూ ఒరిగాడు.

ఒకటి చేయబోతే మరొకటి అయిందేమిటి? అనుకుంటూ తలపట్టుకు కూర్చుంది లత. ఎపుడు నిద్ర పట్టేసిందో.

అనవసరంగా అరవింద్ జీవితంలో ప్రవేశించానని బాధతో రాధ ఆత్మహత్య చేసుకొంది. ఎటూ తేల్చుకోలేక అదే సమయంలో అరవింద్ ఆత్మహత్య చేసుకొన్నాడు. అరుణ బిగ్గరగా ఏడుస్తోంది.

లత నిద్రనించి అకస్మాత్తుగా లేచింది. అదంతా కల అని అర్థం అయ్యేటప్పటికీ లత కాళ్ళు చేతులు వణుకుతున్నాయి.

"ఏమండీ. ఏమండీ అంటూ ఎంత పిలిచినా నిద్ర లేవలేదు విక్రాంత్. నైటీతో బయటకు నడిచింది లత. మరో బెడ్‌రూంలో రాధ పాపను పొదువుకొని హాయిగా నిద్రపోతోంది. కాస్త గుండె దడ తగ్గింది. ఫోన్ రింగ్ చేసింది లత.

"హలో! డాక్టర్ లతను మాట్లాడుతున్నాను. డా॥ అరవింద్ గారున్నారా?"

"నమస్కారం మేడమ్. నిర్మల మేడం నిద్ర మాత్రలు మింగింది. డాక్టర్‌గారు బిజీలో ఉన్నారు. పిలువుమంటారా?"

"వద్దు" అంటూ ఫోన్ పెట్టేసి ఏడుస్తూ కూర్చుంది లత. కర్తవ్యం గుర్తొచ్చి గబగబా డ్రెస్సు మార్చుకుంది. అలికిడికి రాధ లేచింది. రాధ కూతుర్ని లత కూతురు దగ్గరికి నిద్రలోనే ఎత్తుకెళ్ళి పడుకోబెట్టింది. నిర్మలను బతికించుకోవాలని ఆతృత. కారు వేగం అందుకుంది.

రాత్రంతా కంటిమీద కునుకు లేదు. ఉదయం పదింటికి నిర్మలకు ప్రాణాపాయం తప్పిందని ఊపిరి పీల్చారు డాక్టర్లు.

నిర్మల అన్న శ్రీనివాస్ ఆందోళన తగ్గింది.

తన భవిష్యత్తేమిటో నిర్ణయించుకోక తప్పదనుకుంది రాధ. తనకు డబ్బు మీది వ్యామోహం భర్త చనిపోయాక పూర్తిగా చచ్చిపోయింది. డబ్బు మీద, ధనవంతుల మీద ఒక రకమైన ఏవగింపు కూడా కలుగుతోంది. కమర్షియల్ టాక్స్ డిపార్టుమెంటులో పని చేసి నాన్న కూడబెట్టిందంతా ప్రజల్ని దోచిన అవినీతి సొమ్మే కదా అని స్టేట్స్ నుండి యిండియా వచ్చాక జ్ఞానోదయం అయింది. అరవింద్‌కు దూరంగా ఉండాలి. తన బతుకు తాను బతకాలి. పేదలకు సేవ చేయాలి అనుకుంది.

రాధ తండ్రి సత్తయ్య దిల్‌సుఖ్‌నగర్‌లో సొంతింట్లో క్లినిక్ ప్రారంభించు కొమ్మని ఎంత పోరినా రాధ ససేమిరా అంది. నెల తర్వాత రాధ సిరిసిల్లలో సొంతంగా క్లినిక్ ప్రారంభించింది. కొంతకాలం తోడు కోసం నిర్మలను రమ్మంది. ఊరు మారడానికి ఇదొక అవకాశం అని నిర్మల సంతోషంగా సరేనంది. టీచరు ఉద్యోగం వదిలేసి సిరిసిల్ల వెళ్లింది. కొద్దిరోజుల్లోనే రాధ, నిర్మల మంచి స్నేహితులయ్యారు. నిర్మలను కూడా డాక్టర్ రాధమ్మ లాగే గౌరవిస్తున్నారు.

సిరిసిల్ల పాతబస్టాండ్ సమీపంలో ఉన్న రాధ హాస్పటల్ కొద్దిరోజులలోనే బాగా ప్రాచుర్యం పొందింది. ఇటు వెంకంపేట, సుందరయ్యనగర్, బద్దం ఎల్లారెడ్డి నగర్ అటు విద్యానగర్‌దాకా విస్తరించి ఉన్న పవర్‌లూం కార్మికులకు డాక్టర్ రాధమ్మ దేవతలా కనిపించింది. అందరిని ఆప్యాయంగా నవ్వుతూ పలకరించడం, నిర్మల ఆత్మీయంగా మందులు ఎలావాడాలో వివరించడం అందర్ని ఆకట్టుకుంది. పేదవాళ్ల డాక్టరమ్మగా స్థిరపడింది. రాసే మందులు తక్కువ. తీసుకునే ఫీజు తక్కువ. తన డబ్బులే కొంతకాలందాకా హాస్పటల్ నిర్వహణకు ఖర్చుచేసింది. రెండు లక్షల రూపాయలదాకా అలా ఖర్చుచేయడం తండ్రి సత్తయ్యకు నచ్చలేదు.

రాధ ఊహాత్మక ఆదర్శాల్తో పిచ్చిపని చేస్తోందన్నాడు సత్తయ్య.

"ఔను నాన్నా! నేను నిజంగా పిచ్చిదాన్నే" అంది రాధ.

కన్సల్టేషన్‌ఫీజు అయిదు రూపాయలే కావడంతో సిరిసిల్లతో పాటు చుట్టుపక్కల ఊళ్లల్లోకూడా రాధమ్మ డాక్టరు పేరు బాగా పాకిపోవడంతో డాక్టర్లందరికీ రాధమ్మపట్ల అసూయ పెరిగిపోయింది.

ప్రతి బుధవారం గైనకాలజిస్టు లత, చిల్డ్రెన్ స్పెషలిస్టు అరుణ సిరిసిల్లలో రాధ క్లినిక్‌కు విజిటింగ్ డాక్టర్లుగా వెళ్తున్నారు.



అయిదు రూపాయలకే స్పెషలిస్టులు చూడ్డం ప్రజలకొక ఆశ్చర్యకరమైన విషయమైంది. ఆ తర్వాత అలవాటైంది. ప్రతి బుధవారం ముగ్గురు స్నేహితురాళ్ళకు తీరిక సమయాల్లో కాలేజీ అమ్మాయిల్లా భలే ఆనందంగా గడిచిపోతోంది.

అరుణతో "నువ్వు మేజర్‌వి. మైనారిటీ వయస్సు తీరినదానివి. ఇంకా మీ డాడీకి భయపడ్తూ అరవింద్‌కు నీ ప్రేమ గురించి చెప్పకుండా యింకెంత కాలం ఉంటావు? మేమంతా ఉండగా నీకేం భయం? నువ్వు ఊ అను. పెళ్ళి మేం జరిపిస్తాం" అన్నారు లత, రాధ.

అరుణ ఒక నిర్ణయానికొచ్చి సరేనంది.

అనుకున్నదే ఆలస్యం... కరీంనగర్‌లో శ్రీరాజరాజేశ్వర కళ్యాణ మండపంలో డాక్టర్ అరవింద్, డా॥ అరుణల పెళ్ళి విక్రాంత్ పట్టుబట్టి బాజాభజంత్రీలు లేకుండా మీటింగ్ పెళ్ళి పద్ధతిలో జరిపించాడు.

అరుణ తరపు బంధువుల్లో అరుణ తల్లి, మేనమామ, తమ్ముడు, చిన్నమ్మ, కొందరు స్నేహితులు తప్ప బంధువులు పెద్దగా రాలేదు.

ఇదే స్థాయి సంబంధం అరుణకు వెతికి చేయాలంటే పది లక్షల కట్నమైనా యివ్వాల్సి వచ్చేది. వాటితో పాటు రెండు లక్షల పెళ్ళి ఖర్చులు మిగిల్చిన ఈ పెళ్ళికి అరుణ తండ్రి గానీ, తండ్రి తరపు బంధువులు గానీ రాకపోవడం కులహంకారం రూపంలో స్వార్థాన్ని దాచిపెట్టడం తప్ప మరేమీ కాదు అని పెళ్ళిలో విక్రాంత్ కాస్త గట్టిగానే ఉపన్యాసం దంచాడు.

"తన ఆస్తిలోంచి పన్నెండు లక్షల రూపాయలు కూతురు పేరిట బ్యాంకులో డిపాజిట్ చేస్తే తప్ప అరుణను నా కూతురు అని తండ్రి ఆమె యింటికి రాకపోకలు సాగించే నైతిక హక్కు లేదు" అని విక్రాంత్ తెగేసి మైకు మైకంలో చేసిన హెచ్చరిక అరుణ తల్లికి మింగుడు పడలేదు.

తన భార్య నోటితో అది విన్న అరుణ తండ్రి దయాకర్‌రావు ఆశ్చర్య పోయాడు.

"వీడెవడయ్యా బాబు! ఆవలిస్తే పేగులు లెక్క పెట్టడంతో పాటు అంతరంగాన్ని పసిగట్టేవాడు! ఇలా బెట్టుగా తప్పించుకొని ఏడాది తర్వాత రాకపోకలు సాగించుకుంటే పరువుకు పరువూ, పైసలకు పైసలూ మిగుల్తాయనుకుంటే విక్రాంత్ రెండూ లేకుండా పెళ్ళి మీటింగ్‌లోనే దుమ్ము

దులిపాడని" పళ్ళు కొరికాడు తండ్రి దయాకర్‌రావు.



"ఆధునిక వైద్యంలో కొన్ని అపోహలు" అనే అంశంపై సిరిసిల్లలో రాధ ఏర్పాటు చేసిన సెమినార్ ప్రజల్ని, మేధావుల్ని బాగా ఆకర్షించింది. ఇపుడు చేస్తున్న గర్భసంచి, అల్సర్, వగైరా ఆపరేషన్లు తొంభయి శాతం పైగా అనవసరమైనవే అని, డాక్టర్లు తమ సంపాదన కోసం ప్రజల్లో ఆపరేషన్ల క్రేజీ పెంచుతున్నారని, డాక్టర్లు రాసే మందుల్లో సగానికి పైగా మెడికల్ షాపులో తన వాటాగా పెరిగే లాభాల కోసమేనని, తక్కువ మందులు రాసే డాక్టర్లే గొప్ప డాక్టరని, ఏ ఏ రోగాలు ఎలా కొద్దిపాటి జాగ్రత్తలతో ఎలా మందులు లేకుండానే నయమవుతాయో చెప్పిన విషయాలు ప్రజల్ని బాగా ఆకర్షించాయి.

సంపాదన కోసమే వలస వచ్చిన డాక్టర్లకు రాధ పెద్ద సమస్య అయి కూర్చుంది. పేషెంట్లుగా వస్తున్న పేదల్ని, వారి పిల్లల్ని, వారి స్థితిగతులు చూస్తుంటే నిర్మలకు వారిపట్ల సానుభూతి పెరుగుతోంది. పవర్ లూం కార్మికుల్ని, వారి కుటుంబ సభ్యుల్ని చూస్తుంటే తన రక్త సంబంధీకులే అన్నంతగా బాధపడుతోంది.

"ఇక నీతో సంసారం చేయను. నా బతుకు నేను బతుకుతానని" లత వదిన అయిలమ్మ తన పిల్లల్ని తీసుకొని ఆడపడుచు డాక్టర్ లత యింటికి చేరింది.

"ఆ అటెండర్ ఉద్యోగానికి లీవు పెట్టి మీ అన్నను యిక్కడ మెడికల్ షాపు పెట్టుకోమనరాదూ! ఇక్కడ అతనికి సోషల్ మొబిలిటీ, సోషల్ స్టేటస్ పెరిగి మన భయంతో కాస్త మారుతాడేమో" అని లతకు సూచించాడు విక్రాంత్.

ఆరు నెలల తర్వాత విక్రాంత్ మాటే వాస్తవమైంది.

సంపాదన, ప్రజల్లో గుర్తింపు పెరుగుతున్నకొద్దీ అరవింద్ ఆలోచనలు మారసాగాయి.

పెద్దకోడలు అరుణతో ఆ యింట్లో వంటల తీరే మారిపోయింది.

సావిత్రి బీడీలు చేయడం మానేసింది.

బట్టలు నేసినపుడు ముసలివాళ్ళలా ఎండుకుపోయి వున్న దేవక్క, చంద్రయ్య, బీడీలు చేసిన సక్కుబాయి పదేళ్ళు వయస్సు పైబడితే అందుకు భిన్నంగా పదేళ్ళ వయస్సు తగ్గినట్టుగా ఆరోగ్యంతో, ఆత్మవిశ్వాసంతో అందంగా పుష్టిగా నిగనిగలాడుతున్నారు.



అరవింద్ తమ్ముడు ఆనంద్ అచ్చం రాజకీయ నాయకుడిలా మారిపోయాడు.

పేదరికం కారణంగా తెగిపోయిన బంధుత్వాలన్నీ యిపుడు పచ్చగా చిగురించాయి.

డాక్టర్ అరవింద్, డాక్టర్ విక్రాంత్ లెక్చరర్ తమకు ఎలా దగ్గరి బంధువో చిలవలు పలవలుగా చెప్పుకొని ఎక్కడెక్కడివాళ్ళో తమ చుట్టూ ఉన్నవాళ్ళలో పరపతి పెంచుకుంటున్నారు.

వాళ్ళ తరపున వచ్చే పేషెంట్లకు కన్సెషన్స్ యివ్వడంతో అటు బంధుత్వమూ, యిటు వ్యవహారమూ రెండూ కలగల్సి పోయాయి.

మూడు నెలలకోసారి డాక్టర్ల బృందంతో ఉచిత వైద్య శిబిరం నిర్వహించడం అరవింద్ కార్యక్రమాల్లో ఒకటైంది.

ప్రయివేటు స్కూల్లు, కాలేజీలవాళ్ళు తమ ఫంక్షన్స్‌కి డాక్టర్ అరవింద్‌ని, డాక్టర్ అరుణని ముఖ్య అతిథిగా పిలుస్తున్నారు.

బిజీ అయిపోయిన డాక్టర్ అరుణ మూడో ఏడు పడ్డంతోనే తన కొడుకుని నర్సరీ బడికి పంపాలనుకుంది. దేవక్క గొడవ చేసింది. మాకెలా పొద్దు పోవాలని. అరుణ తన ఆలోచన విరమించుకుంది.

విక్రాంత్‌కు మంచి సోషియాలజిస్టుగా జాతీయ స్థాయిలో గుర్తింపు పెరుగుతోంది.

విక్రాంత్ తల్లి సక్కుబాయి మున్సిపల్ కౌన్సిలర్‌గా పోటీ చేసి గెలిచింది.

ఆమె గెలుపులో డాక్టర్ అరవింద్, విక్రాంత్, సావిత్రి, ఆనంద్, శ్రీనివాస్, దేవక్క, చంద్రయ్య, నిర్మల, తదితర బంధుమిత్రుల ప్రతిష్ఠ ప్రత్యక్షంగా, పరోక్షంగా ఎంతో బాగా ఉపకరించింది.

సక్కుబాయి తన జీవితంలో ఏనాడూ కలలోనైనా ఊహించని విధంగా కౌన్సిలర్ కావడం, మున్సిపల్ వైస్ ఛైర్‌పర్సన్ కావడం ఆమె ఆత్మవిశ్వాసాన్ని పెంచింది.

కోరుట్ల, జగిత్యాల, సిరిసిల్ల, ఆర్మూర్, మెట్‌పెల్లి, తదితర ఊళ్ళల్లో మున్సిపల్ ఛైర్‌పర్సన్లు గానో, వైస్ ఛైర్‌పర్సన్‌లు గానో, కౌన్సిలర్లు గానో, సర్పంచులు గానో, బీడీ కార్మికురాళ్ళో, మాజీ బీడి కార్మికురాళ్ళో ఎన్నిక కావడంతో వాళ్ళంతా ఒక బృందం అయిపోయారు.

కొడుకు విక్రాంత్, కోడలు డాక్టర్‌లత, అల్లుడు ఆనంద్, డాక్టర్‌అరవింద్‌తో పాటు శ్రీనివాస్ వల్ల సక్కుబాయి ఆ మహిళా ప్రతినిధుల బృందానికి పెద్దమ్మయిపోయింది. నాయకురాలైపోయింది.

"అరవింద్! నువ్వూ నేనూ ఫెమినిస్టులను పెళ్ళి చేసుకొంటే మన కుటుంబాలు యిలా అభివృద్ధి అయ్యేవేనా! లేదా మనం మన స్వార్థం, మన సుఖాల కోసం సిటీలో స్థిరపడినా మన కుటుంబాలు, మన బంధువులు, యిలా వానతో నీటిమట్టం అంతటా పెరిగినట్టు పెరగడం సాధ్యమయ్యేదా...!

"...కాకపోతే మనం వ్యక్తిగతంగా ఎవరికీ నీడనివ్వని తాడి చెట్టులా ఇంకా ఎదిగి ఉండేవాళ్ళమేమో! మన పిల్లలు మన బంధువుల్తో సంబంధాలు కోల్పోయి, మన సంపాదన, సోషల్ స్టేటస్‌తో క్రీమీ లేయర్ ఎలైట్ క్లాసుగా పచ్చి స్వార్థపరులుగా మారే క్రమం మొదలయ్యేది. ఏమంటావు?" అంటూ అడిగాడు విక్రాంత్.

"పైగా యిక్కడ ఉన్న గుర్తింపు గౌరవం, ప్రేమ సిటీలో ఎందుకుంటుంది? అక్కడ మనం మన సమాజానికి చేసే మేలంటూ ఏముంటుంది?" అని గొంతుకలిపాడు అరవింద్.

అప్పుడే యింట్లోకి వచ్చిన డాక్టర్ లత నవ్వుతూ అడిగింది.

"బావా బామ్మరుదులు చాల్రోజుల తర్వాత ఏదో తీరికగా చర్చిస్తున్నారు."

అరవింద్ జరిగిన చర్చ చెప్పాడు. లత నవ్వుతూ అంది.

"అయితే మీకు ఫెమినిజం మీద యింకా కోపం పోలేదన్నమాట! అసలు యిదంతా ఫెమినిజం వల్లే సాధ్యపడింది. ఫెమినిజం వల్లే స్త్రీలను సమానంగా గౌరవిస్తున్నారు. ఫెమినిజం వల్లే మహిళలకు మూడోవంతు అన్ని రంగాల్లో రిజర్వేషన్లు ఏర్పడ్డాయి...

"ఈ రిజర్వేషన్ల వల్లే అత్తమ్మలాంటి వాళ్ళు ఎందరో స్త్రీలు గెలిచారు. ఎస్సీ, బీసి, ఎస్టీ లవారీగా మహిళలకు రిజర్వేషన్లు లేకపోయి ఉంటే అత్తమ్మలాంటి వారు గెలిచేవారా? ఏ ఓసీ స్త్రీలో గెలిచి ఉండేవాళ్ళు. నేనూ, రాధా, అరుణా ఫెమినిస్టులం కాదని ఎందుకనుకున్నారు? మీకు ఎదురు తిరగకుండా వినయంగా సంసారాలు చేస్తున్నందుకా?"

"అది కాదు లతా!" అంటూ విక్రాంత్ ఏదో చెప్పబోయాడు.

లత విన్పించుకోలేదు.



"మీ దృష్టిలో పీడిత వర్గ, పీడితకుల, రూరల్ (గ్రామీణ) దృక్పథంతో పని చేసే ఫెమినిస్టులు. ఫెమినిస్టులుకారా? మీ దృష్టిలో లూజ్ క్యారక్టర్ ఉంటేనే ఫెమిస్టులా? లేక అర్గనైజ్డ్ ఓసీ క్యాస్ట్స్ ఎలైట్ ఫెమినిస్టులే ఫెమినిస్టు లనుకుంటున్నారా?...

"అంటే మీలోనూ అర్గనైజ్‌డ్ ఓసీ ఎలైట్ లూజ్ క్యారక్టర్ ఫెమినిస్టులే ఫెమినిస్టులనే దృక్పదం హాంగోవర్‌గా కొనసాగుతోందన్న మాట. మేన్‌స్ట్రీం మీడియా మీపైకూడా ఎంత ప్రభావంవేస్తోంది?" అంటూ డాక్టర్ లత ఉపన్యాసం దంచింది.

విక్రాంత్, అరవింద్‌లు ఆ వాగ్దాటికి అవాక్కయ్యారు.

ఈమె తనకోడలేనా అని కొత్తగా ఆశ్చర్యపోయింది సక్కుబాయి. మెచ్చుకోలుగా చూసి అంది.

"ఈసారి ఎమ్మెల్లేగా పోటీ చేయికోడలా! ఎస్సీల్లో యింత తెలివి ఉన్నప్పుడు రిజర్వేషన్ సీట్లో పోటి ఎందుకు చేయద్దు?"

"నాకా ఉద్దేశంలేదు అత్తమ్మా! ఒకవేళ పోటీ చేసినా ఎస్సీ రిజర్వేషన్‌లో ఎందుకు పోటీ చేస్తాను. నేను బీసీల యింటి కోడల్ని. చేస్తే బీసీల రిజర్వేషన్ కోటాలో పోటీ చేస్తాను. లేదా జనరల్ వుమెన్ రిజర్వేషన్‌లో పోటీ చేయాలి. ఎస్సీ రిజర్వేషన్ మాత్రం మా ఎస్సీలకే అందాల్సి."

"అట్లగాదే కోడలా! ఇందిరాగాంధీ తురుకాయనను చేసికొన్నా ఆమె బ్రాహ్మణామెగానే బతకలేదా? ఆమె కొడుకు రాజీవ్ గాంధీ తురకమతం గాకుండా క్రైస్తవుల పిల్లను చేసికొన్నా బ్రాహ్మణుడని పేరు పోలేదా? నువ్వు కూడా నీకులం హక్కులు పొందవచ్చు గదా!" అంది సక్కుబాయి.

"అత్తమ్మా! దానివల్ల నాకు లాభం జరగవచ్చు. మీరూ మా అమ్మా, అన్నయ్యా సంతోషించవచ్చు. కాని ఎస్సీలకు అన్యాయం జరుగుతుంది. పై కులాలలో యింటర్ కాస్ట్ మ్యారేజ్ చేసికొన్న స్త్రీలు నిజంగా ఎస్సీలను ప్రేమించేవాళ్ళయితే ఎస్సీకోటాలో పోటీ చేయకూడదు...

"అలాగే ఓసిలు కింది కులాల్లో మ్యారేజ్ చేసికొన్న స్త్రీ ఉదాహరణకు అరుణ ఓసీ. కింది కులం రిజర్వేషన్‌లో అరుణ పోటీ చేసినా అన్యాయమే జరుగుతుంది. అయినా అరవింద్ నన్నెక్కడ పోటి చేయనిస్తాడు. తానే పోటీ చేద్దామని దూరాలోచనతో తమ్ముణ్ని ముందుగా రాజకీయాల్లోకి దించాడు.

ఇపుడు తానే పోటీ చేద్దామని తయారైనాడు" నవ్వుతూ అంది డాక్టర్ లత.

"మరీ అట్లా దుష్ప్రచారం చేయకు. ఆ మాటకొస్తే నేను పోటీ చేయాలనుకోవడం తప్పా?" అన్నాడు అరవింద్.

"విక్రాంత్! నీ అభిప్రాయం ఏమిటి?"

"నా అభిప్రాయంకన్నా డా॥రాంమనోహర్ లోహియా నలభయి ఏళ్ళ కింద చెప్పిన మాట చెప్తాను. 1956లోనే చాలా మీటింగుల్లో ఆయన ఏం చెప్పాడంటే అయిదారేళ్ళలో ఆంధ్రప్రదేశ్‌లో బీసీలు అధికారం చేపడ్తారని అన్నాడు. కావాలంటే తెలుగు అకాడమీ అనువాదం చేసి ప్రచురించిన అతని ప్రసంగాల సంపుటాల్ని చదవండి."

"ఏంటీ? 1956లో ఆమాట అన్నాడా? ఏం చూసి అన్నాడు. ఎందుకు అలా జరుగలేదు?" అని ప్రశ్నలు కురిపించాడు అరవింద్."

ఇప్పటికైనా కనుచూపుమేరలో లేని బీసీల అధికారం గురించి నలభయు ఏళ్ళకిందే ఎందుకు ఊహించాడు?"

"మొన్న డిల్లీలో ఓ నేషనల్ సెమినార్ జరిగింది. 'క్యాస్టుక్లాసు జండర్ అన్‌డెవలప్‌డ్ రీజియన్స్ అండ్ పొలిటికల్ పవర్' మీద మూడురోజులు జరిగిన సెమినార్‌లో అద్భుతమైన విషయాలు ప్రెజెంట్ చేశారు. నా పేపర్లో మన ఈ సమస్యగురించే చర్చించాను" అంటూ వివరించాడు విక్రాంత్.

"ప్రాథమిక, సెకండరీ విద్యకు మొదటి ప్రణాళికలో ప్రతిపాదించిన బడ్జటుతో పల్లెల్నించి మొదటితరం అక్షరాస్యులు కొత్తగా ఏర్పడడం మొదలైంది. పారిశ్రామికాభివృద్ధిలో బీసీల చొరవ పెరిగింది. దాన్ని చూసి రామమనోహర్‌లోనూ మన రాష్ట్రంలో బీసీలు త్వరలో అధికారంలో కొస్తారని అన్నాడు.

"తాలుకా కేంద్రాల్ని విద్యాకేంద్రాలుగా పరిశ్రమల అభివృద్ధి కేంద్రాలుగా వికేంద్రీకృత అభివృద్ధి విధానం అమలు జరిగి ఉంటే లోహియా కల నిజమయ్యేది. కాని అలా జరుగలేదు. పరిశ్రమలు, విద్యాకేంద్రాలు కొన్ని సిటీ పరిసర ప్రాంతాల్లో కేంద్రీకృతమయ్యాయి. నెహ్రూ హయాంలో భిలాయ్, రూర్కెలా, నాగార్జున సాగర్ వంటి కేంద్రీకృత భారీ పరిశ్రమల్ని, భారీ ప్రాజెక్టుల్ని చేపట్టారు. వాటికి కావల్సిన స్కిల్‌గానీ, పెట్టుబడిగానీ బీసీల స్తోమతకు మించినవి. అందువల్ల దాన్ని అందుకోలేకపోయారు...



"భారీ ప్రాజెక్టుల వల్ల భూములున్న భూస్వామ్య, వ్యవసాయకులాల వాళ్ళ పంట, రాబడి, స్తోమత పెరిగి వాళ్ళే తిరిగి రాజకీయనాయకులుగా పై స్థాయి అధికారులుగా, పారిశ్రామిక వేత్తలుగా, కాంట్రాక్టర్లుగా రూపాంతరం చెంది అభివృద్ధి చెందారు. భారీ ప్రాజెక్టులు, భారీ పరిశ్రమల వల్ల ఎస్సీ, బీసీ, ఎస్టీలు కార్మికులుగా మారిపోవాల్సి వచ్చింది...

"ఎందుకంటే వాళ్ళ వద్దసరైన సర్‌ప్లస్‌గానీ, పెట్టుబడిగానీ, వ్యవసాయ భూములుగానీ చాలా తక్కువ. చైనాలో జరిగినట్టు వికేంద్రీకృత అభివృద్ధి జరిగివుంటే బీసీలు. ఎస్సీలే అన్ని రంగాల్లో తమ వాటా తాము పొందేవారు. అది యితరుల పరమైంది." అంటూ తన సెమినార్ పత్రం సారాంశం వివరించాడు విక్రాంత్.

"ఇంతకూ నన్ను పోటీ చేయమంటావా? వద్దంటావా? ఇప్పుడు బీసీల టైం వచ్చిందా?" ఉత్సుకతతో అడిగాడు అరవింద్.

"అలా ఒక్కమాటలో చెప్పడం కష్టం అరవింద్. బీసీల స్వకృతాపరాధం వారిని పట్టిపీడిస్తోంది. ఈ మాట బహిరంగంగా అంటే బీసీలు నన్ను తిడ్తారు. కాని వాస్తవం అదే. ఉదాహరణకు నారాయణ సేటు చేనేత సహకార సంఘంలో చురుకుగా పని చేసి దాన్నే ముంచి అంటే స్వంత కులస్తులను ముంచి పైకి వచ్చాడు. దాంతో అతన్ని అతని కులస్తులే నమ్మడానికి నిరాకరించారు. అలా అతను వ్యాపారానికే పరిమితమయ్యాడు...

"ఇలా మొదటితరంలో ఎదిగిన బీసీలు రేపటి పిల్లకన్నా యివాళటి గుడ్డు నయం అని పగలకొట్టుకొని తిన్నారు. దాంతో వాళ్ళు ఎదగలేదు. రెండో తరంలో అందరూ రాజకీయాలంటే నీచంగా చూసి ఉద్యోగాలు, వ్యాపారాల్లో భద్రత వెతుక్కున్నారు. అట్లా రెండో తరంలో నష్టపోయారు.

"మొదటితరం ఎలైట్ సెక్షన్‌గా మారడం వల్ల మూడో తరం నష్టపోయింది. ఉదా॥కు నారాయణసేటు నిర్మలను చేసికొమ్మని, నీచదువుకయ్యే ఖర్చు నేనే పెడ్తానని నీ యింటర్ అప్పుడు, నీ లాంగ్‌టర్మ్ కోచింగ్ అప్పుడు అని వుంటే నువ్వలా నారాయణ సేటు అల్లుడివై ఉంటే అతడు చేసిన పాపం పరిహారమై, అతని పెట్టుబడి, ప్రతిష్ట, స్తోమత నీకు పెట్టుబడి అయి నువ్వు ఈ పాటికే ఎమ్మెల్లే అయి ఉండేవాడివి...

"అప్పుడు మీ బావమరిది శ్రీనివాస్ ఏ కార్పోరేషన్ లోనో, దేవస్థానంలోనో ఛైర్మెనో, మెంబరో అయి వుండేవాడు. ఆ కుటుంబం యిప్పటిలా దివాళా తీసి

పతనమై ఉండేది కాదు. అది జరగకపోవడం వల్ల మనం తిరిగి మళ్ళీ కొత్తగా మొదటి నుంచి ప్రారంభించాల్సిన స్థితిలో పడిపోయాము."

"ఇంత అవగాహన ఉన్న నువ్వు పోటీ చేయడమే మంచిది అనిపిస్తుంది. యిప్పుడు నువ్వు ఉద్యోగం చేయాల్సిన అవసరం కుడా లేదు" అన్నాడు అరవింద్.

విక్రాంత్ నవ్వాడు. "ఎద్దున్నోనికి బుద్ధుండదు. బుద్ధున్నోనికి ఎద్దుండదు. అనే సామెత వినలేదా? సామాజిక శాస్త్రాలు తెలియడం వేరు. రాజకీయాలు చేయడంవేరు. మొదటిది థీయరీ. ఎవరైనా నేర్చుకోవచ్చు. రెండోది ప్రాక్టీసు. ప్రాక్టీసులోనే మన సత్తా తెలుస్తుంది. బాగా తెల్సిన వాళ్ళే నాయకులుగా ఎన్నికయ్యే సమర్థత సాధించుకొని ఉంటే తత్వవేత్తలు, మేధావులు, రాజనీతి శాస్త్రజ్ఞులే నాయకులై వుండేవారు."

"అరుణ వాళ్ల డాడీ ఎలక్షన్లలో పోటీ చేస్తాడని ఎవరో అన్నారు."

ఏదో గుర్తొచ్చినట్టు అకస్మాత్తుగా అడిగింది లత.

"అన్నట్టు అరవింద్! మీ మామయ్య దయాకర్‌రావు అరుణ పెళ్ళికోసం యివ్వాల్సిన కట్నం, పెళ్ళి ఖర్చు కల్సి పన్నెండు లక్షలు అని విక్రాంత్ అప్పుడు అన్నాడు గదా! ఈ ఆరేళ్ళలో బ్యాంకు వడ్డీ ప్రకారమే అవి యిరవైనాలుగు లక్షలవుతాయి. ఎలక్షన్ల ఖర్చులకు పనికొస్తాయి" అంటూ నవ్వింది డాక్టర్ లత.

"ఆ మాటంటే రేపే మీరు అతని పోస్టుమార్టం కెళ్ళాల్సి వస్తుంది. అతను ఉరేసుకు ఛస్తడు" అంటూ నవ్వాడు విక్రాంత్.

"లెక్క లెక్కనే. సుట్టమైతే ఇంటికాడబుక్కెడంత తినుమను. కాని లెక్క లెక్కనే అని అడుగేందోయి అల్లుడా?" అంది సక్కుబాయి.

"నేనేదో నవ్వులాట కన్నాను అత్తమ్మా! ఇలా కూతురికివ్వాల్సిన 24 లక్షలు అతని వద్ద సర్‌ప్లస్‌గా మిగిలిపోయే సరికి యిప్పుడాయన ఆ పైసల్తో తనకు టికెట్ తెచ్చుకుంటున్నాడు. రేపు గెలుస్తాడు. ఇలా మన త్యాగాలవల్ల వాళ్ళ సర్‌ప్లస్ పెరిగి తిరిగి మన మీదే పెత్తనం చెలాయిస్తారన్నదే నా బాధ" అంది లత.

అలా చర్చ ముగిసింది. అయితే వీళ్ళెవరూ ఊహించని విధంగా రాధ ఎన్నికల్లో టికెట్ సంపాదించిందని తెల్సి అందరూ ఆశ్చర్యపోయారు. రిటైర్డు కమర్షియల్ టాక్స్ డిప్యూటీ కమీషనర్ సత్తయ్య ముప్పయేళ్ళ పరిచయాల్తో పావులు కదిలించి సాధించి పెట్టాడు.



"విక్రాంత్! తాలూకా కేంద్రంలో మనం బలంగా ఉంటేనే సరిపోదు. రాజధాని కేంద్రంలో కూడా మనదంటూ ఒక లాబీ ఉంటేనే అన్నిటా ఎదగడం సాధ్యం" అన్నాడు అరవింద్.

"నిజమే" అన్నాడు విక్రాంత్.

అరవింద్, లత, విక్రాంత్, నిర్మల, అరుణ, సక్కుబాయి తదితరులందరి సహకారంతో ఎమ్మెల్యేగా నాలుగువేల ఓట్ల మెజారిటీతో గెలిచింది రాధ.

అరుణ తండ్రి దయాకర్ రావు నిజామాబాద్ జిల్లాలో ఓడిపోయాడు.

అరుణ మొత్తంగా డీలా పడిపోయింది. ఇల్లు తప్ప ఉన్న ఆస్తులన్నీ కరిగి పోయాయి.

"అరుణా! మన భావాలు గెలిచాయి. మీ నాన్న ఓడినందుకు నాకూ బాధగానే ఉంది. కానీ ఓడిపోవడమే చారిత్రక అవసరం. ఓడిపోవడం వల్ల అతని సర్‌ప్లస్ తగ్గింది. గెలిచివుంటే ఆ సర్‌ప్లస్‌తో పాటు, పెత్తనం పెరిగి ఉండేది. తద్వారా అది అతని కులాహంకారాన్ని మరింత పెంచేది. అలా జరగనందుకు సంతోషించాలి మనం." అనునయంగా అంది డాక్టర్ లత.

"వదినా! ఎంత అన్యాయంగా మాట్లాడుతున్నావు. నాకు ఆ బాధ కన్నా నువ్వన్నమాటే కష్టంగా ఉంది" విషాదంగా అంది అరుణ.

"సారీ అరుణా! నిన్ను బాధ పెట్టాలని కాదు" అని ఓదార్చింది లత. అరవింద్ ఎంత ఓదార్చినా కాదని ఒంట్లో బాగాలేదని పిల్లల్ని తీసుకొని నిజామాబాద్ వెళ్ళిపోయింది అరుణ.

ఎమ్మెల్యేగా గెలిచిన రాధ జీవితాన్ని కూడా గెలుచుకుంది. క్లాసుమేటూ, డైవోర్సీ అయిన డాక్టర్ రాజేశ్వర్‌తో రాధ పెళ్ళి అరవింద్ పెళ్ళికన్నా ఘనంగా జరిగింది.

"నిర్మలా! నీ పెళ్ళెపుడో!" నవ్వుతూ అడిగింది డాక్టర్ లత.

"నాకు రాధక్కలా నాన్న లేడు గదా! దారి చూపడానికి" అని నవ్వింది నిర్మల. ఆ నవ్వులో విషాదంపొర. మళ్ళీ తనే అంది.

"నాన్న నన్ను ఆనంద్ బావకిచ్చినా నా బతుకిలా అయ్యేది కాదు."

"నిర్మలా! గతం ఎపుడూ తిరిగిరాదు. గతాన్ని తలుచుకొని ఏడ్చి లాభంలేదు. గతాన్ని ద్వేషించి లాభం లేదు. ప్రస్తుతం ఏం చేయాలో గతం

తాలూకు అనుభవాల్తో వర్తమానంలో నిలబడి వాస్తవికంగా ఆలోచించి గెలుచుకోవడమే జీవితం. ఇంకొన్నాళ్ళుపోతే నీకూతురే పెళ్ళికెదిగేట్టుంది. ఏం సాధించినా యింకో రెండుమూడేళ్ళలోనే సాధించుకోవాలి” అంది లత.

“ఎన్ని కష్టాలు పడితే, ఎన్ని ఓర్చుకుంటే కాంతయ్య పేరుకచ్చిండో ఎరికేనా కోడలా? రేపు నిర్మల ఎవర్నైనా చేసుకుంటే ఆ పిల్లను వచ్చినోడు సరిగా చూస్తడో లేదో” అంది సక్కుబాయి.

“ఇప్పటికే ఆలస్యం అయింది. సరైన నిర్ణయం తీసుకో. ఒక ఏడాది రాజకీయాల్లో రాధతో తిరుగు, అనుభవం పెరుగుతుంది.” అన్నాడు అరవింద్.

“నాకు రాజకీయాలమీద ఆసక్తిలేదు. నా పిల్లల భవిష్యత్తు ముఖ్యం” అంది నిర్మల.

“నిర్మలక్కది తల్లి మనస్సు.” అంటూ అభినందించింది డాక్టర్ అరుణ.

**ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక**

**సెప్టెంబర్ 1999**



జీవిత పరిచయం స్థానంలో...

# సిద్ధాంతాలేవీ మానవత్వానికి మించినవి కావు

బి.ఎస్.రాములుగారు ప్రఖ్యాత సామాజిక తత్వవేత్త. తెలుగు కథకు తాత్విక స్పర్శ అద్దిన కథకులు. భారత ఉపఖండంలో బహుజన చైతన్యాన్ని తెచ్చిన దార్శనికుల్లో ఒకరు. వీరి జననం - 23-08-1949 కరీంనగర్ జిల్లా జగిత్యాల.

300 పైగా వీరి సిద్ధాంత వ్యాసాలు... పలు పుస్తకాల ప్రచురణ... 100 పైగా పీఠికలు... సమీక్షలు... వేలాది లేఖలు... దేశవ్యాప్త పర్యటనలు... వందలాది తత్వప్రసంగాలు... 125 పైగా కథలు... 6 నవలలు...

వీరు ఎందరినో కథకులుగా తీర్చిదిద్దారు. కథకుల వర్క్‌షాపులు నిర్వహించారు. 1982లోనే వీరిని గోర్కి, లూసన్ అని ప్రశంసించారు. ప్రస్తుతం ప్రపంచంలోని సామాజిక తత్వశాస్త్రాల్ని జీవశక్తిగా మార్చుకొని పూర్తికాలం కేటాయించి సమకాలీన సామాజిక తత్వశాస్త్రాల్ని రూపొందిస్తున్నారు.

సుప్రసిద్ధ సాహితీవేత్త ,కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత, రిటైర్డు ప్రొఫెసర్ ప్రస్తుతం “మనభూమి” మాసపత్రిక సంపాదకులైన డా॥ కేతు విశ్వనాథ రెడ్డిగారు బి.ఎస్.రాములుగారిని చేసిన ఇంటర్వ్యూ పాఠకుల సౌకర్యార్థం అందిస్తున్నాం.

**– కొక్కుల భాస్కర్, గూడూరి సీతారాం, సంపాదకులు**

ప్ర. మీ రచనా వ్యాసంగాన్ని ప్రభావితం చేసిన నేపథ్యం ఏమిటి?

జ: బాల్యంలో చాలా కథలు వినేవాడిని. గ్రామీణ కళారూపాలు, అమ్మ చెప్పేకథలు, సాహిత్యంపై ఆసక్తిని పెంచేవి. సుమారు 5వ తరగతి నుండి స్కూల్‌లో ఆటలపోటీలు, క్లాసు డెకొరేషన్ మొదలైన వాటిల్లో బహుమతులు వచ్చేవి. “చందమామ”, “బాలమిత్ర” చదవడం ద్వారా ఒక గొప్ప ఊహాలోకం దృశ్యమానం అయ్యేది. మహాకవి భారవి గురించిన కథ “చందమామ”లో చదివిన తరువాత రచనకు గొప్ప శక్తి ఉంటుందని, మనిషిని మార్చుతుందని ఒక విశ్వాసం కలిగింది. 9వ తరగతిలో పద్యలక్షణాలు విన్న తరువాత పద్యరచన ప్రారంభించాను. ఇలా 1964లో 13, 14 ఏళ్ళ వయస్సులో నా రచన ప్రారంభమైంది. విద్యార్థిగా ఉన్నప్పుడే స్కూల్ మ్యాగజైన్‌లో, ఆనాటి పత్రికల్లో కొన్ని రచనలు అచ్చయ్యాయి. ముఖ్యంగా హైస్కూల్‌లో ఉపన్యాసాల పోటీల్లో, వ్యాసరచన పోటీల్లో బహుమతులు నన్ను ఆత్మవిశ్వాసంతో నిలబెట్టాయి. కాని ఆధునిక సాహిత్యంలో, ఆధునిక

ప్రక్రియలను చేపట్టడానికి ఉపాధ్యాయుల శక్తి పరిమితం కావడం వల్ల, నేను స్వయంగా వాటిని నేర్చుకోవలసివచ్చింది. అలా 1968లో మొదటి కథ 'బాలమిత్ర'లో అచ్చయింది.

ప్ర. **మీ తాత్త్విక దృక్పథంలో వచ్చిన పరిణామాలను ఏయే చారిత్రక ఘటనలు, సన్నివేశాలు తోడ్పడ్డాయి?**

జ: నేను మొదట ఆరెస్సెస్ (రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్)లో పనిచేశాను. 1964 నుండి అందులో పాల్గొనేవాణ్ణి. 1967 నుంచి 1972వరకు ముఖ్య శిక్షక్‌గా పనిచేశాను. మా మేనమామ బొంబాయి మిల్లు కార్మికునిగా పనిచేసి, ఇల్లు చేరాడు. ఆయన ఇంట్లో పురాణాలు మొదలైన గ్రంథాలు ఉండేవి. మా పెదనాన్న మిట్టపెల్లి రాజయ్య అచలతత్త్వయోగిగా, పలు ప్రాంతాలు తిరిగేవాడు. ఆధ్యాత్మిక చర్చలు మా ఇళ్ళల్లో కొన్ని పండుగల్లో గంటల తరబడి జరిగేవి. ముఖ్యంగా శుక్రవారం పూజ, చనిపోయిన తరువాత చేసే కర్మల సందర్భాలలో ఇలాంటి చర్చలు జరిగేవి. 10వ తరగతి నుంచి 12వ తరగతి వరకు వ్యాపారశాస్త్రం, అర్థశాస్త్రం, పౌరనీతిశాస్త్రం ఆప్షన్స్‌గా చదవడం జరిగింది. వీటికి తోడు 1964 నుండి 1975 వరకు కొన్నివేల గ్రంథాలు అన్ని ప్రక్రియల్లో చదవడం జరిగింది. 1964 నుండి పాఠ్యపుస్తకాల్లో అర్థశాస్త్రంలో మార్క్సిజం సమ సమాజాన్ని కోరినట్లుగా, విన్న పాఠాలు ఎంతో ప్రభావం చూపాయి. 1974లో మా తోడళ్ళుడు కల్లూరి నారాయణ సాంగత్యంవల్ల ఆచరణాత్మకంగా వామపక్ష భావజాలంలోకి మారడం జరిగింది.

1977 నుండి విప్లవ ప్రజాసంఘాలలో, అంబేద్కర్ సంఘాలలో, పౌరహక్కుల సంఘాలలో, విప్లవ రచయితల సంఘంలో ఏకకాలంలో పనిచేయడం జరిగింది. ఆ క్రమంలో 1984లో ప్రభుత్వ ఉద్యోగాన్ని వదిలేసి పూర్తికాలం కార్యకర్తగా నక్సలైట్ సంస్థల్లో పనిచేశాను. రాడికల్ యువజన సంఘం రాష్ట్ర ప్రధాన కార్యదర్శిగా దేశవ్యాప్తంగా విస్తృతంగా పర్యటించాను. అలా ఆచరణలో తిరిగి కులవివక్షత, కులసమస్య పరిష్కారం కోసం ఎదురైంది. ఇందువల్ల భగత్‌సింగ్‌లాగే అంబేద్కర్‌ను సొంతం చేసుకొని కులసమస్యపై కూడా పనిచేయాలని పార్టీని కోరాను. అప్పుడు పార్టీ నిరాకరించింది.

1990 ఏప్రిల్‌లో బహిరంగ జీవితంలోకి వచ్చాను. ప్రభుత్వం తిరిగి పాత ఉద్యోగం ఇచ్చింది. బహిరంగ జీవితంలోకి వచ్చాక నా అనుభవాలను, అధ్యయనాన్ని సమన్వయించి తాత్త్విక రంగంలో కృషి చేశాను. అలా గతితర్క తత్త్వదర్శన భూమిక, గతితర్కం-అంబేద్కరిజం-మార్క్సిజం, బహుజనతత్త్వం, బి.సి.లు ఏం చేయాలి?, ప్రేమ అంటే ఏమిటి?, భౌతికవాద ప్రాపంచిక దృక్పథం, జ్ఞానం పుట్టుక, మొదలైన తాత్త్వికగ్రంథాలు వ్రాశాను. భారతీయ సమాజం "నేటి రాజకీయ, సామాజిక



పరిణామాలు" పేరుతో భారతీయ, రాజకీయ, సామాజిక వ్యవస్థ పరిణామాలను గ్రంథస్థం చేశాను. 'సాహితీ చరిత్రను కొత్తచూపుతో తిరగరాయాలి', అని, యువకథకులు నాలాగా గైడ్‌లైన్స్ లేకుండా ఉండకూడదని, వారికోసం కథలబడి, కథాసాహిత్య అలంకారశాస్త్రం వ్రాశాను. వందలాది సాహిత్య, సైద్ధాంతిక వ్యాసాలు, వేల ప్రసంగాలు చేశాను. అయితే అదంతా తెలుగు భాషకు పరిమితం కావడం బావిలో కప్పలా భావాలు ప్రపంచానికి చేరకుండా మిగిలిపోవడం బాధకలిగిస్తున్నది. ఇంగ్లీషులోకి అనువాదమై, ప్రపంచ భావజాలంతో సంభాషించాలని ఉంది. ఇప్పటికీ ఈ కోరిక నెరవేరడంలేదు. నా రచనలు ఇంగ్లీషులోకి వచ్చినప్పుడే ప్రపంచం వాటి అవసరాన్ని గుర్తిస్తుందని భావిస్తున్నాను.

ఇలా నేను భాష కారణంగా, ప్రాంతం కారణంగా, మతం కారణంగా సర్వమానవ శ్రేయోభిలాషి నుండి హిందూవాదంలోకి, అటుతరువాత పీడిత, పేద వర్గాల భావజాలంలోకి అటు తరువాత 'పేద కులాల శ్రేయస్సు' అనే దృక్పథంలోకి పయనిస్తూ, అట్టడుగు ప్రజలను చేరుకొని సర్వమానవాళి అభివృద్ధికి ఇదే సరైన పునాది అని భావించడం జరిగింది. ఇలా తాత్త్విక దృక్పథాలు మారడంలో వ్యక్తిగత జీవితంలో ఆయా సంస్థల నుండి ఎదురైన చేదు అనుభవాలుకూడా కలిసివున్నాయి. అలాంటి చేదు అనుభవాలు లేకపోయి ఉంటే, ఒక సంస్థ నుండి మరో సంస్థకు మారవలసిన అవసరం ఏర్పడకపోవచ్చు. అందువల్ల నా తాత్త్విక పరిణామంలో వ్యక్తిగత అనుభవాలు కూడా ప్రధాన పాత్ర వహించాయి. ఇవి కేవలం వ్యక్తిగత అనుభవాలు కావు. సత్యాన్వేషణలో భాగంగా సామాజిక చరిత్ర, పరిణామాల్లో భాగంగా జరిగిన పరిణామాలివి.

ప్ర: **ఒకవైపు దళిత ఉద్యమంలోను, మరోవైపు తెలంగాణ అస్థిత్వ చైతన్యంలోను మీకు సన్నిహిత సంబంధాలు ఉన్నాయి కదా? వీటి పట్ల మీ వైఖరి ఏమిటి?**

జ: నాకు మొదటినుండి పేదలపక్షాన, పీడితుల పక్షాన ఆలోచించడం అలవాటైంది. స్వయంగా నేను కూడా పేదరికంలో పుట్టి పెరిగినవాణ్ణి. బొంబాయి బట్టలమిల్లు కార్మికుడుగా పనిచేసిన మా నాన్న నా ఆరో ఏట చనిపోయాడు. అమ్మ జగిత్యాలలో బీడీలు చేసి మమ్ములను పెంచి పోషించింది. కనుక పేదలపక్షాన ఆలోచించడం జన్మతః అలవడింది. నా జీవితమంతా ఆ ఆచరణకే అంకితమైంది. 'విరసం' నుండి 92లో వైదొలగాను. దళిత ఉద్యమాన్ని, దాని భావజాలాన్ని విస్తరించడంలో భాగంగా "దళిత రచయిత మేధావుల ఐక్యవేదిక"ను 1992లో ఏర్పాటు చేయడం జరిగింది. ఇది బిసి, ఎస్సీ, ఎస్టీ, మైనారిటీలందరి ఐక్యవేదిక. దీనికి నేను వ్యవస్థాపక అధ్యక్షుడిని. ఇది రాష్ట్రంలో సాహిత్య చరిత్రను, సామాజిక ఉద్యమాల భావజాలాన్ని మలుపుతిప్పింది.

అలాగే తెలంగాణా ప్రాంతం అభివృద్ధిలో సంస్కృతి, సాహిత్య వికాసంలో ప్రత్యేక రాష్ట్రంగా ఉండడం అవసరమని గుర్తించడం జరిగింది. 1921లో మద్రాసు రాష్ట్రం నుండి ఆంధ్ర ప్రత్యేక రాష్ట్రం కావాలని కోరడం జరిగింది. అలాగే ఇప్పుడు తెలంగాణా ప్రత్యేక రాష్ట్రం వల్ల అపార్థాలు తొలగి అందరూ పోటీ పడి అభివృద్ధి చెందడం సాధ్యపడుతుంది.

నాకు అప్పుడప్పుడు అనిపిస్తుంటుంది. దూరంగా నిలబడ్డ తత్త్వవేత్తలాగా ఆయా విషయాలపట్ల ఎందుకు డిటాచ్‌మెంట్‌తో మాట్లాడలేకపోతున్నానని! బుద్ధునిలాగా, ఆచార్య నాగార్జునునిలాగా నేను మధ్యేమార్గాన్ని ఎన్నుకొని తటస్థవాదిగా ఎందుకు చెప్పడం సాధ్యం కావడంలేదు అని బాధపడుతుంటాను. ఎక్కడ సమస్య ఉంటే అక్కడ వారిలో ఒకడిగా కలిసిపోయే తత్త్వం అబ్బడంవల్ల, సామాజిక కార్యకర్తగా కూడా పనిచేయడంవల్ల ఇలా జరుగుతున్నదనుకుంటున్నాను. దీనివల్ల నేను దళితవాదం గురించి మాట్లాడితే దళితుడ్ని అనుకుంటున్నారు. తెలంగాణా గురించి మాట్లాడితే తెలంగాణావాదిని అనుకుంటున్నారు.

ఒక తత్త్వవేత్తపట్ల ఇలా ఆలోచించడం సరైనది కాదని అనుకుంటున్నాను. ఉదాహరణకు ఒకముఖ్యమంత్రి, ఒక ప్రధానమంత్రి అందరి సభలకు వెళ్తారు. వారి సమస్యల్ని పరిష్కరించడానికి హామీ ఇస్తారు. వారికి మద్దతు కూడా తెలుపుతారు. అయినంతమాత్రాన అతడు అందరి ప్రతినిధి కాకుండా పోతాడా? తత్త్వవేత్త కూడా సర్వమానవ శ్రేయస్సు కోరే మానవతా వాదంలో భాగం కాని ఆయా ఉద్యమాలలో వాదాలను పట్టించుకొని మద్దతు ఇవ్వడం జరుగుతుంది. మార్గదర్శనం చేయడం జరుగుతుంది. నా జీవితం అనుభవాలన్నీ ఈ అంతస్సూత్రంతో ముడిపడి ఉన్నాయి.

వాదాలు, సిద్ధాంతాలు అన్నీ వాటికవే స్వతంత్రమైనవి కావు. ప్రజలు తమ సమస్యల పరిష్కారం కోసం, ముందుకు సాగే క్రమంలో వారికి అందుబాటులో ఉన్న వాదాలను, సిద్ధాంతాలను స్వీకరిస్తారు. అనగా ఈ వాదాలు, సిద్ధాంతాలు ప్రజలకు తొడుక్కునే డ్రెస్‌ల వంటివి. కాని వాటి ఆధారంగా సంస్థలు నిర్మించేవారు ప్రజలకు అవి ప్రాణం అని చెబుతున్నారు. ప్రాణశక్తి మనిషిలోనే ఉంది. అందువల్ల వాదాలను, సిద్ధాంతాలు అన్నీ మానవతకు మించినవి కావు. మానవతావాదిగా మాత్రమే నేను ఆయా సమస్యలు, సిద్ధాంతాలు చర్చించడం జరుగుతుంది.

అభివృద్ధి, అధికారం, స్వేచ్ఛా సమానత్వం అందినవారికి, అది అందాల్సిన వారికి మధ్య వుండే అంతరం లేదా వైరుధ్యమే అన్నిటిలో కీలకాంశం. అదే పలురూపాల్లోకి, ఉద్యమంలోకి, సిద్ధాంతాల్లోకి మారుతుంది. ఆధిపత్యంలో ఉన్నవాళ్ళు ప్రేమపూరితంగా మొత్తం సమాజానికి అందించే కృషి చేస్తే సమాజం



శాంతియుతంగా, ప్రేమపూరితంగా, కరుణార్ద్రంగా పరిణామం చెందుతుంది. ఈ క్రమాన్ని నిరాకరిస్తే ఘర్షణ, పోరాటాలు తలెత్తుతాయి. ఎలాగైనా అంతరాలు ఎప్పటికప్పుడు తొలగిస్తూ మెజారిటీ ప్రజలకు అభివృద్ధి, అధికారం, స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం, చేయూత అందించకతప్పదు. భారత రాజ్యాంగం దీన్ని అనుమతిస్తున్నది. తన మౌలిక లక్ష్యం ఎక్కడో ప్రకటించుకొన్నది. అందువల్ల బుద్ధుడు చెప్పిన ప్రేమ, కరుణ, శాంతి, స్వేచ్ఛ, సమానత్వం విలువలద్వారా ప్రతి మనిషికి ఒకే ఓటు, ఒకే విలువ అనే సూత్రాన్ని అన్నిరంగాల్లో ఆచరణలోకి తీసుకురావడం ద్వారా శాంతియుత పరివర్తన సాధ్యమవుతుంది. అమెరికా, యూరోపు దేశాల్లాగా జపాన్‌లాగా భారతదేశం ప్రపంచంలో ఒక సంపన్న రాజ్యంగా ఎదుగుతుంది.

ప్ర: **మీరు దళితోద్యమంలో విశాల ప్రాతిపదికతో పనిచేస్తున్నారని అంటారు. కాని పద్మశాలీలకు సంబంధించిన సమస్యలను మీరు పూర్తిగా పట్టించుకోలేదని కొందరి భావన. ఏమంటారు మీరు?**

జ: మనదేశంలోని కులవ్యవస్థవల్ల ఏదో ఒక కులంలో పుట్టక తప్పదు. అయితే ఆ కుల స్వభావం వదులుకొని, మానవులుగా ఎదగడం ద్వారానే భారతదేశం ఒక సమష్టి సమాజంగా సామాజిక అసమానతలు లేని సమాజంగా ఎదగడం సాధ్యపడుతుంది. వామపక్ష భావజాలంలో ఉండటంవల్ల నేను పుట్టిన 'పద్మశాలి' కులం గురించి వ్రాస్తే నన్ను కులతత్త్వవాదిగా ప్రచారం చేస్తారేమోననే సంకోచం ఉండేది. ఇప్పటికీ ఉంది. అయినప్పటికీ మీరు పేద పద్మశాలి కులంలో పుట్టి పేదకులస్థుల, వారి సంస్కృతి గురించి, అభ్యున్నతి గురించి మీరు వ్రాయకపోతే ఎవరు వ్రాస్తారు. ఈ కులం గురించి తెలిసినవాళ్ళు వ్రాయకపోతే మరెవరు వ్రాస్తారు? ఈ కులంలో పుట్టిన మేధావిగా, రచయితగా మిమ్ములను చూసి మేమెందుకు గర్వించాలి? గౌరవించాలి? ఈ పద్మశాలి సమాజానికి మీరు సాహిత్య, సైద్ధాంతిక రంగంలో ఇచ్చే మద్దతు ఏమీ లేనపుడు మీరు ఈ కులంలో పుట్టి ఏం ప్రయోజనం? అని సీరియస్‌గా చాలాచోట్ల ప్రశ్నించారు. ఆ ప్రశ్నకు నా దగ్గర జవాబు లేదు. జవాబుగా కొన్ని కథలు, వ్యాసాలు వ్రాశాను. అలా వ్రాసిన తరువాత నన్ను కులతత్త్వంలో కూరుకుపోయాడు అన్నవాళ్ళు కూడా ఉన్నారు.

ప్ర: **మీరు విశాల సాహిత్య సంస్థాపకులు. కథా శిక్షణా శిబిరాలు నిర్వహించారు. సాహితీ కథా పురస్కారాలను కూడా ఇచ్చారు. మీ పుస్తకాలను, ఇతరుల పుస్తకాలను ఎంతో అందంగా అచ్చు వేస్తున్నారు? వీటన్నిటికి అవసరమయ్యే నిధులు ఏరకంగా సమకూర్చుతున్నారు?**

జ: నేను సుమారు 65 పుస్తకాల వరకు అచ్చు వేశాను. ఇందులో నేను వ్రాసినవి 20

మాత్రమే. 'పాలు-సదువు', 'స్మృతి', 'మమతలు -మానవ సంబంధాలు', 'వేపచెట్టు', 'తేనెటీగలు', కథాసంపుటాలు వెలువరించాను. 'బతుకుపోరు' నవల మూడవ ముద్రణ ఇటీవల వెలువడింది. 'పాలు - సదువు' కథల సంపుటి దళితుల జీవితాల్లో గత నలభై ఏళ్ళలో విద్యవల్ల, ఉద్యమాలవల్ల వచ్చిన పరిణామాలు, వాళ్ళు ఎదిగినతీరు, ఎదగలేకపోతున్న తీరు, ఒక సామాజిక చరిత్రను అందిస్తుంది. అలాగే 'స్మృతి' కథల సంపుటి తెలంగాణాలోని ముప్పై ఏళ్ళ సామాజిక చరిత్రను, సంస్కృతిని, ఉద్యమాలను, వాటి పరిణామాలను తెలుపుతుంది. 'మమతలు-మానవ సంబంధాలు' కథల సంపుటి తెలంగాణాలోని నూరేళ్ళ సామాజిక సంబంధాలను, మానవ సంబంధాలను, కుటుంబ సంబంధాలను అవి మారుతున్న తీరును చిత్రించింది. 'వేపచెట్టు' కథల సంపుటి గ్లోబలైజేషన్ వల్ల కలుగుతున్న లాభనష్టాలను కథల రూపంగా సామాజిక పరిణామాల రూపంలో చిత్రించింది. 'తేనెటీగలు' కథల సంపుటి విప్లవ పోరాటాలు, వాటి పరిణామాలు, నిర్బంధాలు, మారుతున్న సమాజాన్ని చిత్రించింది. 'బతుకు పయనం' కథల సంపుటిని చేనేత కులాల జీవిత పరిణామాలను ఒక క్రమ పద్ధతిలో తెలిపేవిధంగా తీసుకురావాలని వుంది.

తెలంగాణ వేల ఏళ్ళ చరిత్ర గురించి 'తెలంగాణ తల్లి ఎరుక' గ్రంథాన్ని వెలువరించాను. 50వ జన్మదినం సందర్భంగా వెలువరించాల్సిన సావనీర్‌ను 56వ జన్మదినం సందర్భంగా ఇటీవల వెలువడింది. సావనీర్‌లకు భిన్నంగా ఇందులో ఎలాంటి వ్యాపార ప్రకటలను లేకుండా తీసుకురావడం జరిగింది. 50వ జన్మదినం నుండి పెద్దఎత్తున సాహిత్య సదస్సులు ఏటా నిర్వహిస్తున్నాము. కరీంనగర్ జిల్లాలో యువరచయితలకు స్ఫూర్తి నివ్వడానికి ప్రారంభమైన ఈ సదస్సులు రాష్ట్రవ్యాప్తంగా స్ఫూర్తినివ్వడం సంతోషాన్ని కలిగించి వేశాయి.

దళిత రచయితల, కళాకారుల, మేధావుల ఐక్యవేదిక తరపున చేయాలనుకున్న కార్యక్రమాలు దాని నిర్మాణ రూపం రీత్యా చేయలేకపోయాను. అందువల్ల 1990లో ప్రచురణ సంస్థగా ప్రారంభమైన 'విశాలసాహితి'ని 1995 నుండి సాహిత్య సంస్థగా విస్తరించడం జరిగింది. కష్టనష్టాలకు ఓర్చి పుస్తకాలు తీసుకురావడం, సభలు, సదస్సులు ఏర్పాటు చేయడం జరుగుతున్నది. ఇటీవల కాలంలో సుమారు ఆరు లక్షల రూపాయలు ఇందుకోసం ఖర్చు చేయడం జరిగింది. మా పెద్దబ్బాయి అమెరికా వెళ్ళడంవల్ల పిల్లల చదువులకు అన్నీ అతడే ఖర్చుపెట్టడం వల్ల నేను నా జీతాన్ని సభలకు, పుస్తకాలకు ఖర్చు పెట్టాను. ఆయన పంపిన డబ్బులున్నాయి కదా అని మొదట్లో ఏడేళ్ళ క్రితం (1998) రెండు లక్షల రూపాయలు ఖర్చు పెట్టాను. అతను "నేను కష్టపడి పంపిస్తే ఇలా ఖర్చు చేస్తారా?" అని పంపడం మానేసాడు. ఆ తర్వాత నేను "నా ఆస్తులమీద మీరు ఆశపడకండి" అని పిల్లలకు చెప్పాను. అలా నా ఆస్తులను అమ్మేసి ఆ వచ్చిన డబ్బును ఖర్చు పెడుతూవస్తున్నాను. అయితే ఈ విషయం తెలియనివాళ్ళు "ఆయనకేం కొడుకు పంపిస్తున్నాడు" అని అంటుంటారు. లక్షలాది మంది తల్లిదండ్రుల పిల్లలు కోట్లు సంపాదిస్తున్నారు. ఆ తల్లిదండ్రులెందుకు సమాజసేవ చేయడంలేదు? వారుగానీ వారి పిల్లలుగానీ ఎందుకు ఇతరుల పుస్తకాలు అచ్చువేయడం లేదు? ఇతరుల కోసం సాహిత్య సదస్సులు ఎందుకు పెట్టడంలేదు? ఈ ప్రశ్న ప్రతిఒక్కరూ వేసుకోవడం అవసరం. ఇతరులకు సహకరించడం అవసరం.

పరోపకారం చేయలేని వాళ్ళు దానిని చేసే వారిని భరించడం కూడా కష్టమైన కాలంలోకి వచ్చేశాము. ఏ స్వార్థం లేకపోతే ఎందుకు చేస్తారు? అనేది వారి ప్రశ్న. ఆ ప్రశ్న వారి స్వార్థాన్ని, సంకుచిత స్వభావాన్ని తెలియజేస్తుంది.

నాకు సాహిత్య వైతాళికులైన ప్రేమ్‌చంద్, గోర్కి, వట్టికోట ఆళ్వారుస్వామి ఆదర్శం. యువతరానికి చేయూత నీయడమనేది వారినుంచి పొందిన స్ఫూర్తే. పోయేటప్పుడు ఏం తీసుకుపోతాం? ఎవరైనా పోయేటప్పుడు ఏం తీసుకుపోతారు? ఇక్కడ బూడిద కావడం తప్ప.

ఈ బతుకు పొద్దు పడమటికి వంగిపోయింది. జీవిత చరమాంకం ఇంకా ఎంతో దూరంలోలేదు. ఆరోగ్యం బాగున్నపుడే చేతనైనంత చేయాలని సంకల్పం. అయితే అమ్మడానికి ఇప్పుడు ఆస్తులేమీ లేవు. ఇకనుండి ఇతరులు సహకరిస్తేనే ముందుకు పోవడం సాధ్యం. పుస్తకాలు వేయడం సాధ్యం. ఇప్పటికి రాసింది తక్కువ. రాయాల్సింది ఇంకా ఎంతో ఉంది. ఒక ప్రేమ్‌చంద్‌లా, ఠాగూర్‌లా తెలుగు సమాజాన్ని దాని సమస్త పరిణామాలను కథలుగా, నవలలుగా చిత్రించాలని వుంది. అందుకోసం జీవితంలోని పూర్తికాలాన్ని అంకితం చేయాలని సంకల్పం. రెండేళ్ళుగా విరివిగా రాయడం ఇందువల్లే సాధ్యపడింది.

**ఇంటర్వ్యూ - ఆచార్య డా. కేతువిశ్వనాథ రెడ్డి**

**'మన భూమి' మాసపత్రిక - ఆగస్టు 2005**
**'పద్మపీఠం' మాసపత్రిక, 'దట్స్ తెలుగు డాట్‌కాం'**

సమీక్షల్లోంచి...

బి.ఎస్.రాములుగారు 50వ జన్మదిన సంచిక గురించి

## తెలంగాణ మణిపూస

వర్తమాన సాహిత్య, సామాజిక వాస్తవ పరిస్థితులకు దర్పణం బి.ఎస్ రాములు జన్మదినస్వర్ణోత్సవ సంచిక. పేరుతో సంచిక అని ఉన్నా, నిజానికి ఇది ఉద్గ్రంథమే అని ఒక్కసారి చదివితే అనిపిస్తుంది. తెలంగాణా 'కథల బడి'లో అనేక సమకాలీన కథలకు, కవులకు 'సామాజిక చింతన' నేర్పించిన 'ఆధునిక సామాజిక తత్వవేత్త'గా బిఎస్ రాములు అంతరంగ ఆవిష్కరణం ఈ పుస్తకంలో కనిపిస్తుంది.

ఆయన 50వ జన్మదినం సందర్భంగా సాహితీరంగంలోని ప్రముఖుల వ్యాసాలు, సందేశాలతో ఈ పుస్తకాన్ని వెలువరించారు. రాములు స్వయంగా చేసిన రచనలుకూడా ఇందులో కొన్ని ఉన్నాయి. ఏడు భాగాలుగా ఉన్న ఈ గ్రంథంలో బాల్యం నుంచి సాహితీవేత్తగా, తత్వవేత్తగా బిఎస్ అంచెలంచెలుగా పరిణతిచెందిన క్రమాన్ని ఆయా రచయితలు చక్కగా విశ్లేషించారు.

పేదరికం, అజ్ఞానం గూడుకట్టిన మనుషుల మధ్య మణిదీపంలా వెలుగులు ప్రసరిస్తున్న బిఎస్ రచనల్లో 'వ్యథార్త జీవుల వ్యధార్థ దృశ్యాలు కళ్లెదుట నిలిచి, ప్రతి ఒక్కరిని నేలపై నిలబెట్టి ఆలోచింపచేస్తాయి. కరీంనగర్ జిల్లాలో బీడీ కార్మికురాలి బిడ్డడే అయినా, తెలుగు తల్లి మరో ముద్దుబిడ్డగా ఎదిగారు బిఎస్. 'పోరాటం ఎక్కడో లేదు. బతుకులోనే పోరాటం ఉంది. మన బతుకే ఒక పోరాటం. ఒక స్థాయి బతుకు బతకటమే ఒక పోరాటంగా సాధించుకోవాల్సిన జీవితాలు మనవి. అందువల్ల మన జీవిత యధార్థ చిత్రణే ఒక గొప్ప సామాజిక విప్లవనవల, కథ అవచ్చు' అని బిఎస్ ప్రకటించిన అభిప్రాయం ఆయన రచనల నేపథ్యమేమిటో తెలుపుతుంది.

కథకుడిగా తెలంగాణ ప్రజల దీనస్థితిని అక్షరీకరించారాయన. కొన్ని డజన్ల కథలు, ఆరు నవలలు, దాదాపు మూడువందలకుపైగా సిద్ధాంత సాహిత్య వ్యాసాలు, పది తాత్విక గ్రంథాలు, ఇంకా అనేకానేక రచనలు చేశారాయన. 'ప్రజా జీవితాన్ని సాహిత్యంలో సామాజికతగా విశిష్టమైన రీతిలో ముందుకు తెచ్చిన కొద్దిమందిలో బిఎస్ ఒకరు. ఇదే తరహాలో తన కృషి కొనసాగించి జీవిత రెండవ స్వర్ణోత్సవాలనుకూడా ఇదే స్థాయిలో చేసుకుంటారని ఆశిద్దాం.

**ఎ.వి.వి.ప్రసాద్, ఆదివారం వార్త, 3-4-2005**



# బి.ఎస్. రాములు గారి రచనలు

**తత్వ శాస్త్రం - సామాజిక శాస్త్రాలు**

| | |
|---|---|
| 1. నేనెవరు గతితర్క తత్వదర్శన భూమిక | 100-00 |
| 2. ప్రేమంటే ఏమిటి? | 20-00 |
| 3. జ్ఞానం పుట్టుక | కాపీలు లేవు |
| 4. భౌతికవాద ప్రాపంచిక దృక్పథం | కాపీలు లేవు |
| 5. బహుజనతత్వం (2003) (బీసీ,ఎస్సీ,ఎస్టీల సిద్ధాంతాలు కార్యాచరణ) | 250-00 |
| 6. బీసీలు ఏంచేయాలి? (2004) | 75-00 |
| 7. బీసీ, ఎస్సీ, ఎస్టీ విద్యార్థి యువజనులారా! (2004) | 10-00 |
| 8. భారతీయ సమాజం - నేటి రాజకీయ సామాజిక పరిణామాలు (2004) | 75-00 |
| 9. తెలంగాణా తల్లి ఎరుక (2005) | 10-00 |

**కథలు - నవలలు**

| | |
|---|---|
| 1. బతుకు పోరు - నవల | 40-00 |
| 2. పాలు - సదువు - ఇతర కథలు | 30-00 |
| 3. స్మృతి-కథల సంపుటి | 40-00 |
| 4. మమతలు-మానవ సంబంధాలు - కథల సంపుటి | 60-00 |
| 5. వేపచెట్టు (తెలంగాణ కథలు) | 50-00 |
| 6. తేనెటీగలు - కథల సంపుటి | 75-00 |
| 7. బతుకు పయనం - కథల సంపుటి | 45-00 |

**సాహిత్య సిద్ధాంతాలు - అలంకార శాస్త్రాలు**

| | |
|---|---|
| 1. సమగ్ర సామాజిక కథ 50 ఏళ్ళ తెలుగు కథ తీరు తెన్నులు | 250-00 |
| 2. కథల బడి-కథా సాహిత్య అలంకార శాస్త్రం | 100-00 |
| 3. సాహిత్య చరిత్రను కొత్త చూపుతో తిరగరాయాలి | 50-00 |

**100 పీఠికలు, 150 సాహితీ వ్యాసాలు**
**వందలాది తాత్విక సామాజిక ప్రసంగాలు**

# విశాల సాహితి బి.ఎస్. రాములు
# కథా పురస్కారాలు

| క్ర.సం. | రచయిత పేరు | కథల సంపుటి పేరు | ఏసంవత్సరం కోసం |
|---|---|---|---|
| 1. | దాశరథి రంగాచార్య | జీవనయానం (స్వీయ చరిత్ర) | 2002 |
| 2. | డా. కొలకలూరి ఇనాక్ | అస్పృశ్యగంగ (కథల సంపుటి) | 2002 |
| 3. | నంబూరి పరిపూర్ణ | ఉంటాయి మాకుషస్సులు (కథల సంపుటి) | 2002 |
| 4. | పులుగు శ్రీనివాస్ | సంకరవిత్తులు (కథల సంపుటి) | 2002 |
| 5. | కె. వరలక్ష్మి | మట్టి-బంగారం (కథల సంపుటి) | 2003 |
| 6. | నల్లాల లక్ష్మీరాజం | తిరుగుప్రయాణం (కథల సంపుటి) | 2003 |
| 7. | బెజ్జారపు వినోద్‌కుమార్ | గవ్వలమూట (కథల సంపుటి) | 2003 |
| 8. | కీ.శే.బిట్లనారాయణ | నా అంతరంగ తరంగాలు (స్వీయ చరిత్ర) | 2003 |
| 9. | బోయ జంగయ్య | బోజకథలు | 2001 |
| 10. | అంబల్ల జనార్ధన్ | బొంబాయి కథలు | 2001 |
| 11. | కుప్పిలి పద్మ | ముక్తి కథలు | 2001 |
| 12. | సింగమనేని నారాయణ | సింగమనేని కథలు | 2001 |
| 13. | పి. చంద్ | భూనిర్వాసితులు కథలు, శేషగిరి నవల | 2001 |
| 14. | పెద్దింటి అశోక్‌కుమార్ | వలస బతుకులు కథలు, ఎడారి మంటలు నవల | 2001 |
| 15. | ఓల్గా | ప్రయోగం, రాజకీయ కథలు | 2000 |
| 16. | ఎండ్లూరి సుధాకర్ | మల్లెమొగ్గల గొడుగు కథలు | 2000 |
| 17. | ఎ. అప్పలనాయుడు | ప్రత్యామ్నాయం కథలు | 2000 |
| 18. | వి. చంద్రశేఖర్‌రావు | లెనిన్ ప్లేస్ కథలు | 2000 |
| 19. | నాగప్పగారి సుందరరాజు | మాదిగోడు, మావూరి మైసమ్మ కథలు | 2000 |
| 20. | గంటేడ గౌరనాయుడు | ఏటిపాట కథలు | 2000 |
| 21. | కాలువ మల్లయ్య | 'మా కథలు' కథల సంపుటికి | 1999 |
| 22. | ముదిగంటి సుజాతారెడ్డి | 'విసుర్రాయి' కథల సంపుటికి | 1999 |
| 23. | శాంతి నారాయణ | 'పల్లేరు ముళ్ళు' కథల సంపుటికి | 1999 |
| 24. | కె.వి. నరేందర్ | అమ్మ, యుద్ధం, బురదలో జాబిల్లి | 1999 |
| 25. | నవీన్ | జీవితకాల కృషికి | 1998 |
| 26. | ఆడెపు లక్ష్మీపతి | నాలుగు దృశ్యాలు కథల సంపుటికి | 1998 |
| 27. | భూపాల్ | అంబల్లబండ కథల సంపుటికి | 1998 |